అట్టలోపలి వైపు అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యానిస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువున వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ, క్రీ॥శ॥ 2వ శతాబ్దం

(జాతీయ పురావస్తు ప్రదర్శన శాల, న్యూఢిల్లీ వారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# దువ్వూరి రామిరెడ్డి

డా. దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి



సాహిత్య అకాదెమీ

# ప్రస్తావన

దువ్వూరి రామిరెడ్డి ఈ శతాబ్దం ప్రథమార్థంలో తెలుగు సాహిత్య నందనోద్యానాన్ని కలకూజితం చేసిన కవి కోకిల. సామాన్య కర్షకుని జీవితాన్ని కావ్యవస్తువుగా మలచిన శిల్పి తెలుగులో పాస్టొరల్ కవిత్వానికి మార్గదర్శి. కవిత్వాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ ఒకే నాగలికి పూన్చి ఆంధ్ర కవితాకేదారంలో సేద్యం చేసిన కృషీవలుడు ఆంధ్ర రసలుబ్ధులకు సాహిత్య పానశాలలో కవితామరంద ధార నందించిన సఖి.

దువ్వూరి రామిరెడ్డి మహాకవీ, నాటక కర్తా, విమర్శకుడూ. ఆధ్యాత్మికతనూ, అభ్యుదయాన్నీ జోడించాడు. కావ్యకళకు సామాజిక ప్రయోజనాన్ని కూర్చాడు. దువ్వూరి రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసు కోవడానికి ఆయన డైరీలు, లేఖలే ప్రధానమయిన సాధనాలు కీ.శే. కె.వి. రమణారెడ్డి రచన 'కవికోకిల' రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసుకోవడానికి ప్రధానమైన ఆకరగ్రంథం. రామిరెడ్డి జీవితం గురించి ఎవరు ఏమి రాయాలను కున్నా రమణారెడ్డి రచనను ఉపయోగించుకోక తప్పదు.

ఈ పుస్తక రచనలో నిరంతరం ప్రోత్సహించిన వారు, తోడ్పడిన వారు ఆప్తమిత్రులు కాకాని చక్రపాణిగారు. వారి ప్రేరణే లేకపోతే ఈ పుస్తకం ఇంత తొందరగా పూర్తయ్యేదికాదు. వారికి కృతజ్ఞతలు.

దువ్వూరి రామిరెడ్డి గురించి ఈ గ్రంథం రచించడానికి అవకాశం కల్పించిన కేంద్ర సాహిత్య అకాదెమీకి కృతజ్ఞతలు.

దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి

మా అమ్మా, నాన్నలు

**దుర్గెంపూడి నాగేంద్రమ్మ, వెంకటప్పారెడ్డి గార్ల**

**స్మృతికి**

# ప్రస్తావన

దువ్వూరి రామిరెడ్డి ఈ శతాబ్దం ప్రథమార్థంలో తెలుగు సాహిత్య నందనోద్యానాన్ని కలకూజితం చేసిన కవి కోకిల. సామాన్య కర్షకుని జీవితాన్ని కావ్యవస్తువుగా మలచిన శిల్పి తెలుగులో పాస్టొరల్ కవిత్వానికి మార్గదర్శి. కవిత్వాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ ఒకే నాగలికి పూన్చి ఆంధ్ర కవితాకేదారంలో సేద్యం చేసిన కృషీవలుడు ఆంధ్ర రసలుబ్ధులకు సాహిత్య పానశాలలో కవితామరంద ధార నందించిన సఖి.

దువ్వూరి రామిరెడ్డి మహాకవీ, నాటక కర్తా, విమర్శకుడూ. ఆధ్యాత్మికతనూ, అభ్యుదయాన్నీ జోడించాడు. కావ్యకళకు సామాజిక ప్రయోజనాన్ని కూర్చాడు. దువ్వూరి రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసు కోవడానికి ఆయన డైరీలు, లేఖలే ప్రధానమయిన సాధనాలు కీ.శే. కె.వి. రమణారెడ్డి రచన 'కవికోకిల' రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసుకోవడానికి ప్రధానమైన ఆకరగ్రంథం. రామిరెడ్డి జీవితం గురించి ఎవరు ఏమి రాయాలను కున్నా రమణారెడ్డి రచనను ఉపయోగించుకోక తప్పదు.

ఈ పుస్తక రచనలో నిరంతరం ప్రోత్సహించిన వారు, తోడ్పడిన వారు ఆప్తమిత్రులు కాకాని చక్రపాణిగారు. వారి ప్రేరణే లేకపోతే ఈ పుస్తకం ఇంత తొందరగా పూర్తయ్యేదికాదు. వారికి కృతజ్ఞతలు.

దువ్వూరి రామిరెడ్డి గురించి ఈ గ్రంథం రచించడానికి అవకాశం కల్పించిన కేంద్ర సాహిత్య అకాడెమీకి కృతజ్ఞతలు.

దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి

# ప్రస్తావన

దువ్వూరి రామిరెడ్డి ఈ శతాబ్దం ప్రథమార్థంలో తెలుగు సాహిత్య నందనోద్యానాన్ని కలకూజితం చేసిన కవి కోకిల. సామాన్య కర్షకుని జీవితాన్ని కావ్యవస్తువుగా మలచిన శిల్పి తెలుగులో పాస్టొరల్ కవిత్వానికి మార్గదర్శి. కవిత్వాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ ఒకే నాగలికి పూన్చి ఆంధ్ర కవితాకేదారంలో సేద్యం చేసిన కృషీవలుడు ఆంధ్ర రసలుబ్ధులకు సాహిత్య పానశాలలో కవితామరంద ధార నందించిన సఖి.

దువ్వూరి రామిరెడ్డి మహాకవీ, నాటక కర్తా, విమర్శకుడూ. ఆధ్యాత్మికతనూ, అభ్యుదయాన్నీ జోడించాడు. కావ్యకళకు సామాజిక ప్రయోజనాన్ని కూర్చాడు. దువ్వూరి రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసు కోవడానికి ఆయన డైరీలు, లేఖలే ప్రధానమయిన సాధనాలు కీ.శే. కె.వి. రమణారెడ్డి రచన 'కవికోకిల' రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసుకోవడానికి ప్రధానమైన ఆకరగ్రంథం. రామిరెడ్డి జీవితం గురించి ఎవరు ఏమి రాయాలను కున్నా రమణారెడ్డి రచనను ఉపయోగించుకోక తప్పదు.

ఈ పుస్తక రచనలో నిరంతరం ప్రోత్సహించిన వారు, తోడ్పడిన వారు ఆప్తమిత్రులు కాకాని చక్రపాణిగారు. వారి ప్రేరణే లేకపోతే ఈ పుస్తకం ఇంత తొందరగా పూర్తయ్యేదికాదు. వారికి కృతజ్ఞతలు.

దువ్వూరి రామిరెడ్డి గురించి ఈ గ్రంథం రచించడానికి అవకాశం కల్పించిన కేంద్ర సాహిత్య అకాదెమీకి కృతజ్ఞతలు.

దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి

ధనిక రైతాంగం అభివృద్ధి చెందింది. ఆర్థిక వ్యవస్థ విపణి పెట్టుబడిదారీ వ్యవస్థవైపు పయనించ సాగింది పాత ఆర్థిక సామాజిక సంబంధాలు ఓ రకమైన అనిశ్చితత్వానికి, సంక్షోభానికి గురయ్యాయి. పందొమ్మిదో శతాబ్దంలో ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్యాభ్యాసం వల్ల అగ్రకులాలకు చెందిన మధ్య తరగతి మేధావి వర్గం ఉదార ప్రజాతంత్ర, వ్యక్తి వాదాల మానవతా విలువలను సంతరించుకుంది.

ఈ పై కారణాలన్నిటి వల్లా ఆంధ్రదేశంలో కట్టుబాట్లను తెంచుకోవాలన్న ఆర్తి, సామాజిక న్యాయంవైపు దృష్టి ప్రసరించ సాగాయి ఐరోపా ఖండంలో లాగా ఇక్కడ వచ్చిన మార్పులు విప్లవాల ఫలితంగా వచ్చిన మార్పులు కావు. అయితే, అక్కడ ఎలా బూర్జువా వర్గం వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుని, తమ ఆలోచనల కనుగుణంగా సమాజాన్ని, వ్యవస్థని క్షాళన చేయడానికి ప్రయత్నించిందో, మార్చాలని ప్రయత్నించిందో అలాగే భారతదేశంలోనూ, ఆంధ్రదేశంలోనూ మధ్యతరగతి మేధావి వర్గం కూడా ప్రయత్నించింది. నిజానికి ఏ సమాజంలోనయినా మధ్యతరగతి వర్గమే మార్పును ముందుగా ఆహ్వానించేది. అదే ఆలోచన చేసే వర్గం కింది వర్గానికి మార్పుకు ప్రయత్నించాలన్న జ్ఞానం వుండదు పై వర్గానికి మార్పు అనవసరం మార్పు వస్తే దాని ఆధిక్యం కుంటుపడుతుంది, అవసరాలు తీరవు.

అయితే, వచ్చిన మార్పు ఆశించినంత మేరకు సాంఘిక ప్రయోజనాలను సాధించలేకపోయింది. ఆంధ్రదేశంలో ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్యా విధానం పట్టణ, అర్ధ పట్టణ ప్రాంతాలకే పరిమితమై పోయింది. గ్రామీణ ప్రాంతాలు నిర్లక్ష్యానికి గురయ్యాయి. ఫలితంగా ఉన్నత, మధ్య తరగతి వర్గాలకు, కులాలకు పరిమితమయింది అయితే, పందొమ్మిదో శతాబ్దం చివరి భాగంలో వచ్చిన మార్పుల ఫలితంగా కులవ్యవస్థ కొంత మేరకు సడలి పోయింది. ఈ నేపథ్యంలోనే బ్రాహ్మణేతర భూస్వామ్య మధ్యతరగతి వర్గాలు సాంఘికంగా తమకు జరిగిన అన్యాయాన్ని గ్రహించాయి, రాజకీయ ప్రయోజనాలను సాధించడానికి ప్రయత్నించాయి త్రిపురనేని రామస్వామి చౌదరి జస్టిస్ పార్టీ నాయకుడైనా, తొలి దశలో దువ్వూరి రామిరెడ్డి ఆ పార్టీ వైపు మొగ్గు చూపినా అందుకు కారణమదే.

# ప్రస్తావన

దువ్వూరి రామిరెడ్డి ఈ శతాబ్దం ప్రథమార్థంలో తెలుగు సాహిత్య నందనోద్యానాన్ని కలకూజితం చేసిన కవి కోకిల. సామాన్య కర్షకుని జీవితాన్ని కావ్యవస్తువుగా మలచిన శిల్పి తెలుగులో పాస్టొరల్ కవిత్వానికి మార్గదర్శి. కవిత్వాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ ఒకే నాగలికి పూన్చి ఆంధ్ర కవితాకేదారంలో సేద్యం చేసిన కృషీవలుడు ఆంధ్ర రసలుబ్ధులకు సాహిత్య పానశాలలో కవితామరంద ధార నందించిన సఖి.

దువ్వూరి రామిరెడ్డి మహాకవీ, నాటక కర్తా, విమర్శకుడూ. ఆధ్యాత్మికతనూ, అభ్యుదయాన్నీ జోడించాడు. కావ్యకళకు సామాజిక ప్రయోజనాన్ని కూర్చాడు. దువ్వూరి రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసు కోవడానికి ఆయన డైరీలు, లేఖలే ప్రధానమయిన సాధనాలు కీ.శే. కె.వి. రమణారెడ్డి రచన 'కవికోకిల' రామిరెడ్డి జీవితాన్ని గురించి తెలుసుకోవడానికి ప్రధానమైన ఆకరగ్రంథం. రామిరెడ్డి జీవితం గురించి ఎవరు ఏమి రాయాలను కున్నా రమణారెడ్డి రచనను ఉపయోగించుకోక తప్పదు.

ఈ పుస్తక రచనలో నిరంతరం ప్రోత్సహించిన వారు, తోడ్పడిన వారు ఆప్తమిత్రులు కాకాని చక్రపాణిగారు. వారి ప్రేరణే లేకపోతే ఈ పుస్తకం ఇంత తొందరగా పూర్తయ్యేదికాదు. వారికి కృతజ్ఞతలు.

దువ్వూరి రామిరెడ్డి గురించి ఈ గ్రంథం రచించడానికి అవకాశం కల్పించిన కేంద్ర సాహిత్య అకాదెమీకి కృతజ్ఞతలు.

దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి

చేశారు. ప్రణయ కవిత్వంలోను భగవత్సంబంధమైన ప్రతీకలూ, కల్పనలూ కన్పిస్తాయి. భగవదంశ ఉండటం చేతనే గ్రామగ్రామంలో ప్రతిష్ఠితులైన దేవతలను సంబోధించి మన ఆంధ్ర కవులు అనేక శతకాలు చెప్పారు 'నలజారమ్మ'లను కొల్చారు

తిరుగు బాటుకు, దాడికి వీలు కానప్పుడు కాల్పనిక కవులు ప్రాచీన కాలపు సుదూర తీరాలకు పలాయనం చిత్తగించారు. భరించలేని వర్తమానాన్ని పరిహరించి ప్రాచీన కాలపు స్వర్ణయుగం, లేక ఉటోపియాలలో బతికారు చారిత్రక నవలలు, నాటకాలు ప్రాచీన ఔన్నత్యాన్ని కీర్తిస్తూ వెలువడ్డాయి. రాణాప్రతాప్‌సింగ్, 'కుంభరాణా' భార్య మీరా, శివాజీల గూర్చి ప్రసక్తంచేశారు. ఈ నాణానికి మరోవైపే దేశభక్తి అవకాశం కన్పించినపుడు తెలుగు కవులు 'జన్మభూమి' గురించి ప్రశంసించారు. 'జాతీయత'కు నివాళు లిచ్చారు రాయప్రోలు 'అహంకార దర్శనం' రామిరెడ్డిలో 'ఆత్మ విశ్వాస సూర్యోదయం' గా మారింది. గాంధీజీ జాతీయోద్యమ సంగ్రామ నాయకుడయ్యాడు ఆయన్ని పీడిత జనోద్ధారకుడిగా నమ్మి కీర్తించిన గేయాలు దేశభక్తి కవిత్వంలో ప్రధాన పాత్ర వహించాయి దువ్వూరి రామిరెడ్డి, జాషువా, తుమ్మల, కరుణశ్రీ, బసవరాజు, కృష్ణశాస్త్రి మొదలైన వారు గాంధీని ప్రశంసిస్తూ కవిత్వం రాశారు.

## కాల్పనిక కవిత్వంలోని విభిన్న ధోరణులు :

కాల్పనిక యుగ కవులందరూ భావ కవిత్వ వివిధ శాఖలలో తమ గళాలు విప్పినా ముఖ్యంగా మూడు ధోరణులు మనకు దృగ్గోచరమవుతాయి అవి 1) ప్రణయ కవిత్వం, 2) ప్రాచీన స్వర్ణయుగ ప్రశస్తి, 3) తార్కిక ధోరణి

ప్రణయ కవిత్వంలో ప్రధాన పాత్ర వహించింది అమలిన శృంగారమని ఇంతకు ముందే చెప్పుకున్నాం రాయప్రోలు సుబ్బారావు దీనికి ప్రవక్త అయినా మిగతా కవులూ ఆ బాటను అనుసరించకపోలేదు కాల్పనిక ప్రపంచం నుండి ఉద్భవించిన ఈ కావ్యాలలోని పాత్రలు కృత్రిమంగానూ, అసహజంగానూ ప్రవర్తిస్తాయి ఊహాజనితమూ, గ్రంధ పఠనోద్భూతమూ, అన్యానుభవ ప్రేరితమూ అయిన ఈ పాత్రలు నిర్జీవాలు. కవి విశ్వసించిన భావాల కనుగుణంగా ఇవి నడుస్తాయి ఇవి వాడే భాష, పలికే శబ్దాలు వాస్తవానికి దూరంగా ఉంటాయి. సెలయేళ్లు, మలయానిలాలు, పాలవెన్నెలలు, విశ్వాన తాలవృంతాలు,

దుఃఖపునిధులు, మధుకీలలు, వియోగ మధురిమలు - ఇవే ఈ సాహిత్యమంతా పునరావృతమవుతుంటాయి ఇటువంటి ప్రణయ కవిత్వానికి పట్టం కట్టిన కవులు రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలయిన వాళ్లు. దువ్వూరి రామిరెడ్డి ప్రణయం ఈ ప్రణయానికి భిన్నమైనది వాస్తవికమైనది. రామిరెడ్డి వర్ణించిన ప్రణయం కూడా అమలినమే అంటే రాయప్రోలు చెప్పిన అమలిన శృంగారం కాదు ప్రణయానికి అశ్లీలత లేకపోవడం. నాయని సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, దువ్వూరి రామిరెడ్డి ఇటువంటి ప్రణయాన్ని పోషించిన కవులు.

"ఇరవయ్యో శతాబ్దపు మొదటి రెండు దశకాల్లో వస్తున్న మార్పుల ఫలితంగా సాంఘిక వ్యవస్థ, ఆచార వ్యవహారాల్లో, దృక్పథాల్లో చెప్పుకోదగ్గ మార్పులు వస్తున్నప్పటికీ పాత వ్యవస్థ పూర్తిగా శిథిలం కాకపోవటం, పాత దృక్పథాలు, ఆలోచన, జీవన విధానం సమూలంగా మార్పు చెందక పోవటం, కొత్త వ్యవస్థ సంపూర్ణంగా ఏర్పడకపోవటం వల్ల మధ్య తరగతి మేధావి వర్గం సందిగ్ధావస్థలో పడిపోయి సంక్షోభానికి గురైంది దాని ఫలితంగా పాత వ్యవస్థ తాలూకు జ్ఞాపకాలు, అనుభవాలు పూర్తిగా సమసిపోలేదు. కొత్త వ్యవస్థ ఆవిర్భావం వల్ల ఏర్పడిన పరిణామాలను పూర్తిగా ఆహ్వానించే మానసికధోరణి కూడా సంపూర్ణంగా ఏర్పడలేదు. విశ్వనాథ రచనలు, ఆలోచనా విధానం ఇందుకు నిదర్శనంగా పేర్కొన వచ్చు" (తెలుగు సాహిత్యం - చారిత్రక నేపథ్యం) ఆయన 'వేయిపడగలు' అందుకు అద్దం పడ్తుంది. ప్రాచీన కాలపు గొప్ప తనంతో వర్తమానాన్ని పోల్చడం వీలుగానప్పుడు, అధోస్థితిలో ఉన్నప్పుడు ప్రాచీన కాలపు వ్యక్తుల ప్రశస్తిని వర్ణిస్తూ కవితలు, నవలల్లూ, నాటకాలూ రాయటం కూడా ఇందులో భాగమే.

మూడవది కాల్పనిక వాదతత్త్వంలో వున్న తార్కిక ధోరణి. తెలుగు సాహిత్యంలో హేతువాదానికి మూల పురుషుడుగా త్రిపురనేని రామస్వామి చౌదరిని పేర్కొంటారు. ప్రజలలో భావ విప్లవం రావాలంటే, ముందుగా మతం పేరిట వారిలో పేరుకుని పోయిన మూఢ విశ్వాసాలు పోవాలి. ప్రజలలో మౌఢ్యాన్ని పెంచుతున్న మతాన్ని ప్రచారం చేసే పురాణాలను, కృత్రిమ అసమానతలు సృష్టించిన స్మృతులను హేతువాద దృక్పథంతో విమర్శించాలి అన్నదే ఆయన రచనలలో ప్రధాన వస్తువు. "వర్తమాన కాలంలో విద్య సామాన్యమై కులానుకూల ధర్మ నిర్ణయంపై బ్రాహ్మణేతర లోకం దాడి

వెడలిందనీ, భారత దేశంలో వివిధ ప్రాంతాలలో బ్రాహ్మణేతరులు సంఘటితమై పౌరాణికులు ప్రతిష్ఠించిన విశేష ధర్మాల నిర్మూలనకు ప్రయత్నిస్తున్నారనీ, ఇది ధర్మ సంగ్రామం కాబట్టి బ్రాహ్మణేతర లోకం మీద విజయం వర్షిస్తుందనీ (ఆయన) అన్నాడు" (తెలుగు పీఠిక). నిజానికి, హేతువాద దృక్పథం కాల్పనిక వాదంలో ఒక భాగమే. స్వేచ్ఛ, సమానత్వం, సోదరభావం కాల్పనికతకు ప్రణవ మంత్రాలు. అవి పఠిస్తూనే బ్రాహ్మణ ఆధిక్యం పై ధ్వజమెత్తాడు రామస్వామి చౌదరి. అందువల్ల హేతువాద దృక్పధం కాల్పనికతకు భిన్నం కాదు, దాని అంగమే. అయితే "వేదాలు, ఉపనిషత్తులు, పురాణేతిహాసాల విషయంలో రాహుల్ సాంకృత్యాయన్ వంటి వారి కున్న స్పష్టమైన చారిత్రికావగాహన రామస్వామి చౌదరికున్నట్లు కన్పించదు. పౌరోహిత్యం మీద కాదు వ్యతిరేకత బ్రాహ్మణ పౌరోహిత్యం మీద వ్యతిరేకత" (తెలుగు పీఠిక) సంప్రదాయం ఆయన్ని వీడిపోలేదు అది బ్రాహ్మణుల చేతుల్లో చిక్కుకు పోయిందే అన్నదే ఆయనలోని ఆక్రోశం.

ఈ విధమైన తార్కిక ధోరణికి భిన్నమైన తార్కిక ధోరణి దువ్వూరి రామిరెడ్డిది ఆయనది కులాన్ని అధిగమించిన సవిమర్శకమైన తార్కిక ధోరణి ఆయన సంప్రదాయాన్ని పూర్తిగా కాదనలేదు అస్తికవాదే కాని నిరీశ్వరవాది కాదు. జ్యోతిష్యంపైనా, గ్రహచారాలపైన, వాస్తు మీదా ఆయన నమ్మకాలు ఆయన కున్నాయి. అయితే, ఆధునికతవైపు దృష్టి సారించే తత్త్వం ఆయనది. వైజ్ఞానిక దృష్టి (రేడియో, కెమేరాల్లాంటివి తయారు చేయటం) ఆయన కవితలోనూ ప్రతిఫలిస్తుంది. 'జలదాంగన' 'కవి-రవి' కావ్యాల్లో వర్షం, విశ్వాల పుట్టు పూర్వోత్తరాలను గూర్చి వివరించాడు ఆయన శాస్త్రీయ దృక్పథం 1910 నాటికి మించని అభిప్రాయాలపై ఆధారపడి వుందని కె వి రమణారెడ్డి వాదించినా ఆయనలో అది అభ్యుదయాంశ అన్నది నిర్వివాదమైన విషయం

కాల్పనిక వాద యుగంలో సాహిత్యం వ్యక్తి వాదాన్ని సంతరించు కొన్నప్పుడు వివిధ ధోరణులు బయల్పడటంలో ఆశ్చర్యంలేదు. అందులో ముందు తరానికి బాట వేసిన వారినే - అక్కడితో ఆగిపోయిన వారిని కాదు - చెప్పుకోవాల్సి వస్తుంది. నవయుగ వైతాళికుడు గురజాడ అప్పారావు వేల్చిన యజ్ఞంలో దువ్వూరి రామిరెడ్డి తన వంతు సమిధల నర్పించాడనటంలో అతిశయోక్తి లేదు.

# 2. దువ్వూరి రామిరెడ్డి జీవితం - వ్యక్తిత్వం

జననం :

దువ్వూరి రామిరెడ్డి 1895 నవంబరు తొమ్మిదో తారీకున శనివారం ఉదయం ఆరున్నర గంటలకి నెల్లూరు జిల్లా గూడూరులో జన్మించాడు అదే ఏట నండూరి సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, గుర్రం జాషువా, అడవి బాపిరాజు జన్మించారు. అంతేకాదు "తెలుగు అక్షర ప్రపంచాన్ని ఏలుబడి చేసిన కిరీట ధారులందరూ" క్రితం శతాబ్ది చివరి దశకంలోనే జన్మించారు

"నిజానికి 19వ శతాబ్దిలోని చరమ దశకం తెలుగు కవితకు ఊయెల. 1891లో రాయప్రోలు సుబ్బారావు, 1892లో మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి, తల్లావఝుల శివశంకరశాస్త్రి, 1894లో బసవరాజు అప్పారావు, 1896లో అబ్బూరి రామకృష్ణారావు, 1897లో దేవులపల్లి కృష్ణశాస్త్రి, 1899లో నాయని సుబ్బారావు జన్మించారు. అందరూ 'నవ్య' భావజాలమైన కాల్పనికోద్యమానికి సంబంధించిన" (కె.వి. రమణారెడ్డి) వారే.

## తల్లీ - తండ్రీ : విద్యాభ్యాసం :

దువ్వూరి రామిరెడ్డి తండ్రి సుబ్బారెడ్డి అయన పితామహుడు రామస్వామి రెడ్డి పేరు ప్రతిష్ఠలలోపాటు పెత్తనం కూడా సంపాదించుకున్నరైతు. తండ్రి సుబ్బారెడ్డి ఆయన స్కూల్లో ఫర్ష్ఫారం చదివేప్పుడు చనిపోయాడు. రామిరెడ్డి తల్లి లక్ష్మీదేవమ్మ పెరుమారెడ్డి వారి ఆడపడుచు. నలజారమ్మ వంటి సాధ్వికి జన్మ నిచ్చిన వంశం ఆమెది. బహ్మనీ రాజ్యసేనాపతి ఆ ప్రాంతాన్ని

జయించి పెరుమారెడ్డి పెంచలురెడ్డిని నవాబుకు ఇజారాదారుని చేశాడు అలా పెరుమారెడ్డి వంశం మొదటి నుండి కలిగిన కుటుంబమే సుబ్బారెడ్డి, లక్ష్మీదేవమ్మ దంపతులకు రామిరెడ్డి మొదటి సంతానం. ఆ తరువాత బాలకృష్ణారెడ్డి, కడగొట్టు కూతురు రుక్మిణమ్మ, రామిరెడ్డికి తన చెల్లెలంటే అమితమైన ప్రేమ

రామిరెడ్డి గూడూరు వీధిబడిలోనూ, పెమ్మారెడ్డి పాళెంలో సీతయ్య అనే సాతాని అయ్యవారి వద్ద ఓనమాల నుండి ఐదవ తరగతి వరకూ చదువుకున్నాడు. పెద్ద చదువులకు నెల్లూరు వెళ్ళి హార్వీదొర వద్ద మూడవ ఫారం వరకు చదువుకున్నాడు, కాని పరీక్షలో తప్పిపోయాడు. తల్లి చివాట్లతో మొహంవాచిపోయి మరుసటేడు పరీక్షలో నెగ్గాడు. అంతలో తండ్రి మృతి చెందటంతో ఆయన చదువు అంతటితో అంతమైంది. సుబ్బారెడ్డి ముప్పై ఎకరాల పంటచేనూ, ఇల్లూ, దొడ్డీ, కొంత మెట్ట పొలమూ తన సంతానానికి ఇచ్చి పోయాడు

భర్త పోయాక లక్ష్మీదేవమ్మకు పెత్తనం చేజిక్కింది ఆమె చెల్లెలి పెనిమిటి రెడ్డెయ్య పెమ్మారెడ్డిపాళెంలో దాదాపు యాభై ఎకరాల కామందు వారికి బిడ్డా పాపా లేరు లక్ష్మీదేవమ్మకు వారు పెద్ద అండ అయ్యారు ఆమెకు దైవభక్తి మెండు వైష్ణవి ఊళ్ళోకి ఏ స్వాములవారు వేంచేసినా, ఏం కైంకర్యం ఉభయం దైవకార్యం అవసరమైనా ఆమే ముందుండేది, తీర్థయాత్రలు చేసేది, శ్రీరంగం వెళ్తే నెలల తరబడి అక్కడే గడిపేది. ఆమె ఈ భక్తిలో ఆస్తి హారతి కర్పూరమవ సాగింది. ఆమె ప్రభావం వలన ఓసారి రామిరెడ్డి కూడా తమ్ముడు బాలకృష్ణారెడ్డితో కలసి పోయి ఓ వైష్ణవ మతాచార్యుల వారి దగ్గర ముద్రాంకితుడవటం జరిగింది.

నెల్లూరు చదువుల రోజులలోనే రామిరెడ్డి మనస్సు జిజ్ఞాసువయినట్లు కొన్ని సంఘటనలు తెలియజేస్తాయి చూసిన వస్తువుల మీద ఆసక్తి, వాటిని గురించిన జిజ్ఞాస ఆరోజుల్లోనే ప్రారంభమయింది. “పాఠాలమీద లేని శ్రద్ధ ప్రకృతిమీద, బడిలో లోపించిన ఔత్సుక్యం వీధి మీద, పాఠ్యాంశాల మీద లేని గురి ‘పనికి మాలిన విషయాల మీద ప్రసరించింది”. గుఱ్ఱంతోక కుచ్చు వెంట్రుకలు పీకి వాటితో కుంచెతయారు చేయటం లాంటిది చిన్న సంఘటనే అయినా అది ఆయన కళాభిరుచి పట్ల మొగ్గ చూపటాన్ని ప్రదర్శిస్తుంది. “తాను కవో, చిత్రకారుడో, శిల్పో, శాస్త్రాభిమానో తేల్చుకోజాలనంత

# 2. దువ్వూరి రామిరెడ్డి జీవితం - వ్యక్తిత్వం

జననం :

దువ్వూరి రామిరెడ్డి 1895 నవంబరు తొమ్మిదో తారీకున శనివారం ఉదయం ఆరున్నర గంటలకి నెల్లూరు జిల్లా గూడూరులో జన్మించాడు అదే ఏట నండూరి సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, గుర్రం జాషువా, అడవి బాపిరాజు జన్మించారు. అంతేకాదు "తెలుగు అక్షర ప్రపంచాన్ని ఏలుబడి చేసిన కిరీట ధారులందరూ" క్రితం శతాబ్ది చివరి దశకంలోనే జన్మించారు

"నిజానికి 19వ శతాబ్దిలోని చరమ దశకం తెలుగు కవితకు ఊయెల. 1891లో రాయప్రోలు సుబ్బారావు, 1892లో మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి, తల్లావఝుల శివశంకరశాస్త్రి, 1894లో బసవరాజు అప్పారావు, 1896లో అబ్బూరి రామకృష్ణారావు, 1897లో దేవులపల్లి కృష్ణశాస్త్రి, 1899లో నాయని సుబ్బారావు జన్మించారు. అందరూ 'నవ్య' భావజాలమైన కాల్పనికోద్యమానికి సంబంధించిన" (కె.వి. రమణారెడ్డి) వారే.

తల్లీ - తండ్రీ : విద్యాభ్యాసం :

దువ్వూరి రామిరెడ్డి తండ్రి సుబ్బారెడ్డి ఆయన పితామహుడు రామస్వామి రెడ్డి పేరు ప్రతిష్ఠలతోపాటు పెత్తనం కూడా సంపాదించుకున్నరైతు. తండ్రి సుబ్బారెడ్డి ఆయన స్కూల్లో థర్డ్‌ఫారం చదివేప్పుడు చనిపోయాడు. రామిరెడ్డి తల్లి లక్ష్మీదేవమ్మ పెరుమారెడ్డి వారి ఆడపడుచు. నలజారమ్మ వంటి సాధ్వికి జన్మ నిచ్చిన వంశం ఆమెది. బహ్మనీ రాజ్యసేనాపతి ఆ ప్రాంతాన్ని

పినతల్లి బాలకృష్ణారెడ్డిని పెమ్మారెడ్డి పాళెం తీసుకువెళ్ళి పెంచుకో సాగింది. రామిరెడ్డికూడా కన్నతల్లికి వెరిచి పినతల్లి పంచచేరాడు. ఇంతలో పినతండ్రి రెడ్డెయ్య కాలంచెయ్యటం, ఆయన ఆస్తి అన్నతమ్ములిద్దరికి సరిసమానంగా దక్కటంతో క్రమక్రమంగా రామిరెడ్డి నివాసస్థలం గూడూరు నుండి పెమ్మారెడ్డి పాళానికి మారింది. అలా గూడూరులాంటి పెద్ద ఊరి నుండి పెమ్మారెడ్డి పాళెంలాంటి చిన్న ఊరుకు ఆయన కార్యరంగం మారింది. ఆయనే ఓచోట చెప్పుకుంటాడు : "నాది ఒక కుగ్రామ నివాసం. ఇప్పటి వరకు నా జీవితమంతా ఆ గ్రామంలోనే కొనసాగిపోయింది. పరిసరాల ప్రభావం వల్లనోయేమో నా జీవితంలోను, కవిత్వంలోను, గ్రామీణత్వం పరిస్ఫుటంగా అంకితమై వుంటుంది" అని.

కాంతా - కవితా :

బేలూరి పలాయనం తర్వాత అబ్బాయిని సరైన మార్గంలో పెట్టాలని తల్లి, పెద్దలు ఆయన పెళ్ళి చేశారు. 1914లో పాపిరెడ్డి పాళెంలోని దేవళ్ళ బలరామిరెడ్డి కూతురు శేషమ్మతో ఆయన వివాహమయింది. ఆ కాలంలో రామిరెడ్డి రూపురేఖలను, పోకిళ్ళను పినుపాటి వెంకటరమణయ్య ఇలా వివరించాడు. "మధ్యపాపటతీసి, వుంగరాలు తిరుగు బిరుసు వెంట్రుకల క్రాపు, మెడకు చుట్టబెట్టి పైన వేసికొనిన మల్లెపూవువంటి జరీ వుత్తరీయం, గోధుమవన్నె సిల్కుషర్టు, మల్లు ధోవతితో మామూలుగా మావైపు నాగరికులైన రెడ్డి యువకులు ధరించు డ్రెస్సులో వున్నాడు... చామనచాయ మేను, గుండ్రటి ముఖము, తీర్చినట్లున్న ముక్కు, విశాలమైన కండ్లు, తేజోవంతములైన చూపులు ఆకర్షించి ఒక్కక్షణం నన్నలాగే నిలవేసింది".

కవిత్వ రచనకు ముందే ఆయన దృష్టి చిత్రలేఖనం, మృత్తి విగ్రహ నిర్మాణంలో నిమగ్నమయి వుండేది. ఆయనే చెప్పుకున్నట్లు ఓ 'స్వల్ప సంఘటన'తో ఆయన కవి అయ్యాడు. ఆ సంఘటనను ఆయనే ఇలా వివరించాడు : "... మా ప్రక్క ఊరి (గండవరం)లో ఒక గ్రంథాలయం వుండినది. ఆ ఊరిలో ఆ పుస్తకములను కడవరకు చదివిన మొదటి వాడను నేనే. ప్రతిదినము సాయంకాలము నాలుగు గంటలకు ఆ ఊరు చేరే వాడను. ఒకనాడు ఆ ఊరికి ఒక శతావధాని వచ్చి లైబ్రరీలో కూర్చుండి మాటలాడు

చుండెను. 'కవిత్వము పూర్వజన్మ సంస్కారము వలన లభించుననీ, చదివితే పండితుడు కావచ్చునేగాని కవికానేర'డని ఆయన చెప్పు చుండెను. నాకు ఆ కాలములో విపరీతమైన ఆత్మ విశ్వాసము వుండెను... 'మనిషి ప్రయత్నించి నట్లయితే చేయలేని దొకటుంటుందా -?' అని నేనన్నాను. 'ప్రయత్నించి తక్కిన కళలు నేర్చుకో వచ్చుగాని, ప్రయత్నించి ఛందస్సు నేర్చుకుని పద్యం రాసినా రసం వుండద'ని ఆయన చెప్పినాడు. శ్లోకాలు, పద్యాలు ప్రమాణాలుగా చూపించినాడు. నా వాదం మాత్రం 'కామన్‌సెన్స్' వాదం. కడకు ఆయనకు విసుగెత్తి 'అట్లయితే నీవు వ్రాయరాదటోయ్' అని అన్నాడు.

"చిన్నప్పుడు వీధిబళ్లో చదివిన గజేంద్ర మోక్షము, రుక్మిణీ కళ్యాణము పద్యములను మనస్సులో వల్లించుకుంటూ వేయిదేవుళ్ళకు మ్రొక్కుకుంటూ కాలహరణం చెయ్యటానికి లేచి వెదకుతున్నట్లు అభినయిస్తూ, ఆటవిడుపు పద్యాలు శరవేగంతో లోలోపల వల్లించుకుంటూ వుండినాను. ఒకాయన విజిటర్స్ రిజిస్టరులో కాగితం చింపి నా ముందు పెట్టినాడు. అది తీసికొని 'దండము శాస్త్రి ధీమణికి దండము కావ్య కళా విభూతికిన్' అని వ్రాసినాను... తర్వాత బండి సాగలేదు. ఏదో ఒక దబాయింపు దబాయించి తప్పించుకొన చూచినాను. 'కవిత్వమంటే ఇంతే గదండి' అని కాగితం ఆయనకిచ్చినాను. నా చాయ నిదానించి చూచి 'నీవు కవిత్వం వ్రాస్తే నీకు వస్తుందోయ్,' అని అన్నాడు - నా అదృష్టము కట్టి వచ్చింది. ఆ పాదానికి అర్థమేమనిగాని, తక్కిన మూడు పాదములు ఏవనిగాని ఆయన అడగలేదు. పరువు దక్కింది, మిడతం బొట్లు జోస్యం ఫలించింది"

అలా ప్రారంభమైనది రామిరెడ్డి కవిత్వ జీవనం. ఆత్మవిశ్వాసం, దానికి తగిన పట్టుదల, దీక్ష ఆయనకు జన్మగతం. అయితే, అప్పటికాయనకు తెలుగు వాఙ్మయంతో ఎలాంటి పరిచయం లేదు. మద్రాసుపోయి ఛందస్సు పుస్తకాలు కావాలని వావిళ్ళవారి పుస్తకాల అంగడిలో అడిగాడు. 'సులక్షణ సారం', 'అప్ప కవీయం' ఇచ్చారు వాళ్ళు. కొన్ని పద్యాలు కట్టి గూడూరులో ఒక పండితునికి చూపినప్పుడు తిరస్కారాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. రామిరెడ్డి సంస్కృతం నేర్చుకోవాలని ఓ బ్రాహ్మణుడి దగ్గరకు వెళ్తే ఆయన అవమానించి పంపేశాడు. అయితే పండితులందరూ రామిరెడ్డిని నిరుత్సాహపర్చలేదు. 1915లో నెల్లూరులోని దుర్భా సుబ్రహ్మణ్య శర్మ ఆయన కోరిన సాయం

చేశాడు. ఆయన ప్రథమ ముద్రిత కావ్యాలయిన 'వన కుమారి', 'జలదాంగన' లను పరిశీలించిన వేదం వేంకటరాయశాస్త్రి "కవితాబీజమైన ప్రతిభ నాకు గోచరించినది. శబ్ద సౌష్ఠవ ప్రవణత్వము గూడ నగపడుచున్నది" అని యోగ్యతా పత్రం ఇచ్చాడు. అయితే, గిడుగు రామమూర్తికి వాటిలో 'నిజమైన కవిత్వం' కన్పించినా, కవితలో మూరుమూల పదాల వాడుక విచారం కలిగించింది. పండితులు పోయే దారిలో తనూ పోవాలని ప్రయత్నించినా, నిరాడంబరత్వం కోరే ఆయన మనసునకు 'తిలపిష్టపుశైలి' రుచించలేదు.

రామిరెడ్డి చెప్పుకున్నాడు "1915 సంవత్సరాంతమున నాయందు కవిత్వమంకురించినది. 1916 మొదలు 1917 వఱకు నా కవితాభ్యాస కాలము. ఈ యొక సంవత్సరములోపల వ్రాయుటయు, చదువుటయు చాల తీవ్రముగ సాగినది". 1916-1918ల మధ్య ఆయన 'రసికజనానందము', 'స్వప్నాశ్లేషము', 'అహల్యానురాగము', 'కృష్ణరాయబారము' అనే ప్రబంధాలను 'నలజారమ్మ' అనే నవీన ప్రబంధాన్ని రచించాడు. అయితే, వీటిలో చాలభాగం 1927 సంవత్సరం 'పెద్ద గాలివాన'లో నాశనమైపోయాయి. ఈ స్వీయకృతులేకాక ఆయన 'ఋతుసంహారము', 'పుష్పబాణ విలాసము'లను అనువదించాడు. ఇదే కాలంలో 'కర్షక విలాసము' అన్న నాటకాన్ని రచించాడు. రాజకీయ చైతన్యానికి పూర్తి జాతీయోద్యమ స్వరూపం సిద్ధించని ఆరోజుల్లో తిలక్, అరవింద ఘోష్, లజపత్‌రాయ్ ప్రభృతులు దాన్ని హైందవమత పునరుద్ధరణోద్యమంగా భావించారు. ఈ పూర్వరంగంలోనే 1917లో రామిరెడ్డి 'మాతృశతకము', 'సింహప్రబోధము' లను రాశాడు 'మాతృశతకము' రచన నాలుగు రోజుల్లోనే ముగిసింది. నెల్లూరులోని ప్రెస్సులో అచ్చవుతున్నప్పుడు ప్రభుత్వం దాన్ని నిషేధిస్తుందేమోనని భయం కలిగింది. పాణకా కనకమ్మ ఇల్లు కాలిపోయినప్పుడు దీని రాత ప్రతి బూడిదైనా, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ ఆవరకే మరో ప్రతి రాసి పెట్టుకుని వుండటం చేత మద్రాసులోని ఇండియా ప్రింటింగ్ వర్క్సులో రెండో ప్రచురణ వేయించాడు. అయితే, వాటికీ అదే గతి పట్టి ప్రూఫు కాపీలు మాత్రం మిగిలాయి. రామానాయుడు వాటిని గుంటూరు రాజకీయ మహాసభలో పఠించి బహుళప్రచారం చేశాడు.

## తొలిగౌరవ పురస్కారాలు :

1917లో నెల్లూరు "రెడ్డి జన సంఘం ఒక సువర్ణ పతకాన్నిచ్చి, కట్టమంచి రామలింగారెడ్డి మెప్పు ద్వారా రామిరెడ్డిని సన్మానించింది. అయితే అది కుల సంస్థ కాబట్టి ఆ సన్మానానికి సార్ధక్యం సిద్ధించలేదు". 1918లో 'వనకుమారి' రాసిన తర్వాత విజయనగర ఆస్థానం నిర్వహించిన ఆంధ్ర కావ్యపరీక్షకు దీనిని పంపమని దుర్భా సుబ్రహ్మణ్యశర్మ ప్రోత్సాహపరిచాడు ఆయన్ని. అందులో ఈ కావ్యం ప్రథమ బహుమతిని గెల్చుకుంది. బహుమానం నాలుగు వందలు ఒక లెక్కలోనిది కాదు. కాని, తెలుగునేల నాలుగు చెరగులకూ ఆయన కీర్తి వ్యాపించింది.

## కులాభిమానం - జస్టిస్ పార్టీతో సంబంధాలు :

అప్పటికి (1917) ఇంకా మండల, ప్రాంత, వృత్తి కులసభలు జాతీయ మహాసభలలో అంతర్గతమై పోలేదు. రామిరెడ్డిలోనూ కులాభిమానం మెండుగానే వుండేది. తన కులం పట్ల చూపే నిరాదరణ ఆయనకు బాధాకరమయింది. 'రెడ్డి-మడ్డి' అనే వాళ్ళను 'చుక్కలను చూచి మొరిగే కుక్కలు'గా ఆయన భావించాడు. కులాభిమానం రామిరెడ్డిని జస్టిస్ పార్టీ వైపునెట్టింది. 'సౌత్ ఇండియన్ లిబరల్ ఫెడరేషన్'గా మొదలైన బ్రాహ్మణేతరోద్యమం, కాంగ్రెసు వాదులు అసహాయోద్యమ వ్రతంవూని శాసనసభలలో పాల్గొనడానికి నిరాకరించటంతో అధికారాన్ని హస్తగతం చేసుకుంది. 1916 నవంబరులో 'సౌత్ ఇండియన్ పీపుల్స్ అసోసియేషన్' ప్రారంభమై, లక్షరూపాయల నిధితో ఇంగ్లీషు, తెలుగు, తమిళ భాషల్లో పత్రికలు ప్రకటించి బ్రాహ్మణేతరుల ప్రయోజనాలను ప్రచారం చేయడానికి సంకల్పించటం జరిగింది. "జస్టిస్ ఉద్యమానికి ఉపాంగమైన రెడ్డి జన సంఘము ద్వారా పరిచయమైన కట్టమంచి రామలింగారెడ్డి రామిరెడ్డి లేఖినిని ప్రచార సాధనంగా చేసుకోవలెనని సంకల్పించారు". (కె.వి. రమణారెడ్డి) 1920లో రామిరెడ్డికి ఉత్తరం రాస్తూ "మీరే మా మొదటి సంపాదకుల"ని కట్టమంచి రామలింగారెడ్డి ఆయన్ని ఆహ్వానించారు. ఈ పత్రిక వెలుగు చూసే సరికి ఒకటి రెండేళ్ళు గడిచాయి. పింజల సుబ్రహ్మణ్యశెట్టి వ్యవస్థాపకుడుగా, మద్రాసులో 'సమదర్శిని' 'న్యాయదీపిక' పత్రికలు ప్రారంభమయ్యాయి. రామిరెడ్డి ఉపసంపాదకు

డయ్యాడు. ఆయనకు తోడుగా మరుపూరు కోదండరామరెడ్డి కూడా మద్రాసు వచ్చాడు. అయితే, ఆయన ఈ ఉద్యోగంలో కొన్ని నెలలు మాత్రమే వుండగలిగాడు. మద్రాసు కాపురం మొహం మొత్తటం ఒక కారణమైతే, అక్కడా బానిసత్వం గోచరించటం మరోకారణం. ఏ నాయకుడు పత్రికా కార్యాలయానికి వచ్చినా సిబ్బంది అంతా లేచి నిల్చుని స్వాగత మివ్వాలన్న నియతి ఆయనకు రుచించలేదు. లెజిస్లేటివ్ కౌన్సిలులో కట్టమంచి రామలింగారెడ్డి ఉపన్యాసానికి ప్రాధాన్యమిచ్చి, జస్టిస్ పార్టీ అధినేత ఆర్కాటు రామస్వామి మొదలియారు ఉపన్యాసానికి ప్రాధాన్యత ఇవ్వకపోవటంలో ఆయన అధికార వర్గ ఆగ్రహానికి గురయ్యాడు ఏమయినా రామిరెడ్డి మద్రాసు ఉద్యోగం మూన్నాళ్ళ ముచ్చటైంది

ఈ పత్రికలలో రామిరెడ్డి చేసిన మొదటి రచన 'అప్పకవీయం'లోని బ్రాహ్మణ పక్షపాతం మీద దండయాత్ర. "ఆరిజిన్స్ ఆఫ్ నాన్-బ్రాహ్మిన్ మూవ్‌మెంట్" అన్న వ్యాసంలో ఆయన బ్రాహ్మణేతరోద్యమానికి ఒక తాత్త్విక, చారిత్రక సమర్ధనను కలుగజేశాడు. ఈ సందర్భంలో కె.వి. రమణారెడ్డి ఇలా రాశాడు : "ఒక పీడిత మహాజన సమూహం విద్యావిజ్ఞానాల కొరకు, సాంఘిక మాన్యతకొరకు చేసే న్యాయమైన తపస్సుగా బ్రాహ్మణేతరోద్యమం రామిరెడ్డికి దర్శన మిచ్చింది. కానీ, పరకులద్వేషం ఆయనకు నచ్చలేదు. రాజకీయ ద్రోహబుద్ధినయించలేదు బుద్ధి సంకోచం మింగుడు పడలేదు .. కులాభిమానం దేశాభిమానంతో వికటించదన్నంత మేరకే రామిరెడ్డికి జస్టిస్ పార్టీతో పొత్తు నిలిచింది. వాటి స్పర్థ, పరస్పర బాహ్యత తెలిసి వచ్చేసరికి, రామిరెడ్డి జస్టిస్ పార్టీ ఉక్కు కౌగిలి నుండి బయట పడ్డాడు. త్రిపురనేని రామస్వామి చౌదరివలె 'జాతీయ' జస్టిస్ ఉద్యమానికి మనస్సు అప్పగించుకోలేదు".

## ఆంధ్రోద్యమం - జాతీయోద్యమం :

అవిభాజ్య మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రులకు జరిగిన అన్యాయ, అవమానాలు జాతి భావాన్ని ఉత్తేజిత పర్చాయి ప్రస్తుత పరిస్థితి మరుగున పడేందుకై ఆంధ్రకవులు గళమెత్తి పూర్వ ప్రశస్తిని కీర్తించారు. రామిరెడ్డి కూడా ఆ పరిస్థితికి స్పందించాడు. 'హరిసర్వోత్తమ ప్రశంస'ను 'తెలుగుతల్లి' కీర్తిని గానం చేశాడు. "ఎన్నియో శతాబ్దాల నుండి మట్టి దిన్న పాము వలె అలసవైపడియున్న ఆంధ్రాత్మను పునరావిష్కరణము చేసుకొనిరి. ఆత్మ

సాక్షాత్కారమైన వెనుక అధః పతనము లేదు'' అని ఆయన రాశాడు మద్రాసులో స్థిరపడిన డాక్టర్ జేమ్స్ హెచ్. కజిన్స్‌తో ఏర్పడిన పరిచయ ఫలితంగా ఐర్లాండులో 19వ శతాబ్దంలో మొదలైన ప్రాచీన ఐరిష్ జాతీయ నైపుణిని పునరుద్ధరించే ఉద్యమం - గేలిక్ ఉద్యమం రామిరెడ్డిని ఆకర్షించింది. అందువల్ల, ఆయన గతప్రశస్తితో తృప్తిపడలేదు అది దన్నుగ భవితవ్యాన్ని గురించి ఆలోచనచేయాలని ఆయన భావించేవాడు. ప్రజలను నిద్ర నుండి లేపే సంకల్పంతో ఆయన ప్రబోధ ప్రచారగేయ రచన చేశాడు. తన ఖండ కావ్యాల నుండి మణిపూసలు లాంటి పద్యాలను ఏరి 'వాయిస్ ఆఫ్ రీడ్' అన్న పేరున 1923లో ప్రచురించాడు. దీనికి కజిన్స్ ఉపోద్ఘాతం రాశాడు.

జాతీయోద్యమం మందగించిన దశలో 'జస్టిస్ పార్టీవైపు మొగ్గిన రామిరెడ్డి హృదయం, భారత రాజకీయాలలో గాంధీ అవతరించటంతో జాతీయతవైపు మొగ్గు చూపింది. గాంధీజీ ప్రారంభించిన సహాయనిరాకరణోద్యమం (1920), శాసనోల్లంఘనం (1921)ల చేత ప్రభావితుడైన రామిరెడ్డి 'నైవేద్యము', 'మేలుకొలుపు', 'ప్రబోధశంఖము' వంటి ఖండికలను వెలువరించాడు. అయితే, ఫిబ్రవరి 12, 1922 లో గాంధీజీ ఉద్యమాన్ని నిలుపు చేయటం చాల మందికి అసంతృప్తి కలిగించింది. అందులో రామిరెడ్డి కూడా ఒకడు. రామిరెడ్డి రాజకీయస్థుడు కాదు. ఆయనకు రాజకీయ చదరంగం పట్టు విడుపులూ, బేరసారాలూ అర్థం కాలేదు, నచ్చలేదు 1928లో జాతీయోద్యమం పునః విజృంభించే వరకూ ఆయన ఊరకుండి పోయాడు. సైమన్ కమీషన్ వ్యతిరేక ప్రదర్శనలతో ప్రారంభమై 1932 వరకు సాగిన అవిచ్ఛిన్న స్వేచ్ఛా సంగ్రామ దశలో మళ్ళీ గళం విప్పాడు. ఆయన కవిత్వంలో గాంధీ అవతార పురుషుడయ్యాడు గాంధీ మీద పద్యాలు రాశాడు

## కావ్యాలూ - నాటకాలూ :

వాస్తవమూ, ఊహా పడుగు పేకలైన 'కృషీవలుడు' కావ్యాన్ని రామిరెడ్డి 1919లో రచించాడు. 1920లో ఆయన 'జలదాంగన' కావ్యాన్ని రాశాడు 'కర్షక విలాసము' (1917) రాసిన నాలుగేళ్లకు గాని రామిరెడ్డి మరో నాటక రచనకు పూనుకోలేదు. 'కర్షక విలాసము'లో సాంఘిక ఇతివృత్తము నెన్నుకున్నా రామిరెడ్డి దృష్టి 1921లో పౌరాణికాల వైపు పయనించింది. 'సీతావనవాసము'

నాటకాన్ని రచింపచేసింది. 1922-23లో 'యువక స్వప్నము' 'కడపటి వీడుకోలు' కావ్యాల్ని రాశాడు. 'కడపటి వీడుకోలు' కావ్యాన్ని ఆయన ఆంగ్లంలోకి కూడా అనువదించాడు. 1924 అక్టోబరు 20 నుండి 29 లోపల ఆయన 'కుంభరాణా' నాటకాన్ని రచించాడు. అప్పటి భావోద్వేగాన్ని గురించి ఆయన ఇలా చెప్పుకున్నాడు : "తొమ్మిది దినములు తీవ్రమైన కుంభరాణా జీవితమును నేను స్వయముగ ననుభవించితిని. కలలో కూడ నన్ను కుంభరాణా వదలిన వాడు కాదు నిదుర మేల్కొన్నప్పుడు అతని సంభాషణములు నా పెదవులపై నుండెడివి ఈ నాటకము వ్రాయుచుండి నపుడు నాకుఁ గలిగిన భావోద్రేకము, ఆందోళనము మరియే కావ్యము వ్రాసినపుడును కలుగ లేదు. అప్పుడు నా స్నేహితులెవరైన నన్ను చూచి యుండిన యెడల నాకు పిచ్చి పట్టినదని తప్పక యూహింతురు. అందువలన మిద్దెపయి కూర్చుండి తలుపులన్నియు బిగించుకుని ఈ నాటకము వ్రాసితిని నా పిచ్చిని గుఱించి మా ఇంటి వారికి గూడ కొంత తెలియును. నేనయి నేను భోజనమునకు పోవువరకు వారు నన్ను పిలువరు. ఆ సమయమున సూక్ష్మమైన శబ్దము వినబడినను నన్నెవ్వడైన పిలిచినను పట్టనలవిగాని కోపము వచ్చును".

ఎరగుడిపాటి హనుమంతరావు 'కుంభరాణా' నాటక ప్రదర్శనలు దేశమంతటా జరగటానికి రామిరెడ్డికి తోడ్పడ్డాడు. ఆయన గూడూరు బోర్డు హైస్కూలులో ఉపాధ్యాయుడు. స్ఫురద్రూపి, మంచినటుడు రాణాపాత్రను ఆయనే వేశాడు. ముందుగా సూచనలు చేసి నాటకాన్ని తిరుగరాయించాడు. 'మనోరంజన సభ' వారు దాన్ని ప్రదర్శించారు.

'కుంభరాణా' రాసిన వెంటనే 'నాటక కళాసంస్కరణము' పేరుతో ఒక వ్యాసం రాసి 'భారతి'లో ప్రకటించాడు రామిరెడ్డి. వేదం వేంకటరాయశాస్త్రి శిష్యులలో ఒకరు 'రసలుబ్ధుడు' పేరుతో 'కుంభరాణా' నాటకాన్ని దుయ్యబడుతూ 'స్వ్యాస్ టేటరు' పత్రికలో వ్యాసం రాస్తే, రామిరెడ్డి 'కళాప్రియుడు' పేరుతో వ్యాసంరాసి తన నాటక రచనను సమర్థించాడు.

'కుంభరాణా' నాటకంలో ప్రత్యేకించి చెప్పదగిన దుష్ట పాత్ర లేదు. ఈ లోటును తీర్చటానికన్నట్లు, అటువంటి పాత్రనొకదాన్ని కల్పించి 'మాధవ విజయము' అనే నాటకాన్ని 1925లో రామిరెడ్డి రాశాడు. డైరీల సాక్ష్యం

ప్రకారం అది 1925 ఫిబ్రవరి 12 నుండి 20 లోపల పూర్తి అయింది. అయితే, 'కుంభరాణా' కు వచ్చిన ప్రశస్తి 'మాధవ విజయము' నకు రాలేదు మొదటిది ఎరగుడి పాటి హనుమంతరావు తమ్ముడు వెంకటరావు (వై.వి. రావు) చేతిలో తమిళంలో చలన చిత్రంగా కూడా రూపొందింది.

## రామిరెడ్డి - సమకాలీన కవులు - వాదాలు :

కె.వి రమణారెడ్డి అంటాడు : "రామిరెడ్డి జీవితంలో గురువులనీ, శిష్యులనీ, మిత్రులనీ, విరోధులనీ ఎక్కువగా లేరు .. సమకాలిక కవులను బాగా కదిపి కలిపిన రచనోద్యమాలనుండి పూర్తిగా స్వతంత్రించలేకపోయినా, దూరంగా వుండినాడు. ఎక్కడో ఎప్పుడో చూచి పలకరించటమే గాని, ఆనాటి కవులలో ఆయనకు చెలిమి గాఢ స్నేహంగా రూపొందినట్లు లేదు".

వేదం వేంకటరాయశాస్త్రితో ఆయనకు పరిచయం వుంది. ఆయన పాండిత్యం అంటే ఎంత గౌరవం వున్నా ఆయన శాబ్దిక లౌల్య శైలి అంటే రామిరెడ్డికి ఇష్టంలేదు 1925లో ఆయన చేసిన ఉపన్యాసం 'గద్యపద్య కావ్యములు' రామిరెడ్డికి చిరాకు పుట్టించింది. పాండిత్యం లేనిదే కావ్యం రాయకూడదు, సంస్కృతం రానిదే ఆంధ్రకవిత్వం చెప్పగూడదనే శాసనాలు ఆయనకు దుస్సహాలయ్యాయి. ఆ ఉపన్యాసాన్ని ఆయన ముదిమి వల్ల వచ్చిన లోపంగా పరిగణించాడు అలా అని ఆయన పట్ల రామిరెడ్డికి చిన్నచూపు లేదు

గ్రాంధిక భాషా వాదుల పాషాణ పాకమెట్లాగో, వ్యావహారిక భాషా వాదుల 'గ్రామ్య' వాదం కూడా రామిరెడ్డికి సయించలేదు. అలా అని ఆయన గ్రామ్యభాషను నిరసించలేదు జీవద్వంతమైన భాష ఏ కట్టుబాట్లకు లొంగి వుండదని ఆయన అభిప్రాయం

ఆనాటి కవులతో కూడా రామిరెడ్డికి అంత స్నేహం లేదు 1925 ఫిబ్రవరి 25వ తారీకున నాయని సుబ్బారావు పెళ్లి గూడూరులో జరిగింది. విశ్వనాధ సత్యనారాయణ, అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం వంటి కవులు, కొలవెన్ను రామకోటేశ్వరరావు, బెల్లం కొండ రాఘవరావు లాంటి కవి మిత్రులు ఈ పెళ్ళికి వచ్చారు అది గొప్ప అవకాశమే. కాని వీరందరిలోను ఆయన ఒంటరివాడే నండూరి సుబ్బారావు 'ఎంకి

పాటలు' ఆయనకు నచ్చాయి కాని, వాటిని ఆయన 'మహాకావ్యాల'ని భావించలేదు. "మిత్రులందరినీ పిలిచి ఆతిధ్యమిచ్చి వారికి తుష్టి కలిగించి తానూ తుష్టి ననుభవించాడు". కోలవెన్ను రామకోటేశ్వర రావు తాను ప్రారంభించ దలచిన త్రైమాసిక పత్రికలో ఒక సంపాదకుడుగా వుండమని రామిరెడ్డిని అభ్యర్థించాడు. కాని, ఆ పత్రిక 'త్రివేణి' వెలుగు చూసినప్పుడు రామిరెడ్డి పేరు సంపాదక వర్గంలో లేదు. రామిరెడ్డి ఇంగ్లీషు వ్యాసాన్ని ప్రచురించటం, డబ్బు చిక్కులు వచ్చినప్పుడు ఆర్థిక సహాయం అర్థించటం తప్ప రామిరెడ్డి జీవితాన్ని ఈ కొత్త మిత్రులేం ప్రభావితం చేయలేదు. 1927లో విశ్వనాథ సత్యనారాయణ 'జయంతి' పత్రికను స్థాపించినప్పుడు రామిరెడ్డిని రచనలు పంపమని మామూలు మర్యాదలు చేయుటం జరిగింది. 1925 డిసెంబరులో మద్రాసులో రామిరెడ్డి రామకోటేశ్వరరావు, విశ్వనాథ ప్రభృతులను కలిశాడు "అయినా ఈ మైత్రి రైల్వే స్టేషను మైత్రిగా తప్ప గాఢం కాలేదు".

'సాహితీ సమితి' సభాపతి తల్లావఝుల శివశంకరశాస్త్రిని రామిరెడ్డి గుంటూరులో 1927లో కాని కలుసుకోలేకపోయాడు ఒకరి పుస్తకాలు మరొకరికిచ్చు కున్నారు 1929లో మళ్లీ కలుసు కున్నప్పుడు కొంత ఆప్యాయత, చనువు కలిగాయి. వేదుల సత్యనారాయణశాస్త్రి కూడా కలిశాడు. దేవులపల్లి కృష్ణశాస్త్రితో అప్పటి కింకా పరిచయం కలగ లేదాయనకు. రాయప్రోలు సుబ్బారావుతో రామిరెడ్డి కంత పరిచయం లేదు. కాని రాయప్రోలు పట్ల రామిరెడ్డి మనస్సు 'వికర్షితమైంది' అని చెప్పవచ్చు. రాయప్రోలు అస్పష్టతాశైలి రామిరెడ్డికి నచ్చలేదు. రాయప్రోలు 'మధుకలశం', రామిరెడ్డి 'పానశాల' రాశారు. రెండూ ఉమర్‌ఖయ్యాంకు అనువాదాలే ఆ కారణంగా వారిమధ్య పోటీ భావం వుండి వుండవచ్చును.

1926 మార్చిలో హైదరాబాదు వచ్చిన సందర్భంగా రామిరెడ్డికి ఎన్నో పరిచయాలయాయి. సురవరం ప్రతాపరెడ్డి, కొత్వాలు వెంకటరామిరెడ్డి, బారిష్టర్లు గోపాలరెడ్డి, సత్యనారాయణరెడ్డి, పింగళి వెంకటరామిరెడ్డి, కొండారెడ్డి, వనపర్తి రాజా, ఆత్మకూరు రాజా ప్రభృతులు రామిరెడ్డిని చాలా ఆప్యాయంగా ఆదరించారు. బాల సరస్వతీ సమాజంవారి ఆధ్వర్యంలో వేమన గ్రంథాలయంలో రామిరెడ్డి వేమనను గూర్చి ఉపన్యసించాడు తణికెళ్ళ వీరభద్రుడితో, ఉస్మానియా యూనివర్సిటీ ఇంగ్లీషు ప్రొఫెసర్ స్పేటుదొరతో కవిత్వ విషయాలు

ముచ్చటించాడు. మాడపాటి హనుమంతరావు ప్రభృతులతో కూడా పరిచయమైంది.

## భార్యా, పుత్రికా వియోగం :

'నిరంతర దుగ్ధ కుల్య' భార్య శేషమ్మ మరణం తర్వాత గాని రామిరెడ్డికి అమె ఏమిటో తెలిసిరాలేదు. అయన "ఒక్కొక్కప్పుడు కన్నెత్తి చూడకుండా, నోరెత్తి నిండుగా పల్కరించ కుండా అరచూపులతో, పొడి మాటలతో భార్యను సత్కరించేవాడని వినికిడి". స్వీయతో తప్ప పరకీయతో ఆయనకేం శృంగార కాండలు లేవు. కవి రామిరెడ్డి ఊహల్లో సంచరించి వాస్తవాన్ని విస్మరించాడు. ఆమె ఓర్పుగా అతన్ని జయించింది. "ఉపకరణాలలో ఒకటిగా కన్పించిన భార్య చేయి జారిన తర్వాతనే, ఆ వస్తువు విలువ ఎంతటిదో తెలిసి వచ్చింది". గర్భవతి అయిన శేషమ్మ పుట్టింటికి పాపిరెడ్డి పాళెం పోయింది. ఎప్పుడో మరో రాచకార్యం లేనప్పుడు దర్శన భాగ్యం కలిగించేవాడు రామిరెడ్డి. తొలిచూలు కాబట్టి ముందు జాగ్రత్తతో అమెని నెల్లూరు తీసుకువచ్చారు. 1925 జూలై 3 నుండి 5 వరకు పురుటి నెప్పులు వస్తూ పోతూనే వున్నాయి. ఐదోతారీకు మధ్యాహ్నం 1.35 గంటలకు కుముదమ్మ పుట్టింది. శేషమ్మకు వచ్చిన జ్వరం తగ్గలేదు. 107 డిగ్రీల వరకు వచ్చింది. తొమ్మిదో తారీకున ఆమె మరణించింది. ఆయన మాటల్లో "మానవ ప్రయత్నము యొక్క నిస్సహాయతయు, విధి దుర్వారత్వమును నాకప్పుడు ప్రత్యక్షమైనవి. వ్యాధికి మందు కలదు కాని ఆయుష్యమునకు లేదు. ఊపిరి యుండగనే పెమ్మారెడ్డి పాళెమునకు తీసుకొని వచ్చితిమి. మా వాకిటిలో అడుగుపెట్టు వరకును ప్రాణముండినది. తులసితీర్థము పోయగనే ప్రాణము పోయినది. నేను నిజముగ దురదృష్ట వంతుడను. లేకున్న 'అట్టి సాధ్విని, అట్టి వినయ వతిని, అట్టి నిర్మల ప్రేమమయిని ఈ వయస్సులో పోగొట్టుకొని యుండను ఈ దుర్భరావస్థ చెప్పుట కలివి కానిది. ఇట్టి యవస్థ ననుభవించువారు మాత్రము ఊహింపదగినది".

రామిరెడ్డి జీవితంలో ఇది పెద్ద దెబ్బ. ఆ అఘాతాన్నుంచి ఆయన ఎప్పటికీ పూర్తిగా కోలుకోలేదు. ఇలాంటి పిడుగు పాటుకు గురైన మిత్రులు మన్నెం శేషాద్రిరెడ్డి, వి. రామగోపాలరావుగార్లు బాధలో పాలుపంచుకుని, వారిని

ఓదార్చారు. భార్య పోయిన తర్వాత రెండేళ్ళ వరకూ ఆయన బాధలో ఉపశమనం లేదు ఆ దుఃఖం కావ్యరూపంలో 1925 జులై 18న, 22న ఆగష్టు 8న పద్యాలుగా వెలువడింది. అయితే, రామిరెడ్డికి కూతురు కుముదమ్మ కూడా మిగల లేదు పితామహి వద్ద గూడూరులో పెరుగుతున్న కుముదమ్మ, తల్లి పోయి సంవత్సరం మీద పది రోజులు నిండకముందే, ఇరవైరోజుల పాటు విషజ్వరంతో బాధపడి తల్లిని చేరుకుంది అదో పెద్ద విషాదం రామిరెడ్డి జీవితంలో.

## మరో పెళ్ళి :

ఆ తర్వాత గూడూరులో తన బాల్యమిత్రుడు పెల్లేటి వెంకట సుబ్బారెడ్డి మేనకోడలిని వివాహం చేసుకోవాలనుకున్నాడు రామిరెడ్డి. పోకల శేషయ్య నాయుడు మధ్యవర్తిత్వం నెరిపాడు. అయితే, రామిరెడ్డి అయోగ్యతలు ఆయన కున్నాయి. రెండో మారి పెళ్ళి కొడుకు, ముగ్గుబుట్టవంటి తలకు రంగు కూడా పూస్తున్నాడు. రామిరెడ్డికి లౌక్యత లేదనేది జనంలో తెలియని వాళ్ళెవరూ లేరు. "లిబ్బి మూటకట్టి ఆస్తిని పెంచే చాకచక్యం లేదు" కవిగా కీర్తి పొందితేనేం, సంసారిగా అప్రయోజకుడు మొదలు పిల్లతల్లి ఒప్పుకోలేదు, ఆ తర్వాత పిల్లతల్లి ఒప్పుకున్నా పిల్ల ససేమిరా ఈ పెళ్ళికి ఒప్పుకోలేదు అదో భంగపాటయింది రామిరెడ్డికి. 'ప్రణయ బలి' అన్న ఆయన రాసిన ఖండ కావ్యంలో ఈ భంగపాటు, అది సౌజన్యకోమలంగా పరిణమించిన తీరు వ్యక్త మవుతుంది.

రామిరెడ్డి 1929 మార్చి 4న డైరీలో "మీరాబాయి అనే విషాదాంత నాటకం రాసినప్పుడు భార్య చనిపోయిందనీ, 'కడపటి వీడుకోలు' అనే భగ్నప్రణయ కావ్యం రాసినప్పుడు తన ప్రేమ భగ్నమయిందనీ తన రచనలే తన భవిష్యత్తును నిర్ణయిస్తున్నట్లుగా ఉన్నాయనీ అంటూ తన జీవితంలో సుఖం కలగాలంటే ఒక సుఖాంత కావ్యం రాయలేమోనని" రాసుకున్నాడు. అయితే, అలాంటి అవసరం లేక పోయింది. "తన వలెనే భార్యా వియోగ దుఃఖంపాలైన మిత్రుడు మన్నెం శేషాద్రిరెడ్డి, చెప్పకుండానే రామిరెడ్డికి బాధోపశమన మార్గాన్ని చేసి చూపించాడు. దాని పేరు మరో పెళ్ళి. ఈ సూచన అందుకున్నాడా అన్నట్లు, 'ప్రణయ బలి' జరిగిన నాలుగు నెలలకే,

అదే ఊరిలో అదే పేరు కలిగిన కన్యను పెళ్ళాడినాడు''. 1929 జూన్ 16న పొద్దున 10 30 గంటలకు అన్నపూర్ణమ్మతో ఆయన వివాహమైంది

ఇల్లు :

రామిరెడ్డి 1923లో కొత్త ఇల్లు కట్ట నారంభించాడు పాత ఇల్లాలు పోయి, కొత్త ఇల్లాలు వచ్చినా అది పూర్తికాలేదు కారణం రైతుగా రామిరెడ్డికి సాలీనా వచ్చే ఆదాయం అంత ఎక్కువ కాదు. తలపెట్టిన ఇల్లా చిన్నది కాదు డిప్రెషను ముందు రోజుల్లోనే దీనికి దాదాపు నలభైవేలు ఖర్చయింది అది పూర్తయ్యాక ఎంతో మంది దాన్ని దర్శించటానికి వచ్చారు. అదో గొప్ప నిర్మాణం గ్రీకు విగ్రహ నిర్మాణ కళకు సామాన్యమైన నకళ్ళని చెప్పదగిన విగ్రహాలు చెక్కించాడు రోజుకు ఆరణాల కూలీకి వెంకటగిరి నుండి వచ్చిన తాపీ పని వాళ్ళేకాక, రోజుకు మూడున్నర రూపాయల వేతనంతో మైసూరు నుండి ఓ శిల్పిని పిలిపించి పనిలో పెట్టుకున్నాడు రామిరెడ్డి.

ఇంక రామిరెడ్డికి వాస్తు శాస్త్రంలో చాలగురి ఆ శాస్త్రం ప్రకారం ఇల్లు నేరుగా తూర్పు వైపుకు కాక ఈశాన్యం మూలకు కొద్దిగా తిప్పి కట్టించాడు మద్రాసు జ్యోతిష్కుడు కట్టబోయే ఇల్లు పాము పడగ రూపంలో వుంటుందన్నాడు. కనుక పోర్టికో అలాగే తయారైంది ఇంతలో రెండో పెళ్ళయింది ఇంకా అప్పు మిగిలి వుంది. ఉన్నభూమిలో ఏడెకరాలు అమ్మి అప్పు తీరుద్దామనుకున్నాడు కాని, భార్య తన డబ్బుతో అప్పు కట్టి, ఆ భూములు తన పేర రాయించుకుంది.

## వైర్లెస్ రిసీవర్ :

మద్రాసు నాడీజ్యోతిష్కుడు మరో జోస్యం కూడా చెప్పాడు; 'అన్యనాట్టు' సంగీతం వినేయంత్రాన్ని తయారు చేస్తావన్నాడు. ఆ కాలంలో నెల్లూరు జిల్లా మొత్తంలో రేడియోలు దాదాపుగా లేవనే చెప్పాలి. భారతదేశంలో ప్రప్రథమంగా రేడియో ప్రసారం 1924లో మద్రాసులోని 'రేడియో క్లబ్బు' అనే ప్రైవేటు సంస్థ ప్రారంభించింది. 1927లో కానీ 'ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్' సంస్థ ఏర్పడలేదు 1930లో అది మూతపడినప్పుడు ఆ బాధ్యతను ప్రభుత్వం గ్రహించింది అలాంటి కాలంలో రేడియో తయారు చేయాలనే రామిరెడ్డి

సంకల్పం ఆశ్చర్య కరమే కాదు, అసాధారణ విషయం కూడా. జర్మనీ దేశం నుండి విడిభాగాలు తెప్పించాడు, ఛార్టుల సాయంతో వాటిని కూర్చాడు. కేబినెట్‌లో అమర్చాడు. అలా 1930 డిసెంబరు 15న వైర్లెస్ రిసీవర్‌ను తయారు చేశాడు. మరొక తొమ్మిది నెలల్లో ఇంకో రిసీవరు నిర్మించి, నెల్లూరు మునిసిపాలిటీ వారికి బహూకరించాడు.

కొయ్యతో ఒక విమానం చేసేందుకు కూడా రామిరెడ్డి ప్రయత్నించాడు. ఈ ప్రయత్నాలన్నీ రామిరెడ్డి శాస్త్రాభిరుచికి, జ్ఞాన తృష్ణకు తార్కాణాలు.

## కవికోకిల :

1929 నవంబరు 4న కడప కోటిరెడ్డి అధ్యక్షతన బెజవాడలో కూడిన ఆంధ్ర మహాసభవారు దువ్వూరి రామిరెడ్డిని 'కవి కోకిల' బిరుదంతో సత్కరించారు. ఆయన గీతాల్లో పలుమార్లు ప్రసక్తమైన కోకిలే - "సెలయేటి పాటలో దాగియున్న రాగతత్వమును ఆమని రాత్రులలో కూసే కోయిల ఒకచోట, చిత్తరంజకమైన రాగ నిశ్రేణి వేసి భువి నుండి దివికి దివ్య గానం దింపే కోయిల మరో చోట, హృదయ సంస్పర్శి రాగాలాలపిస్తున్న కోయిలా గంతుకులు ఒక చోట" - బిరుదుకు తగిందని వారు భావించారేమో. ఆ తర్వాత రామిరెడ్డి 'కవికోకిల'గా ప్రసిద్ధి గాంచాడు. ఆయనా ఈ బిరుదును బహిరంగంగా సగర్వంగా వాడుకోసాగాడు.

## పానశాల, కాంగ్రెస్ వాలా :

రామిరెడ్డికి 'పానశాల' తెచ్చినంత కీర్తి 'కృషీ వలుడు' తప్ప మరేదీ తీసుకురాలేదు. ఇది ఉమర్ ఖయ్యాం పార్శీ కృతికి అనువాదం. "పిశుపాటి వేణుగోపాలు, రుబాయతు పార్శీ ప్రతిని హైదరాబాదు నుండి పంపాడు. 1926లో హైదరాబాదు ప్రయాణం ఈ (అనువదించే) సంకల్పాన్ని దృఢ తరం చేసి వుంటుంది. దానికి తోడు భార్యా పుత్రికల మృతి, బిడ్డపోయిన పది రోజులకు అనువాదం మొదలై, పక్షం రోజులకు 50 రుబాయీలను తెలుగు చేయటం జరిగింది. 1927 నవంబరులో 14 నుండి 24 లోపల, రుబాయతు కొరవ ఆంధ్రీకృతమైంది. మొత్తం 110 పద్యాలున్నాయి. 1928లో 'భారతి' పత్రికలో ముద్రణ. 1934లో ఉపోద్ఘాతం. 1935లో గ్రంథ రూపం" అని చెప్పాడు కె.వి. రమణారెడ్డి 'పానశాల' పుట్టు పూర్వోత్తరాల గురించి.

ఉమర్ ఖయ్యాం క్రీ.శ. 11వ శతాబ్ది ఉత్తరార్థంలో పారశీక దేశంలో రుబాయతులు రచించాడు. కవిగా ప్రముఖుడే కాక, లోకానుభవాలను స్వీయానుభవాలలో జోడించి నవతత్వాన్ని ప్రవచించిన వాడు ఉమర్ ఖయ్యాం. ఇంగ్లీషులో ఫిట్జ్‌రాల్డ్, ఫ్రెంచిలో జె.బి. నికోలె ఖయ్యాంను పాశ్చాత్యులకు పరిచయం చేశారు. తెలుగువారికి రాయప్రోలు సుబ్బారావు 'మధుకలశము' అన్న పేరుతో పరిచయం చేశాడు. అయితే అది ఫిట్జ్‌రాల్డ్ అనువాదానికి అనువాదమవటం వల్ల తెలుగు వారికది అంతగా నచ్చలేదు. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి సూచన మేరకు ఉమర్ ఖయ్యాంను తెలుగు వారికి పరిచయం చేసే బాధ్యతను రామిరెడ్డి స్వీకరించాడు. అందుకు తగిన అర్హత కూడా వుంది ఆయనకు. తెలుగులో కవిత్వం చెప్ప గలిగే ప్రతిభేకాక, పారశీక భాషలో నేరుగా ఉమర్ ఖయ్యాం 'రుబాయతు'లను చదవ గలిగే సామర్థ్యం వుంది ఆయనకు. ఆయన 1919లోనే పారశీకం నేర్చుకోవడం మొదలెట్టాడు. నెల్లూరులోని హబీబుల్లా సాహెబు సహాయ సహకారాలతో పారశీక భాషతో పరిచయం సంపాదించాడు. 1925 మేలో ఆయన డైరీలో రాసుకున్నాడు : "'గులిస్తాను'లో కొన్ని సందేహములు తీర్చుకోవటము, సంప్రదాయ సిద్ధమైన ఉచ్చారణమునలవరచుకొనుటకు, నేనా సాహెబుగారి యొద్దకు పోవు చుంటిని. ఆయనకు పారశీక భాషయందు చక్కని పాండిత్యము కలదు. అరబ్బీ భాషయందును ప్రవేశము కలదు. ఉర్దూ పారశీక భాషలలో కవిత్వము వ్రాయగలరు" ఆయన సాయంతో 'గులిస్తాను' నుండి 16 5.1925 నాడే కొన్ని పద్యాలు తర్జుమా చేశాడు.

'పానశాల' 'రుబాయతు'కు నకలు కాదు. ఇది పునః సృష్టి. ఉమర్ ఆలీషా కవి 'రుబాయతు' ను అనువదించాడు. డాక్టర్ చిలుకూరి నారాయణరావు, మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు ప్రభృతులు ఖయ్యాంను తెలుగు వాణ్ణి చెయ్యాలని చూశారు. ఆశాభంగం పొందారు, కాని రామిరెడ్డి 'రసికాంధ్రప్రీతి' కావించాడు.

1935 నాటికి రామిరెడ్డి ఎప్పుడు మద్రాసు పోయినా పాకాల వేంకట రాజమన్నారు ఇంటిలోనే బస చేసేవాడు. అప్పటికే ఆయన గ్రాంథిక భాష నుండి తప్పించుకుని వ్యావహారిక భాషలో ఏకాంకికలురాసి, దేశాన్ని ఊపిపారేస్తున్నాడు. 1925 నాటికే రామిరెడ్డికి నాటక రచన మీద నిర్దిష్టమైన

అభిప్రాయాలున్నాయి. సమకాలీన సమాజానికి సంబంధించి, వాడుక భాషలో నాటకం రాయాలనే ఆలోచన కలిగింది. అదే 'కాంగ్రెస్ వాలా' అనే రాజకీయ ఏకాంకికను వెలువరించింది.

## చిత్ర లోకంలో :

1936 తరువాత రామిరెడ్డి ఆలోచనలు చలన చిత్ర రంగంలోకి అడుగుపెట్టాయి. అన్ని కళల, శాస్త్రాల సమాహార కళ చలనచిత్రకళ. బహువిధ మేధో సంపత్తి కలిగిన రామిరెడ్డిని అది ఆకర్షించింది. మొదటగా రేబాల దశరథరామిరెడ్డి, పందిపాటి సుబ్బరామిరెడ్డి, అడపాల వెంకట కృష్ణారెడ్డి లాంటి నెల్లూరి మండల ధనవంతులు శ్రీ రామా ఫిలిమ్స్ అనే సినిమా సంస్థను నెలకొల్పి 'సతీ తులసి' లేక 'జలంధర' చిత్ర నిర్మాణాన్ని చేయ పూనుకున్నారు. ఈ చిత్రానికి కథ, సినేరియో, మాటలు-పాటలు రామిరెడ్డి రాశాడు. నిర్మాతలలో ఒకడైన ఘంటసాల బలరామయ్యకు ఆ బాధ్యత కూడా దర్శకుడు చిత్రపు నరశింహారావుకే ఇవ్వాలని వుంది కాని, రామిరెడ్డి అప్పటికే ఆర్జించుకున్న కీర్తి ప్రతిష్ఠల దృష్ట్యా నిర్మాతలు ఆయనకే ఆ బాధ్యత నప్పగించారు. ఆ సినిమా కంపెనీ వారి నుండి ఆయనకు దాదాపు వెయ్యి రూపాయలు ముట్టాయి. మద్రాసులో చిత్ర నిర్మాణం సాగినంత కాలం కంపెనీ వారే బాడుగ భరించి ఆయనకు గృహ వసతి కల్పించారు. 1936లో చిత్రం విడుదల అయింది. కళా దృష్టిలో అది ఉత్తమ చిత్రమైనా, ఆర్థిక దృష్ట్యా నిర్మాతలకు నష్టమే వచ్చింది. కె.వి. రమణారెడ్డి అంటాడు : "సినేరియో బాధ్యత వహించిన రామిరెడ్డి, ఈ నష్టానికి ఎంత బాధ్యుడో తెలియదు, అయితే కవిగా ఆయన చేకూర్చిన హంగులు మాత్రం మెచ్చుకో దగ్గవి".

నష్టం వచ్చినా నిర్మాతలు వెనక్కి తగ్గలేదు. 'చిత్రనళీయం' చిత్రాన్ని తీయ సంకల్పించారు. 'సతీ తులసి' చిత్ర నిర్మాణం రోజుల్లోనే రామిరెడ్డి మనసు దర్శకత్వం వైపు పోయింది. అది గురుతర బాధ్యత. సంఘటనా దక్షతే కాక, సాంకేతిక విషయ పరిజ్ఞానం కూడా వుండాలి దర్శకుడికి. రామిరెడ్డిలో వున్న గుణం - ఏదైనా తేలిగ్గా, వేగంగా నేర్చుకోగలగటం, లోపం వాస్తవాన్ని గమనించకపోవడం, డబ్బును లాభాన్ని గురించి ఆలోచించక పోవటం. ఆయన తీసే చిత్రం కళాఖండ మవుతుంది గాని, డబ్బు చేసుకోదు.

స్టూడియోలు ఎక్కువగా లేని మద్రాసు కాదని, సకుటుంబంగా నటీనటవర్గ సమేతంగా ఆయన్ని కలకత్తా పంపారు నిర్మాతలు. పోయింది మొదలు చిత్రం త్వరగా రావాలని హడావుడి పెట్టారు. దర్శకునికీ, నిర్మాతలకీ మధ్య ఎన్నో వివాదాలు తలెత్తాయి. పి పుల్లయ్య 'ఎడిటర్'గా వుండాలని నిర్మాతలంటే రామిరెడ్డి అంగీకరించలేదు. మైత్రిని పాటిస్తూ నలుడుగా మాధవ పెద్ది వెంకట్రామయ్య సరిపోతాడని రామిరెడ్డి, ఆయన యువ పాత్రలను ధరించ లేనంతటి వయోధికుడైనాడని, అద్దంకి శ్రీరామమూర్తిని గాని, రాయప్రోలు సుబ్రహ్మణ్యంను గాని తీసుకోవాలని నిర్మాతలు. రామిరెడ్డి నెగ్గాడు. నాయికగా శ్రీరంజని నటించాలన్నారు, బాల బాలికలను చిత్రాల్లో ప్రవేశపెడితే బాగుంటుందన్నారు నిర్మాతలు. మధ్యలో నటుల కుమ్ములాటలు, చివరకు బి.యల్ ఖెమ్కా 'ఈస్టిండియా ఫిలిం కంపెనీ'లో చిత్ర నిర్మాణానికి సన్నాహాలు మొదలయ్యాయి. జనాకర్షణ కలిగించే పాటలు అరడజనైనా వుండాలనీ, చిత్రం తొందరగా రావాలనీ సలహాలూ, కసుర్లూ, విసుర్లూ విసురుతూ నిర్మాతలు ఉత్తరాలు రాశారు వాళ్లకు కలకత్తా నగరంలో చిత్రాలు తీయటంలో వున్న సాధక బాధకాలు తెలియవు. "తమకు అనుకూలుడుగా, అక్కడి వ్యవహారాలన్నీ ఒక కంటితో కనిపెట్టి వుండి, ఎప్పటి కప్పుడు తెలియ పరిచేందుకై, మేనేజరు హోదాలో ఎస్ ఎమ్ కె రెడ్డి (జూనియర్)ని నియమించారు. రామిరెడ్డికీ ఈ పొడి అక్షరాల పేరుగల వ్యక్తికీ సరిపడేది కాదు కాబట్టి, అతని నివేదికలూ, వేదనలూ చూసీ నిర్మాతలు అసహనం పెంచుకున్నారు" 1937 జనవరిలో మొదలైన చిత్ర నిర్మాణం ఏప్రిల్ చివరికి పూర్తికావాలని నిర్మాతలు గడువు పెట్టారు గడువు దాటిపోయింది, నెలలు గడుస్తున్నాయి, డబ్బు సంచులకు గండ్లు వడుతున్నాయి, కానీ చిత్రం వూర్తి కాలేదు. నిర్మాతలు బెంబేలెత్తిపోయారు ఉత్తరాల మీద ఉత్తరాలు గుప్పించసాగారు కలకత్తా ఖర్చులకు కూడా చాలేంత డబ్బు లేదు కళాకారులకు వేతనా లివ్వలేక లాభాలలో భాగమివ్వవచ్చు నన్న ప్రతిపాదన చేశారు. నేరుగా రామిరెడ్డిని ఏమీ అనని సంస్కారి రేబాల దశరథరామిరెడ్డి కూడా వ్యంగ్య బాణాలు వదులుతూ ఉత్తరం రాశాడు 1937లో చిత్రం విడుదల అసంభవమని స్పష్టమైంది. కంపెనీ మూసివెయ్య వలసిన అగత్యం ఏర్పడినట్లు నిర్మాతలు బాధ పడ్డారు పుకార్లు మొదలయ్యాయి కంపెనీ దివాలా తీస్తుందన్న

భయంతో పందిపాటి సుబ్బరామిరెడ్డి వంటి భాగస్థులు రు. 5000 విలువకల షేర్లను రెంటిని రు 3000 లకే. అమ్ముకున్నారు. రామిరెడ్డికి పక్షవాతం వచ్చిందని పుకారు. మిగిలిన షాట్లను బొంబాయిలో తీద్దామనుకున్నారు. అక్కడా పూర్తి కాలేదు. చివరకు మద్రాసే శరణ్యమైంది ఈ విషయాన్నే బి.ఎన్.రెడ్డి రమణారెడ్డితో "ది టేల్ ఆఫ్ త్రీ సిటీస్' అని చమత్కరించి చెప్పాడు చిత్రం పూర్తయే సరికి రెండు లక్షల పాతికవేలు ఖర్చయ్యాయి.

"మరుగునపడ్డ గొప్ప కళాఖండమని 'చిత్రనళీయం' గురించి ఆనాటి వారు ఈనాడు అంటున్నారు... చిత్రాన్ని బాగా తీర్చి దిద్దటంలో ఇంత జాగు, ప్రకృతిని దృశ్యం చేయటంలో, అతిజాగ్రత్త, ప్రజామోదం పొందగల ఆటవికుల నృత్యాలు, సభామంటప దృశ్యాలు, అరణ్యశోభా చిత్రాలు, విద్యాధికుల మన్నన లందగల ప్రకృతి దృశ్యాలు - హంగుల విషయంలో శ్రద్ధ." ఇవన్నీ చిత్ర నిర్మాణంలో జాగుకు, ఖర్చయిన డబ్బుకు కారణాలు. రామిరెడ్డి ఈ చిత్ర నిర్మాణంలో ఎంతో పరిశ్రమించాడు. 'అమెరికన్ అమెచ్యూర్ ఫొటో గ్రాఫర్', 'ఇంటర్నేషనల్ ఫొటో గ్రాఫర్', 'అమెరికన్ ఫొటో గ్రాఫర్' వంటి పత్రికలు తెప్పించి చదివాడు. అంతేకాదు, ఖరీదైన కెమేరాలను కొనుగోలు చేశాడు స్వయంగా చిత్ర కారుడైనందువల్ల కళాదర్శకుడు రామారావుకు మంచి సలహా ఇచ్చేవాడు. రష్యన్ చిత్ర దర్శక నిర్మాత పుడోవ్కిన్ రచనలను చదివి స్క్రిప్ట్‌ను గురించి అధ్యయనం చేశాడు. ఛాయా చిత్ర గ్రాహకుడుగా పనిచేసిన కృష్ణ గోపాల్ అంటాడు : "I am sure, had Mr Reddı lived longer, and had we been given an opportunıty of makıng another pıcture, ıt ıs just possıble we could have found a happy blend between his ıdealısm and my matter-of-factism, and produced a pıcture of whıch both he and I would have been proud". బి.ఎన్. రెడ్డి కూడా ఆయన "better than many other Dırectors in the wealth of knowledge about the craft to which he was drawn" అన్నాడు. ఆయన రాసిన సినేరియో, సాహిత్యం గొప్పదే. అయితే ఏం - అన్ని సుగుణాలు ఒక్క అవలక్షణం - వాణిజ్యపరమైన వైఫల్యంలో నశించి పోయాయి. మళ్ళీ దర్శకత్వ భారం ఆయన వహించలేదు.

అయితే. రామిరెడ్డికి సినిమారంగంతో సంబంధం 1942 వరకూ కొనసాగింది పి. పుల్లయ్య నిర్మించిన 'బాలాజీ' లేక 'వేంకటేశ్వర

మాహాత్మ్యం', ఘంటసాల బలరామయ్య నిర్మించిన 'పార్వతీ పరిణయము', 'సీతారామ జననము' చిత్రాలకు కొన్ని పద్యాలు, పాటలు రాసి ఇచ్చాడు. 'సీతారామ జననము' చిత్రానికి పూర్తిగా సంభాషణలు మాత్రమే రాశాడు. తీరిక సమయాల్లో బి.ఎన్. రెడ్డి ఇంటికి పోయి, వాహినీ బృందంతో కథాచర్చలలో పాల్గొనేవాడు.

## చిత్రనిర్మాణ కాలంలోనే :

రామిరెడ్డి ఇలా చిత్ర నిర్మాణంలో సతమతమయ్యే కాలంలోనే 1937 ఏప్రిల్‌లో తిక్కన జయంతి సందర్భాన ఉపన్యాసం పంపి రేబాల దశరథరామిరెడ్డి నుండి నూటపదహార్లు బహుమతిగా పొందాడు. అదే నెలలో ఆంధ్ర విశ్వవిద్యాలయం 1939 డిగ్రీ తెలుగు గ్రూపు పరీక్షకు పాఠ్యాంశంగా 'కుంభరాణా' ను ఎన్నిక చేసింది. 'చిత్ర నళీయం' సినిమా తీసిన తర్వాత, తీరిక సమయాలలో ఫ్రెంచి భాష నేర్చు కొన్నాడు. జాషువా కవిని యుద్ధ ప్రచారానికి ఉపయోగించు కున్న విదేశీ ప్రభుత్వం, యుద్ధ ప్రచార చిత్రాలకు దర్శకత్వం వహించమని రామిరెడ్డిని కోరినా ఆయన అంగీకరించలేదు. అదే విధంగా, నెల్లూరు వి.ఆర్. కాలేజీలోనూ, ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనూ ప్రధాన ఆంధ్రాచార్య పదవి ఇస్తామన్నా ఆయనందుకు ఒప్పుకోలేదు.

## సాంసారిక జీవితం : తరవాతి రచనలు :

1934 సెప్టెంబరు 20న ఆయనకు కొడుకు జనార్ధనరెడ్డి పుట్టాడు. అప్పటికే వేణుగోపాలరెడ్డి మూడేండ్ల బిడ్డ. తన మొదటి భార్యకు 'పానశాల' ను అంకితం చేసిన కవి, రెండవ భార్య అన్నపూర్ణమ్మకు 'పలితకేశము' నిచ్చాడు. అది 1944లో చేసిన రచన. అంతకు ముందు రాసిన రచనలున్నాయి. 'మిత్రా' అన్న మకుటంతో 65 కందాలతో 'మిత్రార్థ శతకము' 1940 నాటికే రాశాడు. అంతకంటే ముఖ్యమైనది. 'గులిస్తాను' అనువాదమైన 'గులాబితోట'. దాన్ని తెనిగించడం ఆయన 1925లోనే ప్రారంభించాడు. 1944 వరకూ అప్పుడప్పుడూ కొంత తెనిగించాడు. హితోక్తులతో కూడిన షేక్‌సాదీ రచన, ఉమర్ ఖయ్యాం రచనంతగా ఆయన్ని ఆకట్టుకోలేదు. అందుకే జాప్యం. 1945లో సాదీ రచనే 'బోస్తాను'ను 'పండ్లతోట'గా అనువదించడం ప్రారంభించాడు కానీ, చతుర్థాధ్యాయం తర్వాత పూర్తి కాకుండా మరణం అడ్డమొచ్చింది. 1942-

43ల మధ్య ఆయన చేసిన రచన 'కవి-రవి'. ఇది విశ్వం, సూర్యుడు పట్ల రామిరెడ్డి కున్న శాస్త్రీయ సిద్ధాంతాలను చెప్పే రచన. రమణారెడ్డి అంటాడు, "1942లో కూడా రామిరెడ్డి 1910 నాటి శాస్త్రీయ సిద్ధాంతాన్ని దాటలేదు" అని

దీని తర్వాత పదిరోజుల వ్యవధిలోనే ఆయన రాసిన కావ్యం 'పలితకేశము'. రమణారెడ్డి మాటల్లో అది "అతని జీవిత వాఙ్మూల మనిపించే కావ్యం. పూర్తి స్వేచ్ఛను వహించి, ఒండొంటితో గట్టి సంబంధాలు లేని అంశాలను కూడ గట్టి, సర్వ సామాన్య విషయాలపై ఉపన్యసించే ధోరణిలో రాశాడనేకాని, చమత్కారం విజ్ఞానం హాస్యధోరణి ఈ కావ్యాన్ని పఠనీయ మొనరిస్తున్నాయి" అని. ఇది 'భారతి'లో ప్రకటితమైంది.

## చివరి రోజులు :

సాదీ మహాకవి 'బోస్తాను' అనువాదం ఇంకా పూర్తికాలేదు. ఆయనలో జవ సత్వాలుడిగి పోయాయి. 1945లో 'బోస్తాను' అనువాదం మొదలు పెట్టిన తర్వాత సంవత్సరంన్నర ఏమీ రాయలేక పోయాడు, చదవలేక పోయాడు. "చదివినను వ్రాసినను నెత్తురు పోటు హెచ్చు చుండును అందువలన నేను ఇంత కాలము నిరర్థకముగ జీవితము గడుపు చుంటిని" అని 1946 సెప్టెంబరులో ఓ లేఖలో రాశాడు. అందుకు కారణం పక్షవాతం. 1945 జూలై ఆగష్టుల్లో తోటకుపోయిన రామిరెడ్డి పక్షవాతానికి గురయ్యాడు. కుడిభాగమంతా చచ్చుపడిపోయింది. పెమ్మారెడ్డి పాళెం పొలిమేర దాటగానే వచ్చే యల్లాయ పాళెం లోవుండే రమణయ్య అనే నాటువైద్యుడిని పిలిపించారు చికిత్స మొదలైంది. రామిరెడ్డి త్వరలోనే కోలుకోగలిగాడు. అయితే నెత్తురు పోటు మాత్రం తగ్గలేదు. 1946 గడచిపోయింది. 1947లో కలం అంగుళమైనా గమించలేని దుస్థితికి లోనయ్యాడు. అయినా ఆయనలో తృష్ణ పోలేదు డ్రై బేటరీల స్థానంలో మామూలు టార్చిలైటు సెల్సును ఉపయోగించి మళ్ళీ రెండోసారి రేడియోను నిర్మించాడు. అది జనవరి 1947లో

మళ్ళీ జబ్బుతో పడక పెట్టాడు రామిరెడ్డి ఆయనకు తెల్సు తనకు మరణం తప్పదని, ఎందుకంటే గ్రహచారం తప్పదు కనుక ఆయనకు గ్రహాల మీద, రాసుల మీద దేవుని మీద కంటె ఎక్కువ గురి. మద్రాసు వెళ్ళి డాక్టరు గురుస్వామి వద్ద నయం చేయించుకోమని బంధువులు పోరు పెట్టినా ఆయన

పెడచెవిన పెట్టాడు 1947 సెప్టెంబరు 4వ తారీకున వ్యాధితీవ్రమైంది. పక్క ఊరు గుండలమ్మ పాళెం నుండి ఆబాల్యమిత్రుడైన సిద్దారెడ్డి వెంకట సుబ్బారెడ్డి నెల్లూరు నుండి డాక్టరును తీసుకు వచ్చి చూపెట్టాడు డాక్టరు పరీక్షించాడు. రక్తపు పోటు 210/185 వుంది నెల్లూరికి వచ్చి ఆస్పత్రిలో చేరమన్నాడు. నెల్లూరు, ఆ పరిచిత వాతావరణం రామిరెడ్డి మనసును లుబ్ధపరిచింది. ఆస్పత్రిలో చేరిం తర్వాత రెండు మూడు రోజుల్లో పరిస్థితి అదుపులోకి వచ్చింది. అయితే, వెంటనే మళ్ళీ వ్యాధి తిరగబెట్టింది.

రామిరెడ్డికి తను చేయాలనుకున్న పని వెంటనే చేయాలనుకున్నాడు గ్రంధ రచన, ఫిలిం దర్శకత్వం, సినేరియో కల్పన వంటి పనుల ద్వారా తాను సంపాదించిన 'ధనం కొంత నెల్లూరు ప్రీమియర్ బాంకులోను, గూడూరులోని తోడల్లుడు సిద్దారెడ్డి రంగారెడ్డి వద్దా వుంది దాదాపు పదివేల రూపాయలు. కుటుంబాస్తికీ దీనికీ సంబంధం లేదు. దీనిని ట్రస్టు క్రింద మార్చి, శాశ్వత నిధిగా గవర్నమెంటు సెక్యూరిటీలలో వుంచి, దాని మీద వచ్చే వడ్డీ నుండే ఏటేటా తెలుగులో వైజ్ఞానిక విషయ రచనలలో అగ్రగణ్యుడైన రచయితకు బహుమానాన్ని ఇచ్చే ఏర్పాటు చేయాలి. ట్రస్టు ఆస్తి పాస్తులను 'కవికోకిల దానధర్మాలు' అని వ్యవహరించాలి. ట్రస్టీలుగా యం వి. కృష్ణారెడ్డి, డాక్టర్ ఏనుగ సుందరరామిరెడ్డి, పి.సి. రెడ్డి, సిద్దారెడ్డి వెంకట సుబ్బారెడ్డి వుంటారు. రెండు మూడేళ్ళలో తన కొడుకు దువ్వూరి వేణుగోపాల రెడ్డి మేజరవగానే సిద్దారెడ్డి వెంకట సుబ్బారెడ్డి స్థానాన్ని గ్రహిస్తాడు. తన దృష్టిలో ఎవరెవరికి ముందుగా బహుమతులియ్యాలో కూడా ఆయన యోచించి పెట్టు కున్నాడు అందులో ఒకరు, 'భారతి' పత్రికలో జ్యోతిశ్శాస్త్ర సంబంధి వ్యాసాలను పరం పరంగా ప్రకటించిన గొబ్బూరి వెంకటానంద రాఘవరావు, రెండు బెనారస హిందూ విశ్వవిద్యాలయంలో పనిచేసి, అప్పుడు మచిలీ పట్నంలోని ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీలో వుంటూ 'విశ్వరూపము' రచించిన కాళీపట్నం కొండయ్య, ఇంకా ఎంత మందో. ఆయనకు ఆలోచించే వ్యవధి లేదు.

సంధి ప్రేలాపన అని అనుకున్నా అతని ఆప్త బంధువులకు అతని మాటలు పాటించక తప్పలేదు. కొందరికి నచ్చక అడ్డు కున్నారు. సెప్టెంబరు 8వ తేదీన మోచర్ల రామకృష్ణయ్య ఆయన మాటలన్నీ విని వీలునామా రాసి పట్టుక వస్తానన్నాడు. రెండు రోజులు ఆశగా వీలునామా కోసం ఎదురు చూశాడు

రామిరెడ్డి. చివరకు 11వ తేదీన వీలునామా పత్రం వచ్చింది చదివి విన్పించగా విన్నాడు. దాన్ని రిజిస్టరు చేయించాలి. ఓ విధమైన మూకీ సహాయ నిరాకరణోద్యమం చుట్టు ముట్టి వుంది. పి.సి. రెడ్డికి గట్టిగా చెప్పాడు, రిజిస్ట్రారును పిలిపించమని ఆయనకంతకు ముందే సిద్దారెడ్డి బాలకృష్ణారెడ్డి ద్వారా రోగి బంధువర్గం వారి నిశ్చితాభిప్రాయం తెలిసింది - రిజిస్టరి జరగకూడదని. పి.సి. రెడ్డి అయిపు లేకుండా వెళ్ళి పోయాడు. రిజిస్ట్రారు కోసం రామిరెడ్డి నిరీక్షణ సంధి ప్రేలాపన లాగుంది. డాక్టరు వచ్చి రక్తపు పోటు చూశాడు. డాక్టరు గుండె ఆగినంత పనైంది. రోగి అభీష్టం నెరవేరిస్తే రోగం తగ్గ ముఖం పట్టునేమో అని అన్పించిందాయనకు అందువల్ల తనే రిజిస్ట్రారును వెంట బెట్టుకు తీసుకురావాలని ప్రయత్నించాడు. కాని అప్పటికే రిజిస్ట్రారు ఆఫీసు మూతపడే వేళ అయింది ఆ మర్నాటికి గాని అది కుదరదు. రిజిస్ట్రారు సలహాతీసుకుని రోగి సంతకం తీసుకోవాలను కున్నాడు. మర్నాడు రిజిస్టరు చేయించాలనుకున్నాడు. అయితే డాక్టరు తిరిగి వచ్చేసరికల్లా పరిస్థితి విషమించింది. రాత్రి 9 గంటలకి రక్తపుపోటు 260/210 చూపుతోంది. ఇటువంటి వ్యాధుల్లో రక్తం తీసివేయటమే ఆరోజుల్లోని విధానం. తప్పక ఆపని చేశాడు డాక్టరు చివరకు పరిస్థితి అదుపులోకి వచ్చిందను కున్నాడు. కాని వెంటనే రోగి స్పృహకోల్పోసాగాడు. సిరిబ్రల్ హెమరేజ్ అనుకున్నాడు డాక్టరు 12వ తేదీ వచ్చి ఐదు నిమిషాలైనా గడవలేదు. రామిరెడ్డి గుండె ఆగిపోయింది. అందుకు కారణం వైద్య పరిభాషలో 'డి కంపెన్సేషన్' లేక 'కంజెస్టివ్ ఫైల్యూర్' అన్నారు. తర్వాత ట్రస్టు ఏర్పరచడం, వైజ్ఞానిక విషయ రచయితలకు బహుమతులియ్యడం జరిగింది.

రామిరెడ్డి శరీరాన్ని స్వగ్రామంలో దహనం చేశారు. ఆయన మరణించ లేదు, శరీరానికి మాత్రమే మృతి. ఆయనే రాసుకున్నాడు -

"నేను మరణింపబోనోయి, మేనె మడియు;
అదియు మొదలంట నాశనమగుట లేదు,"

## దువ్వూరి రామిరెడ్డి వ్యక్తిత్వం :

దువ్వూరి రామిరెడ్డి సంపన్న కుటుంబంలో పుట్టిన వ్యక్తి. ఆది నుండి కలల్లో, ఆదర్శ లోకాల్లో బతికిన మనిషి. లౌక్యం తెలియదు. డబ్బు విలువ

తెలియదు. వెంపరలాట లేనివాడు. బహుముఖ ప్రజ్ఞాపాటవాలున్న వ్యక్తి పట్టుదల కలవాడు. తన ఆదర్శం సాకారం చేసుకోటానికి కృషి చేసినవాడు. సాధారణంగా కల్పనాలోకాలోకన మున్న కవి శాస్త్ర విషయ సంబంధి కాడు. దువ్వూరి రామిరెడ్డి వ్యక్తిత్వం అందుకు భిన్నం. ఆయన హేతు, బుద్ధివాది

ఆయన కవిగా పుట్టాడు. ఆ ప్రతిభావ్యుత్పత్తులు తనకున్నవని అవధానిని కలిసే వరకూ ఆయనకు తెలియదు. కవి కావటానికి ఆయన సిద్ధమయ్యాడు. అంతకు ముందు వున్న గ్రంథాలనన్నీ పఠించాడు, అధ్యయనం చేశాడు. తను కలం పట్టాడు ఆయన చిత్రకారుడు, విగ్రహనిర్మాణంలో ఆసక్తి వున్నవాడు. భాషలను నేర్చుకొనటం ఆయనకొక వ్యసనం. స్వయంగా చదువుకుని ఇంగ్లీషులో పండితుడైన మేటి. పారశీక భాష నేర్చుకుని సూటిగా మూలం నుండే కావ్యాలు అనువదించాడు. మద్రాసులో వున్న రోజుల్లో ఫ్రెంచిభాష నేర్చుకున్నాడు. జర్మన్ నేర్చుకున్నాడు.

ఆయన కళా పాటవం ఆయన కట్టిన ఇంటిలో ప్రతిఫలిస్తుంది. ఏమి శిల్పాలు, ఏమి చిత్రాలు. ఆ రోజుల్లో అదో తాజ్‌మహల్‌గా జనం దర్శించటానికి వచ్చే వారంటే అదేం ఆశ్చర్య పడాల్సిన విషయం కాదు.

ఆయనకు కొన్ని విశ్వాసాలున్నాయి. జ్యోతిశ్శాస్త్రం, గ్రహచారంలో ఆయనకు అపారమైన నమ్మకం. వాస్తు శాస్త్రంలో ఎంతో విశ్వాసం వున్న వ్యక్తి. ఈ విషయాల్లో ఆయన హేతువాదికి భిన్నుడు. మిగతా మానవ కల్పిత విశ్వాసాల్లో ఆయన హేతువాది. మత విశ్వాసాలను లౌకిక సత్ప్రవర్తన దృక్పథంతో సమర్థించే మాటలను వినటానికి ఇష్టపడలేదు. రామిరెడ్డి నిరీశ్వర వాది కాదు శాస్త్రానికి తోడుగా మతం వుండాలనీ, ఒకటి నిరంతరాభ్యున్నతికి, మరొకటి రుజుమార్గ నిరతికీ ఉపయుక్తాలవుతాయని ఆయన భావించాడు. కులాలున్నాయి. తన రెడ్డి కులం పై అభిమానమున్నా, మిగతా కులాల వారిని చిన్న చూపు చూడలేదు. ప్రతిభ ఎక్కడున్నా ఆయన గౌరవించేవాడు. జీవితంలో పోను పోను ఆ కులాభిమానం కూడా అంతరించి పోయింది

స్వయం కృషితోనే ఆయన అన్నీ నేర్చుకున్నాడు. రేడియో తయారు చేశాడు, కెమేరా తయారు చేశాడు. శాస్త్ర విషయాల అధ్యయనం చేశాడు. సినిమాలకు సినేరియోలేకాక, దర్శకత్వం చేశాడు, పాటలు, మాటలు రాశాడు.

ఏది చేసినా ఆయన సగం సగం హృదయంతో చేసే వ్యక్తి కాదు. తాను చేయబోయే పనికై అధ్యయనం చేసి అందుకు సిద్ధమయేవాడు.

రామిరెడ్డి కున్న స్నేహితులు చాల కొద్ది మంది. ఆనాటి సాహిత్య సాలప్రాంతంల్లో చాల మందితో పరిచయాలే తప్ప ఆయనకు వారితో గాఢమైన మిత్రత్వం కుదర లేదు. అందరు వున్నా ఆయన ఒంటరి మనిషి. నిజానికి ఆలోచనల్లో, ఊహల్లో మునిగి వుండే ఆయన ఒంటరి వాడు కాదు.

ఆయన కవిగా బతికాడు, కవిగా మరణించాడు



# 3. దువ్వూరి రామిరెడ్డి కావ్యాలు

దువ్వూరి రామిరెడ్డి కవి కావడం ఒక యాదృచ్ఛిక సంఘటన ప్రయత్నిస్తే మనిషి సాధించలేనిది లేదు అన్న తన అభిప్రాయాన్ని నిరూపించే ప్రయత్నంలో ఆయన కవి అయ్యాడు. జన్మతః ఇటువంటి కళలు లభిస్తాయని ఎంత శ్రమించినా గొప్ప కళాకారులు కాలేరనీ వాదించే కొందరు పండితుల నమ్మకాన్ని వమ్ము చేయాలన్న పట్టుదల, అది సత్యం కాదన్న తన దృఢ నిశ్చయం దువ్వూరి రామిరెడ్డి కవిత్వం రాయడానికి హేతువయింది. శ్రమించి కవిత్వాన్ని అభ్యసించాడు. 1916-17 మధ్యకాలంలో తీవ్రంగా చదివాడు, రాశాడు. 'రసిక జనానందము', 'స్వప్నాశ్లేషము', 'అహల్యానురాగము', 'కృష్ణుని రాయబారము' అనే కావ్యాలు రాశాడు. 'ఋతుసంహారం', 'పుష్పబాణ విలాసా' లను తెలుగులోకి అనువదించాడు. కొన్ని ఖండ కావ్యాలు రచించాడు ఈ రచనల్ని చూసినట్లయితే ఆ ఒక్క ఏడాదిలో దువ్వూరి రామిరెడ్డి రచనా వ్యాసంగంలో ఎంతగా నిమగ్నమై ఉన్నాడో తేలిగ్గా ఊహించుకోవచ్చు. దాదాపు వేయి పద్యాలకు పైగా ఆయన ఈ సంవత్సర కాలంలో రాశాడు.

ఈ కావ్యాలను కాని, ఖండకావ్యాలను కాని ఆయన 1935 వరకు ప్రచురించలేదు. ఇదంతా అభ్యాస కవిత్వమేననీ, ప్రచురించ దగిన మంచి కవిత్వమే నన్న ఆత్మ విశ్వాసం అప్పటికి కుదురు కోలేదనీ ఆయన భావించాడు 1927లో గాలివానకు గదిలోకి నీరు ప్రవేశించి పుస్తకాల బీరువా తడిసి ఈ కవిత్వం రాతప్రతులు కూడా తడిసి పోయి చాలా వరకు పాడైపోయాయి. తన కవిత్వ పరిణామాన్ని తెలుసుకోవడానికి ఉపయోగపడుతుందనీ, ఏ కవికయినా తన ప్రథమ కవిత్వం మీద ప్రీతి ఉంటుందనీ అందువల్ల

ప్రచురిస్తున్నాననీ 1935లో ఈ కవిత్వాన్ని ప్రచురిస్తూ దువ్వూరి రామిరెడ్డి రాశాడు. ఈ కవిత్వంలో దువ్వూరి రామిరెడ్డి కవితా పరిణామాన్నీ తరువాతి కవిత్వంతో పోలికలనూ కూడా గమనించ వచ్చు.

దువ్వూరి రామిరెడ్డి కవి కావడం యాదృచ్ఛికమే అయినా అసలు ఆయన కవి కావలసిన వాడే. కవికి, కళాకారుడికి కావలసిన హృదయ మార్దవం, ఆవేశ ప్రవృత్తి ఆయనలో సమృద్ధిగా ఉన్నాయి. ఏ కారణమూ లేక పోయినా ఆయన కళాకారుడు కావలసిందే.

దువ్వూరి రామిరెడ్డి ప్రధాన కావ్యాలలో మొదటిది 'నలజారమ్మ'.

## నలజారమ్మ (1917) :

గూడూరు నెల్లూరు మండలంలో ఒక పెద్ద ఊరు. ఈ గ్రామంలో వెంకట రెడ్డి అనే ధనిక రైతు ఉన్నాడు. అతని భార్య నలజారమ్మ. ఈమె పెరుమారెడ్డి వంశానికి చెందింది. గుణరాశి. ఈ దంపతులకు చాలా కాలం వరకు సంతానం కలగలేదు. పక్షులు కూడా తమ సంతానాన్ని చూచి ఆనందిస్తూ ఉంటే నాకు సంతానం కలగలేదే అని నలజారమ్మ దుఃఖిస్తుంది. భర్త ఓదారుస్తాడు. కొంత కాలానికి ఆమె గర్భవతి అయింది. నెలలు నిండాయి. ఒక రోజు రాత్రి పొలం కాపలాకు వెళుతున్న భర్తను కొన్ని జొన్న కంకులు తెమ్మని కోరింది నలజారమ్మ. అతను రాత్రి అంతా మేల్కొని ఉండడం చేత తెల్లవారు జామున నిద్రమత్తులో పక్కనే ఉన్న మాదిగవాని చేలో కంకులు కోస్తాడు. మాదిగ వాడు పొలం వెళ్లి తనపొలంలో జొన్న కంకులు తెగి ఉండడం చూచి ఎవరు కోశారో తెలుసుకొని నలజారమ్మ తండ్రి పెంచలరెడ్డి వద్దకు వచ్చి ఫిర్యాదు చేస్తాడు

పెంచలరెడ్డి ఇజారాదారు న్యాయం చెప్పవలసిన వాడు. సందేహంలో పడతాడు. అల్లుడని వదలివేస్తే చెడ్డపేరు వస్తుంది. చూస్తూ చూస్తూ అల్లుణ్ణి ఎలా శిక్షిస్తాడు అసలు విషయం చెప్పకుండా కుమార్తెనే ధర్మం అడుగుదామనుకున్నాడు.

నలజారమ్మకు నిద్రలో చెడ్డ కల వచ్చింది. ఆమె భయపడుతూనే ఉంది. ఇంతలో నెప్పులు వచ్చాయి. తల్లికి కబురంపింది తల్లి మంత్రసానిని

తీసుకొని వచ్చింది. నలజారమ్మ చిన్నిపాపను కన్నది. తండ్రి పురుటింటిలోకి వచ్చాడు. కూతురు పాపను కన్నందుకు సంతోషించాడు. దొంగతనానికి శిక్ష ఏమిటని కుమార్తె నడిగాడు. కొరత వేయడమే శిక్ష అని నలజారమ్మ చెప్పింది. పెంచలరెడ్డికి మతి పోయింది. 'మాదిగ వాడు... జొన్న... కంకులు కొరత' అని ఏమేమో అంటున్నాడు. ఆమెకు అనుమానం వచ్చింది. ఏమిటని ప్రశ్నించింది. అప్పుడే జొన్నకంకులతో వెంకటరెడ్డి పాపను చూడడానికి పురుటింటిలోకి ప్రవేశించాడు.

'జొన్నకంకులు ఎవరి చేలోవి ?' అని నలజారమ్మ ప్రశ్నించింది. వెంకటరెడ్డి తెల్లబోయాడు. జరిగిన పొరపాటు చెప్పాడు. 'ఎంతవారైనా పొరపాటు చేయవచ్చు, బుద్ధి పూర్వకంగా చేస్తేనే శిక్షించాలి' అన్నాడు పెంచలరెడ్డి కాని 'ఇది న్యాయం కాదు తప్పు తప్పే. చూడక తొక్కినా నిప్పుకాలక మానదు. మనమే ధర్మ మార్గం తప్పితే జనం గౌరవిస్తారా ?' అంటూ నలజారమ్మ పెంచలరెడ్డికి నిందరాకుండా నడచుకొమ్మని భర్త వెంకట రెడ్డిని కోరింది. అతనామె చెప్పినట్లుగా నడుచుకొన్నాడు.

తండ్రిని గుండం పేర్చమని అడిగింది నలజారమ్మ. అతను భక్తితో అలాగే చేశాడు నలజారమ్మ సిద్ధమై బంధువుల చెలుల ఇండ్లకు వెళ్లి కానుకలు అందుకొని తల్లిదండ్రులకు మొక్కి భగవంతుని తలచుకొని అగ్ని గుండంలో ప్రవేశించింది.

"పంచ భూతాత్మకంబైన పడతి మేను
ప్రకృతి లీనమై పూతమై పరిథవిల్లె,
మిగిలియుండెడు సత్కీర్తి పగిది సాధ్వి
యాత్మ సర్వంబు తానయై యతిశయిల్లె" అని వర్ణించాడు దువ్వూరి రామిరెడ్డి.

ఈ కావ్యం రచించే నాటికి దువ్వూరి రామిరెడ్డి వయస్సు ఇరవై రెండేళ్లు. ఆయన కవితా రచన ప్రారంభించిన రెండేళ్లలోపటిది నలజారమ్మ వృత్తాంతం నిజంగా జరిగిన కథ. గూడూరులో నలజారమ్మ గుడి ఉంది. పూజలు జరుగుతాయి. ఆ వీధికి నలజారమ్మ వీధి అని పేరు. ఈమె రామిరెడ్డి పూర్వీకురాలు ఆమె ధర్మ బద్ధత రామిరెడ్డి రాసిన ఈ కావ్యరచనకు ప్రేరణ

అయింది. దువ్వూరి రామిరెడ్డి కవిత్వ రచనను అభ్యాసం చేయడంలో అనేక కావ్యాలను అధ్యయనం చేశాడు. ఈ పూర్వ రచనల ప్రభావం నలజారమ్మ రచనలో కనిపిస్తుంది. ఇష్టదేవతాస్తుతి, కుకవి సుకవి లక్షణాలు ఈ కావ్యానికి అవతారికలయ్యాయి. పట్టణం, పట్టణంలోని వివిధ వర్గాల ప్రజల వర్ణనతో కావ్యాన్ని ప్రారంభించాడు. వర్ణనల మీద ఆసక్తి చూపించాడు. వర్ణనలలో ప్రకృతి వర్ణన అంటే రామిరెడ్డికి ఎంతో ఇష్టం. ఈ కావ్యంలో కూడా స్వాభావికమయిన వర్ణనలున్నాయి.

న్యాయం ఎవరికయినా ఒకటే. తమ వారికొక న్యాయం, పరులకొక న్యాయం ఉండకూడదు. పొరపాటున చేసినా, బుద్ధి పూర్వకంగా చేసినా తప్పు తప్పే. శిక్ష తప్పదు భార్యకు భర్త తోడిదే లోకం, ఇహమైనా, పరమైనా. ఈ రెండు అంశాలనూ తెలియజెప్పింది 'నలజారమ్మ'.

## వనకుమారి (1918) :

వనకుమారి కొండలలో సెలయేటి గట్టున గొర్రెలను మేపుతూ అలసిపోయి నిదురపోయింది ఆమెకు మెలకువ వచ్చి లేచే సమయానికి సూర్యాస్తమయం కావచ్చింది. వనకుమారి తేనెతెట్టె నుండి తేనె పిండుకొని తాగి, పండ్లు తిని వేణువు ఊదుతూ గొర్రెల మందను మరలించడానికి బయలు దేరింది. అయితే అంతకు ముందే ఒక బెబ్బులి అరుపుకు భయపడి గొర్రెలన్నీ ఆ లోయలలో చెదరి పోయాయి. ఒక్కటీ కనిపించలేదు. ఆమె ఆందోళన చెందింది. వెదకి చూచింది గొర్రెలు కనిపించలేదు. తానింతవరకూ రాకపోతే ఎదురు చూసే తండ్రి ఎంత బాధ పడుతున్నాడో ! మందలు లోయలలో ఎటో వెళ్లి పోయాయని తానెట్లా చెప్పగలదు ! తనకు ఈ ప్రకృతి మీద ఎంత ప్రేమ. గొర్రెలు లేకపోతే ఏ కారణంతో తాను ఈ ప్రదేశాలు చూడడానికి వస్తుంది ? వనకుమారి ఈ విధంగా తలపోస్తూ ఉండగానే ఆకాశంలో మబ్బులు కమ్ముకున్నాయి. చీకటి వ్యాపించింది. అక్కడక్కడా నక్షత్రాలు కనిపించసాగాయి. వనకుమారి రాత్రి అయినట్లు గ్రహించింది. ఆమె విచారం మరింత పెరిగింది.

తనకోసం వెదుకుతూ చీకట్లో దారితప్పి తండ్రి ఎంత బాధ పడుతున్నాడో అనుకుంది. ఆశ్రమానికి బయలుదేరబోయింది. అంతలో ఒక కూత

వినిపించింది ఒక మెరుపు మెరిసింది. ఆ మెరుపు కాంతిలో ఆ పర్వత సానుతలంలో మేస్తున్న గొర్రెలు కనిపించాయి. అవి మంద చెడకుండా కుక్క కాపలా కాస్తూ ఉంది. వనకుమారి సంతోషించింది ప్రేమగా కుక్క తలపై నిమిరింది. మంద సగమై పోయింది ఉదయం వచ్చి తక్కిన గొర్రెలను వెదకాలనుకుంది ఆ చీకటిలో ఆశ్రమం దారి వెదుక్కొంటూ బయలు దేరింది.

వర్షమూ, చలీ రెండూ బాధిస్తూ ఉండగా ఒక ఉరుము చప్పుడుకు ఆమె నిలబడిపోయింది. ఒక మెరుపు మెరిసింది ఆ కాంతిలో ఆమెకు ఎదుట నడుముకు కత్తి కట్టుకొని ఉన్న ఒక సుందర యువకుడు కనిపించాడు. హటాత్తుగా అతణ్ణి చూసి విస్మయంతో ఆమె మూర్ఛ పోయింది ఆమెనతడు ఒక రాతి మీద పడుకోబెట్టాడు. సపర్యలు చేశాడు. ఆమె మేలు కొన్నది 'మీ ఇల్లెక్కడ? చెప్పు చేరుస్తాన'న్నాడతను. పైగా 'రాత్రి వేళ ఈ కొండ చరియల్లో గొర్రెలను మేపుతున్నావెందుకు ?' అని ప్రశ్నించాడు.

వనకుమారి తండ్రిని తప్ప మరో పురుషుణ్ణి చూచి ఎరుగదు. తండ్రి ముసలివాడు. ఇతడు యువకుడు ఇద్దరి రూపంలో ఎంతో భేదం ఉంది. ఆమె ఆ మాటే ఆ యువకునితో అన్నది. అతను ఆశ్చర్యపోయాడు పుట్టిన దగ్గరి నుండి ఈమెకు మనుషులే తెలియదా ! లోకంలోని మంచి చెడ్డలే తెలియదా ! అనుకున్నాడు. పుట్టుక, చావు అన్నది నిరంతరం జరిగేదేననీ పుట్టి, తల్లి పెంచగా బాల్యంలో ఎటువంటి దుఃఖాలూ ఎరగక ఆటలతో కాలక్షేపం చేసి, యౌవనంలో విషయ వాంఛలతో గడిపి, వృద్ధుడై మనిషి చనిపోతాడనీ చెప్పాడు. 'ఈ మాటలన్నీ ఇంటికి వెళ్లిన తర్వాత మాట్లాడు కోవచ్చు మీ తండ్రి నీకోసం ఆందోళన చెందుతూ ఉంటాడు. పోదాం పద' అని ఆమెకు తోడుగా అతను బయలుదేరాడు.

ఆశ్రమంలో కుమార్తె రాక కోసం ఎదురుచూసి, ఎదురుచూసి తండ్రి ఆందోళన చెందాడు. పరిపరివిధాల చింతించాడు. వెదకడానికి బయలుదేరాడు. తోవలో గురివెంద తీగలు అల్లిబిల్లిగా అల్లుకొని ఉన్న చోట వాటిలో పిల్లలను గన్న శల్యమృగం (ఏదు పంది) వెలుతురు చూచి తత్తరపడి బయటకు దూకి వృద్ధరాజును కిందపడేట్లుగా పొడిచింది. కుమార్తెను తలచుకొంటూ, మరణం ఆసన్నమయిందనీ, కుమార్తెను ఒకసారి చూచి ఫాలంముద్దు పెట్టుకొనే

అవకాశమయినా లభిస్తుందా అనీ విచారిస్తూ దీనంగా మూలుగుతూ ఉన్నాడు రాజు.

మందను తోలుకొని వనకుమారితో వస్తూ ఉన్న యువకుడు ఈ మూలుగులు విన్నాడు. దగ్గరకు వెళ్లాడు. విషయం తెలుసు కొన్నాడు. రాజు తన బాధ కంటే కుమార్తె గురించే ఎక్కువ ఆలోచిస్తున్నాడు. కుమార్తె క్షేమమేనని ఆయువకుని వల్ల తెలిసికొని ఊరట పొందాడు. వృద్ధరాజును వీపు మీద మోసుకొని ఆ యువకుడు, గొర్రెలమందను తోలుకొని వనకుమారి వేగంగా నడిచి ఆశ్రమం చేరుకొన్నారు. గాయపడిన వృద్ధరాజును అరుగుపై పడుకో బెట్టాడు. వనకుమారి గొర్రెలను దొడ్డితోలడానికి వెళ్లింది. 'మీరీ విధంగా వనవాసం ఎందుకు చేస్తున్నారు' అని అడిగాడు వీరుడు. తానొక రాజుననీ పద్దెనిమిది సంవత్సరాలు ప్రజారంజకంగా పరిపాలించాననీ, తన మంత్రి మోసంచేసి పరరాజుతో కుట్రపన్ని తన ఈ దుర్దశకు కారకుడయ్యాడనీ రాజు చెప్పాడు. 'మీకీ కీడు చేసిందెవరు ? చెప్పండి నా ఖడ్గంతో శిక్షిస్తాను' అన్నాడు యువకుడు. 'ఆ రాజు పేరు ఇంద్రసేన మౌద్గల్యుడు' అని చెప్పాడు రాజు. యువకుడు ఒక్కసారిగా భూమిపై పడి మూర్ఛ పోయాడు. వనకుమారి అప్పుడే లోపలికి వచ్చింది. తండ్రి 'యువకుడు మూర్ఛపోయినట్లున్నాడు. నీళ్ల ముఖం మీద చల్లమన్నాడు' ఆమె అట్లే చేసింది. అతడు మేలుకున్నాడు. ఇంద్రసేన మౌద్గల్యుని కొడుకే ఈ యువకుడు.

రాజు మరణించాడు. వనకుమారి, యువకుడు దుఃఖించారు. యువకుడు ఆమెను ఓదార్చాడు. మెల్లమెల్లగా అంతఃపురం గురించి, లోకం గురించి ఆమెకు వివరించాడు. నగరానికి వెళ్లడానికి, తనతో జీవితం పంచుకోవడానికి ఆమెను సుముఖం చేయడానికి ప్రయత్నించాడు. ఆమె వనజీవితాన్ని వదలడానికి ఇష్టపడలేదు. అతనితో కలిసి అడవుల్లోనే స్వర్గ సుఖాలు అనుభవించాలని తలపెట్టింది. యువకుడు తాను వేటకు వచ్చి తప్పిపోయానని, తనకోసం తనవారు వెదుకుతూ ఉంటారని వారిని కలిసి పట్టణానికి వార్త పంపి తిరిగి వస్తానంటాడు. 'సాయంకాలం లోపలే తిరిగి రమ్మంటుందా'మె. అతను వెళ్లిన దగ్గరి నుండి విరహంతో వనకుమారి అతని కోసం ఎదురుచూస్తూ వెదుకుతూ ఉంటుంది. యువకుడు తన సైనికుల కోసం వెదికి వారు కనిపించక దారి తప్పి రాత్రి అంతా అడవిలో తిరిగి

పర్ణశాలకు వస్తాడు. వనకుమారి పర్ణశాలలో ఉండదు, యువకుణ్ణి వెదుకుతూ వెళ్తుంది. ఆమె పర్ణశాలలో కనిపించక పోవడంతో ఆందోళన చెందిన యువకుడు ఆమెను వెదకడానికి వెళ్లి ఒక పొదరింటిలో గడ్డి పానుపు మీద పడి ఉన్న ఆమెను చూస్తాడు. మూర్ఛిల్లిన వనకుమారి అతని స్పర్శతో తేరుకుంటుంది.

యువకుడు వనకుమారికి ఆమె నిజవృత్తాంతం తెలియజేస్తాడు రాజ్యం ఆమెదేనని చెప్తాడు. ముందు విశ్వసించక పోయినా అతడు చూపించిన ఋజువులతో ఆమె నమ్ముతుంది. అతనితో నగరానికి వస్తుంది. అతన్ని వివాహమాడి సుఖంగా ఉంటుంది.

1918లో ఆంధ్రకావ్యపరీక్షలో విజయనగర సంస్థానంలో ప్రథమ బహుమతిని పొంది, విజయరామ గజపతిచేత నాలుగు వందల రూపాయల బహుమానాన్ని తెచ్చింది రచయితకు 'వనకుమారి'. ఈ బహుమానంతో దువ్వూరి రామిరెడ్డిపేరు ఆంధ్రదేశమంతటా మారు మోగింది.

దువ్వూరి రామిరెడ్డి 1917లో రాసిన 'కర్షక విలాసం' అనే నాటకం రాతప్రతిలో చివర 'పుష్పశయ్య' అనే పేరుతో పదిపన్నెండు పద్యాలలో ఉన్న ఈ రచన 'పుష్పసమాధి'గా మారి చివరకు 'వనకుమారి' అన్న కావ్యరూపాన్ని ధరించింది. ఎనిమిది మంజరులతో 354 పద్యాల కావ్యంగా రూపొందింది. ఈ కావ్యంలోని విభాగాలకు దువ్వూరి రామిరెడ్డి 'మంజరుల'ని పేరు పెట్టాడు. కావ్యం 'వనకుమారి', అందులోని అశ్వాసాలు 'మంజరులు'. కావ్య వస్తువుకు తగినట్లుగా విభాగాలకు పేరు పెట్టాడు.

'వనకుమారి'ని 'పాస్టోరల్ పొయిట్రీ'కి ఉదాహరణంగా చెప్పవచ్చు. ఈ కావ్యనాయిక అడవిలోనే పుట్టి పెరిగింది. ఆమెకు వేరే ప్రపంచం తెలియదు. గొర్రెలను పెంచుతూ ఆమె, ఆమె తండ్రీ జీవించారు. ఆమెకు జీవనపరిణామం కూడా తెలియదు. ముగ్ధ. ఈ కథ అంతా అడవిలోనే జరిగింది. కవి ప్రకృతి నుండే ఉపమానాలన్నీ స్వీకరించాడు. వనకుమారిని 'ప్రకృతి లత పూచిన పువ్వు'గా కవి వర్ణించాడు. ఈ కావ్యంలో మరణం, ప్రేమ, సుఖదుఃఖాలు, స్వప్నం వంటి వర్ణనలున్నాయి. నిద్రను గురించి అద్భుతంగా వర్ణించాడు. ఈ వర్ణనలను ప్రత్యేక ఖండ కావ్యాలుగా గుర్తించవచ్చు కూడా.

'వనకుమారి'లో అడవిలో పుట్టిపెరిగి అడవిలో భాగంగా జీవించి, ఆ జీవితాన్నే అభిమానించిన రాజకుమార్తె చివరికి నగర ప్రవేశం చేస్తుంది. అడవి ఎంత ప్రకృతి అయినా సహజ సుందరమయినా మనిషి నాగరికతను అవలంబించక తప్పదని ఈ కథ చెప్తుంది వనకుమారి - రాజకుమారుల మధ్య దువ్వూరి రామిరెడ్డి స్వచ్ఛమయిన ప్రణయాన్ని వర్ణించాడు. దాంపత్య ప్రేమను ఆయన వాంఛించాడు. సౌందర్యంలో నీతి స్పర్శకూడా ఉండాలన్న ఆయన అభిప్రాయానికి ఈ రచన అనుగుణమయినది.

## కృషీవలుడు (1919) :

'కాలం విలువలేనిది, నిమిషం వృధా చేసినా అది తిరిగిరాదు అందువల్ల నిద్రమత్తు వదిలి మీమీ పనులు చేసికోండి' అని చెప్తున్నట్లుగా కోడికూసింది. "కాపుల ఇండ్లలోని స్త్రీలంతా తమతమ పనులలో నిమగ్నులయ్యారు. ఉదయమయింది. సూర్యకిరణాలు ప్రసరిస్తున్నాయి. పాలకోసం దూడలు అంబా అంటున్నాయి. ఇంకా నిద్రించకూడదు. హాలికా! లే. పాలు పిండు. తమ్ముడు పశువులను తోలుకెళ్తున్నాడు, దూడలను కట్టివేయి పెరుగు చిలుకుతూన్న భార్య పాటలు వినబడడం లేదా ! పిల్లవాడు ఏడుస్తున్నాడు, ఎత్తుకో. రెడ్డి యువకులంతా పొలాలకు వెళ్తున్నారు. ఊరికే ఉండ వద్దు. చెరువు నుండి కావడితో నీళ్ల తెచ్చి భార్యకు సహాయం చేయి. చద్ది కట్టుకొని పొలానికి వెళ్లు.

"సూర్యోదయంతో తూర్పుదిక్కు స్వర్గ శిల్పి తన ఇంద్రజాలశక్తితో గీసిన చిత్రపటంలాగా ఉంది. నీ కుమార్తె వాకిలి ముంగిట ముగ్గలు వేసి గుమ్మడి పూలతో గొబ్బిముద్దలను నిలిపి కుంకుమ చల్లి అలంకరించింది. వాటిని తొక్కకుండా వెళ్లు.

"పొలాలకు వెళ్లే పల్లె స్త్రీలు నిన్ను చూసి ఏలపాటలు పాడుతూ ఉంటారు, నీవు కూడా సమాధానంగా పాడు. కపటం లేని ఇటువంటి చర్యలు ఆనందాన్ని కలిగిస్తాయి. ఊరికే అటూ ఇటూ తిరిగితే ఏం లాభం? పొలానికి వెళ్లి తండ్రిని భోజనానికి ఇంటికి పంపు. మాలకన్య మునుము కొస్తూ ఉంది, ఇంటికి వెళ్లేటప్పుడు ఆమెకు సందెడు ఓదె ఇవ్వలేవా ? పరిగ ఏరుకొనే బీదలను వెళ్లగొట్టకు.

"కాపు పడతీ ! కుటుంబ కార్యాలలో నీ కాలమంతా గడుపుతావు అలంకరించుకోవు. నీకు తీరికే లేదు కొంచెం తీరిక చేసుకో. స్త్రీకి సతీత్వమూ కావాలి, సౌందర్యమూ కావాలి. ఆకలిగొన్న బాటసారులకు చేతికందిన కంకులను దానం చేస్తావు, నీ బీదరికాన్ని గమనించవు బాధలన్నీ మరిచిపోయి కోకిలతో గొంతు కలిపి ఒక కొత్త పాట పాడు

"ఓ కర్షకా ! బిచ్చగత్తెకు లభించే సుఖంలో సగంకూడా నీ భార్యకు లభించడం లేదు పగలు నిద్రపోతావేమి? కాపులంతా దున్నడానికి పోతున్నారు. నీకు అదను తెలియదా ? శ్రమ లేక ఫలం లభించద్దు కష్టపడు. ఎండ ఎక్కువయింది చెట్టుకింద పడుకొని చల్లని నీడలో తాపం పోగొట్టుకో. భార్య అన్నం కుండతో వస్తూ ఉంది స్నానం చేసి మజ్జిగన్నం తిను

"ఓ తన్వీ ! ఎండకు కాళ్లు కాలాయని చికాకు పడవద్దు. ఇద్దరూ కష్టపడితే కాని సంసారం సాగదు. ఇంటి వద్ద పిల్లవాడు లేచి పాలకు ఏడుస్తాడేమో వెళ్లు తోవలో చెరువులో పద్మాలు కోసుకొని వెళ్లు. పిల్లవాడు వాటితో ఆడుకుంటాడు. డబ్బున్న ఆడపిల్లలు ఖరీదయిన చీరలు నగలు అలంకరించుకుంటారు. వాటికోసం ఆసపడకు. కృత్రిమాలైన నగల కంటే సరసమైన ప్రేమయే అమూల్య రత్నం. నీ ముఖంలో విరిసే చిరునవ్వే భర్తకు ప్రేమ కలిగిస్తుంది. సంసార సాగరంలో పడవపై భర్తను ఒడ్డుకు చేరుస్తావు.

"సాయం కాలమయింది ఎండ తగ్గింది మళ్లీ పని ఆరంభించు. నీకు నియతమయిన వృత్తి వ్యవసాయం నీ పూర్వులంతా నిర్వహించారు. ఓ కర్షకా ! బ్రహ్మ నిన్నీ విధంగా నిత్యం శ్రమపడమని రాశాడని బాధపడవద్దు పుట్టిన నాటి నుండి కష్టించి కుటుంబాన్ని పోషిస్తున్నావు. శ్రమ చేయకుండా మాటలు చెప్పేవారు నీకు సాటికారు. ఎంత ధనమున్నా, ప్రపంచమంతా తనదైనా తృప్తి అనేది మానవునికి ఉండదు. రాజు పాలన దండం కూడా నీ నాగలి కంటే తక్కువదే. నిత్యావసరాలకు మించి నీకోర్కెలు ఆకాశానికెగరవు. ఎప్పుడూ పైరు పచ్చలగురించే ఆలోచిస్తావు. తెల్లవారిన దగ్గర నుండి చీకటి పడే వరకూ శ్రమిస్తావే కాని ఇతరుల సంపదను చూసి ఈర్ష్య పొందవు పల్లే నీ ప్రపంచం. భార్యే సుందరి. బంగారు పంటపొలాలే నీకు భాగ్య నిధులు నిత్య పరిశ్రమే నీ మతం. తిన్నా తినకపోయినా ఇతరుల సొత్తుకు ఆసపడవు నీ యింటికి వచ్చిన అతిథి తినక తాగక పోయిన రోజులేదు.

"లోకంలోని భాగ్యానికంతా మూలం నీవు ఫలం అనుభవించే వారు ఇతరులు నీకు తిండికీ, బట్టకూ ఎప్పుడూ కొరతే పండ్లు తినేవారు వాటి రుచిని మెచ్చుకుంటారేకాని చెట్టును గురించి ఆలోచించరు. అట్లాగే ధనవంతులు భోగాలు అనుభవిస్తారేకాని నిన్ను కన్నెత్తి చూడరు వారిని తలచక ఏదిఏమైనా నీ శ్రమార్జితమే నీవు తింటావు. అయినా కాలం ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు. నీ కష్టాలు తీరవచ్చు. ధైర్యం విడువక శ్రమించు.

"పండిన పొలం అందాన్ని చూడు ఆద్యంతాలు లేని నీ శరీర కష్టాలకు ప్రతిఫలమైన పంటను చూచి కవివి కాకపోయినా, మాటకారితనం లేకపోయినా ఒక్కసారి నమస్కరించి వర్ణించు.

"ఆకాశంలో మేఘాలు లేవు, ఎండకు పైరు వాడిపోతున్నదని దూషించకు. పంటలను ఉద్ధరించే శక్తి సూర్యకిరణాలకు ఉంది అవి సముద్రం నుండి నీటిని ఆవిరి రూపంలో ఆకాశానికి తీసుకొని పోతాయి. అక్కడ వాటిని మేఘాలుగా మారుస్తాయి ఆ మేఘాలు కొంగల బారులతో ఆకాశంలో వస్తున్నాయి చూడు బావి నుండి నీళ్లు తేవడానికి వెళ్తున్న స్త్రీలు కర్షకులపాలిటి దైవమే మేఘ రూపంలో వస్తున్నాడని సరసోక్తులాడతారు అదుగో ఇంద్రధనుస్సు విరిసింది ఆకాశంలో తూనీగలు మధురమైన ధ్వనులు చేస్తున్నాయి. కప్పలు బెకబెకలాడుతున్నాయి. తాగడానికి నీరైనా దొరకని కాలంలో నిమిషంలో దొరువులు నిండి పోయాయి. తల్లులు పట్టుకున్నా ఆగక పిల్లలు వానలో వ్యవసాయపుటాటలు ఆడి అలసి ఆకలై ఇళ్లకు వెళ్తారు.

"బీళ్ల నుండి పశువులు దొడ్డికి వచ్చాయి. బురదలేని మెరక నేలలో పసికొయ్యలు నాటించి వాటిని కట్టివేసి గడ్డీ, చొప్పా వేయించు. ఆవులను కట్టి వేయడంలో తమ్మునికి సాయం చేయి. తడిసిన పుల్లలతో వంట చేయలేని భార్యకు ఎండు కట్టెలందించు. భార్య కష్టాలను పట్టించుకోవేం? ఉన్నంతలో భర్తకూ పిల్లలకూ పెట్టి మిగిలినదే కొంచెం తాను తిని, బిచ్చగాళ్లకు పెడుతుంది. ఆమె కష్టాలు ఆమెకు తప్ప ఎవరికి తెలుస్తాయి !

"అప్పులన్నీ తీర్చివేయి. అప్పుచేసి తినే పప్పుకూటికంటే, అప్పులేని గంజిమేలు లోకంలో ఎటువంటి విప్లవాలయినా రానీ, వ్యవసాయం మానవద్దు. గ్రామాలు చెడిపోయాయి. నేటి నాగరికత నీ మేలు కోరదు.

అప్పుచేసి బ్రతక ఘంటుంది అర్హత ఉన్నవాడే జీవించ గలుగుతాడు శౌర్యం, విద్య, బుద్ధి, సత్యం, ఆత్మవిశ్వాసం అనే ఆయుధాలను విడిచిపెట్ట వద్దు ఈ నీతి వాక్యాలు చాలులే. పండిన చేలు బంగారు ఇసుక ఖనులు కనిపిస్తున్నాయి, చూడు ఆకాశంలో బారులు తీరి వెళుతూ ఉన్న నీటి కోళ్లను కాలువనీటికి వెళుతున్న కన్యకలు విస్మయంగా చూస్తున్నారు. గోపకుమారులు, కాపు పిల్లలు వేణువులూదుతూ పశువుల మందలను ఇళ్లకు తోలుకొని వచ్చారు. బడి వదలగా పిల్లలు ఉప్పన పట్టెలాడుతున్నారు కర్షకులు ఇంటి దారి పట్టారు బ్రాహ్మణులు సంధ్య వారుస్తున్నారు భిక్షుకులు భిక్షకు బయలు దేరారు. పక్షులు గూళ్లు చేరాయి. అక్కడక్కడా నక్షత్రాలు వెలియగా చీకటి పడింది.

"భర్త ఇంకా రాలేదేమని భార్య ఎదురు చూస్తూ ఉంది ఇక రచ్చలోని వ్యవహారాలు చాలు. పిల్లలు 'నాన్న నాన్న' అని ఏడుస్తున్నారు. భార్య స్నానానికి నీళ్లు సిద్ధం చేసింది ఇక వెళ్లు స్నానం చేసి వెన్నెలలో భార్యా పిల్లలతో భోజనం చేసి పొడుపు కతలు, సమస్యలు, పూర్వ గాధలు చెప్పి వారిని సంతోష పెట్టు. శ్రమ, విషాదం, ఆశలు, చింతలు అన్నీకూడా నిద్ర అనే సముద్రంలో మునిగిపోగా హాయిగా తెల్లవారే వరకు నిద్రించు"

కృషీవలుల జీవితాన్ని వస్తువుగా స్వీకరించి రచించిన తెలుగు కావ్యాలలో 'కృషీవలుడు' మొదటిది. కవి రైతు. వస్తువు రైతు జీవితం. కవికి ఇష్టమైనది అభిమాన పాత్రమైనది. ఉదయం లేచినది మొదలు రాత్రి పడకచేరేవరకు కాపులు వారి ఇల్లాండ్ర దైనందిన కార్యక్రమాన్ని దువ్వూరి రామిరెడ్డి ఈ కావ్యంలో వర్ణించాడు. కాపుల జీవనంతోపాటు ప్రకృతి వర్ణనలను కూర్చాడు. ఈ రెండింటికీ అద్భుతమయిన సమన్వయం రామిరెడ్డి విశిష్టత.

ఈ కావ్యంలో కథ లేదు. కాపు జీవితమే, దినచర్యే ఇతి వృత్తం. ఈ దినచర్యకు నేపథ్యంగా ప్రకృతి వర్ణనలు. కవి, చిత్రకారుడు ఒక్కచోట మూర్తీభవించినట్లుగా రచన సాగింది.

వ్యవసాయ దారుల జీవితంలోని కష్టాలను ఒకవైపు వర్ణిస్తూనే మరోవైపు వారు వ్యవసాయం విడిచి పెట్టరాదని ఉద్బోధిస్తాడు కవి. సర్వ సంపదలకూ మూలం కృషి అంటాడు. కాపు స్త్రీల అవిరామ శ్రమను దువ్వూరి రామిరెడ్డి

సానుభూతితో వర్ణించాడు. కేవలం అవిరామంగా పనిచేయుడంకాదు, కొంత తీరిక కలిగించుకొని అలంకరించుకొమ్మంటాడు

"స్వాంతమున నీకు రామణీయక పిపాస
యంతరించె నటంచు నేనన‌ను కాంత
కాని, యెడలేని సంసార కష్టములకు
స్త్రీ ప్రకృతి బలిపెట్టుట చెల్లదమ్మ".

కర్షకుని ప్రపంచాన్ని కవి ఒక చిన్న పద్యంలో వర్ణించాడు.

"పల్లె యెల్లయె సర్వప్రపంచ సీమ
ప్రియ యొకర్తయె రమణీయ విగ్రహంబు
బంగరుం బంట పొలములే భాగ్య నిధులు
అనుదిన పరిశ్రమమె మతమగును నీకు".

కృషీవలుని జీవితం ఎప్పటికీ నిరాశాపూరితంగానే ఉండదనీ, ఉచ్ఛదశ మళ్లీ వస్తుందనీ ఆశించాడు కవి. కష్టసుఖాలనేవి ఎప్పుడూ ఒక్కలాగా ఉండవు. కాలపరిణామంలో ఎన్నో మార్పులు వస్తాయి. భవిష్యత్తు నెవరు చెప్పగలరు అంటాడు. రామిరెడ్డి గారి ప్రకృతి వర్ణనలు సహజ సుందరాలు. పల్లె జీవితంలోని అతిసామాన్య దృశ్యాలను కూడా కవి రమణీయంగా మన కళ్లకు సాక్షాత్కరింప జేశాడు.

"స్వారి చేయు నిచ్చ భావంబు కలిగింప
బఱ్ఱెనెక్కి వచ్చు బాలుడొకడు
వాని క్రింద ద్రోయువరకు బఱ్ఱెను బాది
సంతసింతురితర సఖులు నగుచు"

ఇది ప్రతి పల్లెలోనూ దర్శనమిచ్చే దృశ్యమే.

వర్షవర్ణనలో దువ్వూరి రామిరెడ్డికి కొండలిలా కనిపించాయి.

"తటములకు నాకసమున కంతరము లేక
నీల నీరద మాలలు వ్రేలుచుంట
నేలపై మిన్ను పడనీక నిలువు చుండు
స్తంభములనంగ గిరులు దృశ్యంబులయ్యె"

'కృషీవలుడు' అధునిక తెలుగు సాహిత్యంలో ఒక కొత్త పోకడ. అందుకే తన యీ కావ్యరచనవల్ల తనను కర్షక పక్షపాతి అంటారేమోనని, దీన్ని ఆదరించరేమోననీ కూడా కవి శంకించాడు. అయినా తన కవిత్వం బాహ్యానియమాలను దాటి స్వాతంత్ర్య సీమలలో విహరిస్తున్నదనీ, ఎవరు ఏమనుకున్నా లాభం లేదనీ కాలమనంత మయినదనీ, భావాలు క్రమంగా మారతాయనీ జవాబు చెప్పుకున్నాడు. హృదయంలోని భావాలను వ్యక్తం చేయడానికి జంకు ఎందుకనుకున్నాడు 'కాలోహ్యాయం నిరవధిః, విపులాచ పృథ్వీ' అన్న భవభూతి పలుకులను మననం చేసుకున్నాడు.

పాశ్చాత్య భాషలలో గ్రామాలలోని వివిధ వృత్తుల వారి, ముఖ్యంగా పశుపాలకుల అకృత్రిమ జీవిత స్వభావాదులను వర్ణించే కావ్యాలను 'పాస్టొరల్' కావ్యాలంటారు. వ్యవసాయ వృత్తి ప్రధానమయిన ఈ కావ్యం కూడా ఆ తరగతికి చెందిందే. కృషీవలుణ్ణీ, కాపుపడతినీ సంబోధిస్తూ వారి జీవితాన్ని నిసర్గ సుందరంగా వర్ణించిన ఈ కావ్యం తెలుగులో పాస్టొరల్ కవిత్వానికి తలమానికం.

## జలదాంగన (1920) :

ఒక సాయంకాలం కవి ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ, పంటపొలాలలో చల్లగాలిలో విహరిస్తూ ఆనందిస్తున్నాడు. చీకటి పడింది. నక్షత్రాలు వెలిగాయి. చంద్రుడుదయించాడు. పండు వెన్నెల నలుదిక్కులా విస్తరించింది. గాలి తాకిడికి ఊగుతూ సన్నని వస్త్రంలాగా చంద్రుని కప్పుతూ, వీడిపోతూ అనేక విధాల మనోహరాకృతులతో ఒక మబ్బు కనిపించింది. చంద్రునితో విహరించడానికి వచ్చిన రోహిణీ దేవియా అన్నట్లుగా ఆ మేఘం ఒక సుందరి రూపాన్ని ధరించింది. కవి కూడా ఆశ్చర్యపోయి కన్ను వాల్చక ఆమె అందాన్ని చూస్తూ ఊహలో తాను కూడా ఆ మేఘ సారూప్యాన్ని పొంది ఆమె వివరాలను తెలుసుకోగోరాడు.

'నా చరిత్రవిని దైవసృష్టికి ఆశ్చర్యం పొందాలనుకుంటే అట్లాగే చెప్తా' నన్నది ఆమె 'అయినా కవికి తెలియంది ఏముంది ? అడిగావు కనుక చెప్తాను' అన్నది. 'సూర్యుడు, భూమి, చంద్రుడు, నక్షత్రాలు, దిక్కులు, కులపర్వతాలు వీటన్నిటి కంటే ముందే బ్రహ్మ నా పూర్వరూపమయిన

సముద్రాన్ని సృష్టించాడు. మాయ నన్నూ, చీకటినీ కవి అదృశ్యమయింది. ఎన్నో కాంతి గోళాలు పుట్టి మమ్మల్ని విడదీశాయి. అప్పుడు పృథ్వి అవే బాలిక నాకు తోడుగా నిలిచి నాయింటిలోనే ఉండి పోయింది. కాలుడు అనే సుందర యువకుడు మా ఇద్దరినీ చూచి ప్రేమించి వివాహమాడాడు కొంత కాలం సుఖంగానే ఉన్నాము. నాకు సంతానం కలిగింది. పృథ్వికి ఈర్ష్య పుట్టింది నా ఇంటిని కొంత ఆక్రమించింది. కొంత కాలానికి ఆమెకూ సంతానం కలిగింది. నా పిల్లలకూ, పృథ్వి పిల్లలకూ కొట్లాట లేర్పడ్డాయి. పృథ్వి భర్తను లొంగదీసుకొని తన పిల్లలకు 'బుద్ధి' నిప్పించింది. దానితో వాళ్లు గర్వించి నా సంతానాన్ని తినడం ప్రారంభించారు. నా సంపదలను దోచుకోవడం ప్రారంభించారు. ఓడలు తయారు చేశారు, నా హృదయాన్ని చీల్చి త్రోవలు చేసికొన్నారు. భోగాలు ఎక్కువయి వాటి కోసం ఒకరితో ఒకరు తలపడి రక్తపు టేరులు పారించారు. నీవు అడిగావు కాబట్టి కాని ఈ గాథలు తవ్వుకోవలసిన అవసరం నాకేముంది'.

'మరి ఓ జలదాంగనా ! నీకీ అందమయిన రూపం ఎట్లా వచ్చిందో, పూర్వపు సముద్రరూపం ఇటు వంటి అపూర్వ సౌందర్యంగా ఎట్లా మారిందో తెల్పవా' అని అడిగాడు కవి.

జలదాంగన ఇలా చెప్పింది. 'ఒక నాడు నేను నా భర్త అన్యోన్యంగా ఉన్న సమయంలో ఆయన నా పట్ల తన ప్రవర్తనకు క్షమాపణ కోరుకున్నాడు గతాన్ని గురించి ఆలోచించ వద్దన్నాడు. ప్రణయ వ్యామోహంతో కాలుడనే పేరుతో నిన్ను చేరుకున్నాను కాని వాస్తవానికి నేను సూర్యుణ్ణి పచ్చని గుర్రాల రథం మీద ఆకాశ విహారం చేస్తూ ఉంటాను నా నిజరూపం చూడు అని సహస్ర కిరణాలతో ప్రత్యక్షమయ్యాడు. అతని కాంతిని చూడలేక పోయాను అప్పుడు తన నిజరూపాన్ని కుదించాడు నీవు నా మనస్సును దోచుకున్నావు నిన్ను విడిచి ఉండలేను. నా దగ్గరే కాపురముండమన్నాడు. ఎంతో సంతోషించాను కాని ఆకాశంలో ఉండే సూర్యుడెక్కడ ? క్రింద ఉండే నేనెక్కడ ? మనకు సమాగమం ఎట్లా ? ఇంతకు ముందులాగే ఉందాం అన్నాను.

'నిన్ను గగన సామ్రాజ్యానికి రాణిని చేస్తాన'ని వేయి చేతులతో కవుగలించుకున్నాడు. బాష్పమయనై అతని కౌగిలిలో లీనమయ్యాను. ఈ

రూపం వచ్చింది. గాలితో కొండ చరియలలో పొదరిండ్లలో విహరిస్తున్నాను. కొన్నాళ్లు సుఖంగానే ఉన్నాను. తరువాత సూర్యుని మోసం తెలిసింది నన్ను నమ్మించి ఆకాశానికి తెచ్చాడు. పూర్వపు శరీరం పోగొట్టాడు. పిల్లలను విడిచి వచ్చాను. దానికి ఫలమో అన్నట్లు సూర్యుడు సరోజినిని చేపట్టాడు. నాకెంతో బాధకలిగింది మరో వార్తకూడా తెలిసింది. ఛాయ అనే మరొ స్త్రీని కూడా ఇట్లాగే చేశాడట. నానాటికీ అతని అకృత్యాలు ఎక్కువయ్యాయి. ఆత్మహత్య చేసుకుందామని హిమాలయాలకు ప్రయాణమయ్యాను. హిమాలయాన్ని చూడగానే నాలోని అసూయ అణగిపోయింది. తిరిగి, చూద్దామనుకున్నాను'.

'నీ అదృష్టమే అదృష్టం. నీవు వర్ణిస్తూంటేనే ఎంతో ఆనందంగా ఉంది. నీలాగా ఎక్కడికయినా వెళ్లగల రూపం ఉంటే హిమాలయాలను చూడడానికి ఎగిరి గంతెయ్యనా' అన్నాడు కవి

హిమాలయాలలో తాను చూసిన వింతలను వర్ణించింది జలదాంగన ఆమెకు ఒక కొలను కనిపించింది. అందులో మునగాలనిపించి మునిగింది. మంచురాయిగా మారిపోయింది. కళ్లు తెరచి చూచేటప్పటికి చిరునవ్వు నవ్వుతూ సూర్యుడు పక్కన కనిపించాడు. కోపం వచ్చింది. నిర్ఝర గర్భంలో లీనమై పోయింది. పృథ్వి ఆమె సరసన చేరి ఓదార్పు కలిగించింది. కొన్నాళ్లు తన ఇంట్లో ఉంచుకుంది పైరు చేలలో విహరించి, కాల్వలలో చేరి, కొలనులలోని కలువలు పుప్పొడులీయగా స్వీకరించి నదులలో కలిసి స్వస్థానానికి వెళ్లింది.

కొన్నాళ్ల తరువాత మళ్లీ సూర్యుడు చెంతకు వచ్చాడు. అతని కౌగిలింతలో మళ్లీ బాష్పరూప అయి ఆకాశంలో మబ్బుగా మారిపోయి సంచరింప జొచ్చింది. చల్లని గాలి వీయగా మేలిముసుగు సవరించుకొంటూ సాగిపోయింది. కవి కనుల కందినంతవరకూ జలదాంగనను చూచి, కన్నుల బాష్పములు కారుతుండగా ఇంటికి వెళ్లి నిద్రపోయాడు. కలలో చల్లనివెన్నెల, హిమాలయం, జలదాంగన, మంచుతుప్పలు, సెలయేళ్లు, అంచబారులు, శివతాండవం ఏమేమో చూస్తూ నిద్రమేలుకొన్నాడు.

'జలదాంగన' ను తెలుగులో మొదటి ఆధునిక వైజ్ఞానిక కావ్యం అని చెప్పవచ్చును. ఇది నీటి కథ. 'మబ్బు'కు కవి స్త్రీ రూపం ఇచ్చాడు. దీని

పూర్వ రూపం సముద్రం సముద్రంలోని నీరు సూర్యుని వేడికి ఆవిరై మేఘాలుగా రూపొందుతుంది ఇదే సూర్యుని కౌగిలిలో సముద్రం ఆవిరయి ఆకాశంలోకి వెళ్లడం. ఆ మబ్బులు ఆకాశంలోని చల్లదనానికి మళ్లీ భూమిపైకి వర్షరూపంలో నీరుగా వస్తాయి. ఆ నీరు కాల్వలై సెలయేళ్లయి నదులయి పారి మళ్లీ సముద్రంలో కలుస్తుంది. మళ్లీ సూర్యుని వేడికి ఆవిరై మేఘమవుతుంది. ఇది క్రమం. నిరంతరం జరుగుతూ ఉండేదే. సముద్రం, భూమి, సూర్యుడు, పద్మం, ఛాయ వీటన్నిటికీ కవి మానవరూపం ఇచ్చాడు మేఘం, భూమి, పద్మం, ఛాయ స్త్రీలు, సూర్యుడు పురుషుడు ప్రకృతిలోని అంశాలకు వ్యక్తిత్వం కల్పించడం ద్వారా కవి ఒక మనోహరమయిన కథను చెప్పాడు ఆ కథారూపంలో ప్రకృతి తత్వాన్ని వివరించాడు

మానవులు సముద్రంలోని ప్రకృతి సంపదను కొల్లగొట్టడమే కాక తమలో తాము భోగభాగ్యాల కోసం పోట్లాడుకోవడాన్ని కవి నిరసించాడు దీనికి కారణాన్ని కూడా గుర్తించాడు.

"ప్రకృతి శాస్త్రంబు విద్యయు భవ్యకళలు
భావసంపూర్ణతకు దోడు పడుట లేక
ప్రజల నాశన మందె పర్యాప్త మగుట
సెలవునకు మించి యార్జించువలనగాదె !"

కవికి ఈ కావ్యంలో వర్ణనలకు మంచి అవకాశం కలిగింది సాయం కాలాన్ని, మేఘాన్ని, హిమవత్పర్వతాన్ని కవి వర్ణించాడు. వర్ణనలలో కవి చక్కని జాతీయాలు ప్రయోగించాడు.

"అంతకంతకు పతి యకృత్యములు హెచ్చ
చల్లవైచిన పాలునా జవికి మనము
విఱుగ నాత్మహత్యయు కొంత ప్రియమటంచు
నంత హిమగిరి కేగ ప్రయాణమైతి"

'చల్ల వేస్తే పాలు విరిగినట్లు' అన్న ఉపమానం గమనించ దగింది కావ్య వస్తువు ఏదైనప్పటికీ కవి పల్లె జీవితాన్ని వర్ణించకుండా ఉండడు.

## యుఖవకస్వప్నము (1922-23) :

సాయంకాలమయింది. సూర్యుడు అస్తమించాడు తారకలు తోచాయి. సముద్రంలో నుండి వెడలినట్లుగా చంద్రుడు ఆకాశంలోకి వచ్చాడు. సముద్రంలో దూరంగా ఒక నక్షత్రం లాగా ఏదో కనిపించింది. అది తరువాత తెల్లని పక్షిగా గోచరించింది తరువాత మేఘంలా అనిపించింది మరి కొంత దగ్గరికి రాగా ఒక ఓడ అని తెలిసింది. ఆ ఓడలో ఒక సింహపీఠి మీద ఒక స్త్రీ కూర్చుని వీణ మీటుతూ ఉంది. ఆమె సంగీతం ప్రకృతినంతా పరవశింప జేసింది. కవిని ఆమె దగ్గరగా లాగుకొంది. ఆమెను చూడగానే కవిలో భక్తిభావం అంకురించింది. వినయంగా నమస్కరించి పక్కన నిలుచున్నాడు ఆమె తలమీద మణిమయ కిరీటం ఉంది. ఆమె పక్కన ఒక వికృతమయిన అస్థిపంజరం ఉంది. ఆ శల్యమూర్తి నాట్యంచేస్తూ తన చేతిలోని దండాన్ని ఎటు చూపిస్తే అటు నగరాలు బూడిదయి పోతున్నాయి. బూడిదలో నుండి అంకురాలు చిగురిస్తున్నాయి. ఆమె పాదాలవద్ద విరిగిపోయిన రాజదండాలు, సింహాసనాలు, కిరీటాలు పడి ఉన్నాయి. ఆమె కుమారుని తల్లి పిల్చినట్లుగా కవిని పిల్చి ఇలా అన్నది

'ఇంత రాత్రివేళ ఇక్కడ ఒంటరిగా సముద్రంలోని అలలు చూస్తూ ఉన్నావెందుకు ? నీలో ఎటువంటి మనోహర భావాలు కలిగాయి ఏకాంత విహారం కోసం వచ్చావా? నక్షత్రాలు లెక్క బెట్టాలనుకుంటున్నావా ? సముద్రం మీద ప్రయాణించాలనుకుంటున్నావా ? ఆకాశంలో ప్రయాణించడానికి మేఘం కావాలను కుంటున్నావా ? నీ ముఖం ఇట్లా వాడిపోయి ఉందేమిటి ?'

మనస్సులోని దుఃఖాన్ని కవి నిర్భయంగా ఆమెకు వెల్లడించాడు.

'కాలవాహినిని తరించడానికి చుక్కాని లేని నావమీద తిరుగుతున్నాను లోకచరిత్రను చూసి క్రోధం వస్తూ ఉంది. దుర్జన పాపాగ్ని శిఖలు నలుదిక్కులనూ కప్పివేశాయి బలవంతులు ఏమిచేస్తే అదే ధర్మమయి పోయింది. ఒక వైపు పాలకులు, మరోవైపు దురాచారాలు మానవ స్వభావమే మరపుకు వచ్చేట్లు చేస్తున్నాయి. భూమి అంతా ముళ్లపొదలతో నిండి పోయింది. పూలమొక్కలు నశించాయి ఈ ముళ్ల తీగలను దుంప మొదలంట దున్నక పోయినట్లయితే మాతృపూజకు పూలు లభించవు'

ఆమె ముఖంలో చిరునవ్వు వెలసింది. వీణా తంత్రులను చక్కదిద్దింది. 'నీ మనస్సులో వల్లకీ రచిత మంజులగానం నాటుకున్నది. ఈ పదాలను నా వీణతో మిళితం చేయి' అన్నది

అప్పుడతను 'నీవెవరవు, దేవతా స్త్రీవా ? లోకమాతవా ? సరస్వతివా? ఎక్కడి నుండి వచ్చావు ? ఎవరవో కాని పసలేని ఎముకలలో కూడా జీవకళను పుట్టిస్తున్నావు' అన్నాడు

ఆమె 'ప్రకృతి గర్భంలో ఎంత శక్తి ఉందో నీకు తెలియదు. ఈ భూమినంతా పొడి చేసి వేయడానికి ఒక్క అణువులోని శక్తి చాలు. ధర్మాన్ని అణచి దుర్జనత్వం పెరిగినప్పుడు జనాన్ని మేల్కొల్పడానికి వీణ మీటుతాను. నాకు తోడుగా ఉండి నా ఆజ్ఞలకు అనుగుణంగా నడుచుకుంటాడు ఈ శల్యమూర్తి. అతనెక్కడ కాలుపెడితే అక్కడ జీవం ఉప్పొంగుతుంది కాలచక్రాన్ని అనుసరించి లోకమంతా తిరుగుతాము. ప్రకృతిని లోబరచుకున్నానని మనిషి గర్విస్తున్నాడు వాడి గర్వాన్ని చూసి ప్రకృతి నవ్వుతోంది. ఇక ఈ మాటలు చాలు. అర్ధరాత్రి అవుతోంది వస్తావా ? ఈ నావలో రేవు చేరడానికి వెళ్దాం మనం వెళ్లే మార్గంలో ఒక అందమైన దీవి వస్తుంది. అక్కడ ఒక ఉన్నతమైన మేడ ఉంటుంది. దానికి భయంకరమయిన వేట కుక్కలు కాపలా కాస్తూ ఉంటాయి. నేలమీద నడిచే చీమ అయినా, ఆకాశంలో ఎగిరే పక్షి అయినా వాటి కంటబడవలసిందే వాటిని మోసం చేసి మనం లోపలకు వెళ్లాలి' అన్నది

'తల్లీ ! ఇంత కష్టం ఎందుకు. మనకు దీని వల్ల ఏం లాభం గాలి తూర్పు దిశకు వీస్తున్నది. తెరచాప లెత్తుతాను. అటే వెళదాం' అన్నాడు కవి.

'కాదు అక్కడ నాకిష్టమైన బాల్యసఖి ఉంది. ఆమె ఎవరో కాదు నీ తల్లియే' అన్నదామె

అతడు దేవి పాదాలకు నమస్కరించాడు, 'నాకీ రహస్యం తెలియదు తల్లి చిన్నతనాననే చనిపోయిందన్నారు. మాతృప్రేమ తెలియదు. ఆమె ఆ దీవి కెట్లా వెళ్లింది ? ఆ మేడ ఎవరు కట్టారు ? ఆమె నన్ను ఒంటరిగా వదలి ఎందుకు వెళ్లింది ? కుక్కలు ఎందుకు కాపలా కాస్తున్నాయి ? ఆమె

స్వేచ్ఛగా ఉందా ? నిర్బంధంలో ఉందా ? నా తల్లి ముఖాన్ని ఒకసారి చూపించు ఎంతటి త్యాగాన్నైనా చేస్తాను' అన్నాడు.

'ఊరికే తల్లిని చూడాలన్న ఆత్రంతో ఈ ప్రతిజ్ఞ చేశావా?' ధర్మనియతిని గౌరవించడానికి చేశావా ? ఆమెను చూడకుండా ఈ దీక్షను వీడనని నా పాదాల మీద ప్రమాణం చేయమన్న'దామె. అతడు వెంటనే ప్రతిన చేశాడు. ఆమె 'కుమారా రమ్మ'ని కౌగిలించుకుంది. గాలి అనుకూలంగా వీచింది. నావ దీవిని చేరుకుంది. పూర్వం స్వర్గంలా ఉండిన ఆ దీవి ఇప్పుడు పాడుపడినట్లున్నది ఆ దేవి, కవి ఇద్దరూ పారాకుక్కల్ని తప్పించుకొని మేడలో అడుగుపెట్టారు అక్కడ ఒక స్త్రీ మూర్ఛలో మునిగి ఉంది. ఆమెను చూచి వాళ్ళు దుఃఖించారు ఆమె దివ్య గానంతో ఆ స్త్రీ మేల్కొన్నది. కృశించి పోయి ఉన్న ఆ తల్లి మేనును దేవి స్పృశించింది. తల్లి ఆ స్పర్శతో పునర్జీవనం పొంది ఈ విధంగా అన్నది.

'నేను అడవిలోని కొలను తీరాన విహరిస్తూ ఉండగా ఒక కోతి వచ్చి మాది కిష్కింధ. ఇతర మృగాలు ఈ వనాన్ని పాడుచేయకుండా వేం కాపాడతాం అని అనుమతి తీసుకొని మూకను తీసుకువచ్చి వనాన్నంతా కొల్ల గొట్టింది నేనిక వాటిని రావద్దన్నాను. అవి క్షమాపణ వేడుకున్నాయి మా కృతజ్ఞత తెలుపుకుంటాము. నిన్ను రాణిని చేస్తాము అని ఈ భవనంలో పెట్టి బంగారు సింహాసనం మీద కూర్చుండ బెట్టి నన్నలంకరించాయి ఒక ముసలి కోతి నా తలపై రత్నకిరీటాన్ని పెట్టింది, అది హిమాలయ శిఖరంలాగా తలపై బరువయింది. మరొకకోతి చేతులకు కంకణాలు పెట్టింది. కదల్చడం కూడ కష్టమయి అవి సంకెళ్లయినాయి మరో కోతి కాలికి అందె తగిలించింది, కదల లేక ఉరులలో తగులుకున్న లేడి వలె బాధ పడ్డాను. ఈ విధంగా కపటంతో నన్ను కట్టివేసి సంతోషంగా స్తన్యం గ్రోలసాగాయి. పాలు చాలక రక్తం కూడా తాగి వేశాయి నేనీ విధంగా కూలిపోయాను వీణా నాదం విన్న తరువాతే మెలకువ వచ్చింది'.

'నీ పూర్వ మహత్వమూ ఇప్పటి అధః పతనమూ ఆలోచించినప్పుడు గుండె పగలని కుమారుడెవడుంటాడు' అని కవి తన బాష్ప ధారలతో మాతృపాదాలను అభిషేకించాడు.

'నీ వింత దుస్థితిలో ఉండడం నాకు తెలియదు. లే. కాలం ఆసన్నమయింది తలుపు తీయి. ఎంత సుదీర్ఘ నిశో అయినా సూర్య కిరణాలతో అంతం కావలసిందే నిద్రలో ఉన్న నిన్ను పూర్వరూపిణివి కావని మాయావులు మోసగించితే నమ్ముతున్నావా ? నీ కుమారుల దోర్బణాలలో నీ నిజస్వరూపాన్ని చూచుకో. కష్టాలు కలకాలం ఉండవు' అని దేవి ప్రబోధిస్తూ ఉండగా కవి స్వప్నం నుండి మేలుకొన్నాడు. తెల్లవారింది లెమ్మని చెప్పి తల్లి నీళ్లకు చెరువుకు వెళ్లింది.

"ప్రతి నిశను నిట్టి స్వప్నంబు వచ్చునేని
స్వప్నము యథార్థ రూపంబు బడయునేని
దీన దాస్యాస్పదంబగు దినముకన్న
నాసగొలిపించు నిశయె సౌఖ్యావహంబు" అనుకున్నాడు కవి.

దువ్వూరి రామిరెడ్డి దేశభక్తి కావ్యం ఇది ఈ కావ్యంలోని యువకుడు భారతీయుడు, దీవి భారతదేశం దీవిలో బందీగా ఉన్న స్త్రీ భారత మాత. వానరులు ఇంగ్లీషు వాళ్లు కిష్కింధ ఇంగ్లాండు. దేవి ప్రతీకారశక్తి. ఆమె పాశ్చాత్య ప్రపంచం నుండి స్వాతంత్ర్య భావనలను తీసికొని వచ్చింది పరాయి పాలన నుండి విముక్తిని, స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాడు కవి. దేశ పరిస్థితులకు విచారించాడు. దేశాన్ని పీడిస్తూ ఉన్న పరాయి పాలన, దురాచారాలు నశించాలని ఆశించాడు

## కడపటి వీడుకోలు (1924) :

ఒక మునివాటికలో శారద అనే మునికన్య, గౌతముడనే ముని కుమారుడు బాల్య సఖులు. గౌతముడు వేదాది విద్యలు నేర్చుకోవడానికి వెళతాడు ఎనిమిదేండ్ల తరువాత తిరిగివస్తాడు. శారద సెలయేటిలో నీరు తేవడానికి వెళ్లి నీటిలో ఆడుతూ కడవ సెలయేటి మధ్యకు కొట్టుకొని పోగా దాని కోసం ఏటి మధ్యకు వెళ్లి నీటిలో మునిగి పోబోతుంది. గౌతముడు రక్షిస్తాడు. ఎనిమిదేళ్ల తరువాత వీళ్లు కలుసుకోవడం మళ్లీ ఇదే. ఆమెతో వారి ఆశ్రమానికి వెళ్లి అతిథి సత్కారాలు పొందాడు గౌతముడు.

శారదా గౌతముల బాల్యస్నేహం మళ్లీ చిగురించింది శారద బాల్య స్నేహం ప్రణయంగా రూపు దిద్దుకున్నది

కొన్నాళ్లు గడిచాయి. చైత్ర పౌర్ణమి వచ్చింది. మునికన్యలంతా అలంకరించుకొని తోటకు వచ్చారు. శారద గౌతమునితో వచ్చింది. చెట్లకు పూజలు చేశారు. ఆట పాటలతో ఆనందంగా గడిపారు. సాయంకాలమయింది. మునికన్యలంతా ఒకరొకరుగా ఇళ్లకు వెళ్లారు. చంద్రోదయమైంది గౌతముడు 'ఇంటికి వెళదాం' అన్నాడు. 'సెలయేటి తీరాలలో తిరుగకుండా ఎట్లా పోతాం, వాగు మీద వంగిన మామిడి కొమ్మ సహజమైన వంతెన, చిన్నతనంలో ఆడుకున్నాం కదా అక్కడకు వెళ్లి ఆవిషయాలు జ్ఞాపకం చేసుకుందాం' అన్నది శారద మారు మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా చేయిపట్టుకొని లాక్కువెళ్లింది. ఇద్దరూ సెలయేటి తీరానికి చేరుకున్నారు

శారద కొన్ని కలువలను కోసి కుచ్చుగా చేసి తీసికొమ్మని గౌతమునకు ఇవ్వబోయింది గౌతముడు బాధ పడ్డాడు. వాటిని తెంపినందుకు విచారించాడు 'అందమయిన వస్తువులను చూడవలసిందే స్వంతం చేసుకోగూడదన్నాడు'. 'అందమైన వస్తువు కావడం దాని దోషమా' అన్నాడు. 'అందమైన వస్తువును చూసినప్పుడు కోరిక కలుగుతుంది కోరిక కలిగినప్పుడు దాన్ని స్వంతం చేసుకొనే ప్రయత్నం చేయడం సహజమే కదా' అందామె. 'ప్రేమకూ, వాంఛకూ భేదం నీకు తెలియడం లేదు. పుణ్యమతులయిన వారికి సౌందర్యపూజ ఆనందాన్నిస్తుంది, కామాన్ని కలిగించదు' అన్నాడు గౌతముడు. అయిష్టంగానే పూలగుత్తి అందుకున్నాడు, తన బాధను తెలిపే ఒక నిట్టూర్పు విడిచాడు ఆమె ఆ నిట్టూర్పును గమనించలేదు.

మామిడి చెట్టు వద్దకు చేరుకున్నారు. వాగుమీదకు వంగి ఉన్న కొమ్మమీద కూర్చున్నారు . అది ఊయలలాగా ఊగుతూ ఉంది. శారద తన మనసు విప్పి మాట్లాడింది. 'నిన్ను మళ్లీ చూసింతరువాత చిన్న నాటి స్నేహం ప్రేమగా వికసించింది. నన్ను ప్రేమిస్తున్నాననీ, నన్నెడబాసి వెళ్లననీ బాసచేయ'మంది. గౌతముడు చకితుడయ్యాడు. 'ప్రకృతిలోని ప్రతివస్తువునూ ప్రేమిస్తాననీ కాని దేనినీ కామించననీ' అంటాడు. 'బంగారు గొలుసులతో నా స్వేచ్ఛ ఎందుకు హరిస్తావు?' అని ప్రశ్నిస్తాడు. 'చక్కగా పూచిన పూవు ఎవరూ అనుభవించకుండా వ్యర్థమైపోతే ఈ సృష్టి అర్థమేముంది' అని ప్రశ్నిస్తుంది శారద. 'సృష్టిలో ఏదీ వ్యర్థం కాదనీ, అడవిలో పూచిన పూలు

మన్నుష్యులకు వ్యర్థంగా కనిపించినా తుమ్మెదలు వాటిలోని తేనెను గ్రోలుతా'యంటాడు గౌతముడు.

'ఇహలోక జీవనంలో ఇది పహజం కాదు. ఏటికి ఎదురీదడమెందుకు ప్రకృతి సహజమైన పద్ధతిని అనుసరిద్దాం' అన్నదామె.

'ప్రతి నిమిషానికీ మారే ఈ ప్రపంచంలో శాశ్వతానందాన్నిచ్చే విషయ సంపత్తి ఉందా ? నన్ను ఇంటికి కట్టి వేసే ఎటువంటి ప్రేమనూ నేను పెంచుకో'నంటాడు గౌతముడు. 'ఈ విశాల ప్రపంచంలో స్వేచ్ఛగా నివసించాలనుకునే నన్ను పర్ణశాలలో బందీ చేయడం వట్టిమాట' అన్నాడు.

శారదకు ప్రపంచం శూన్యమనిపించింది. 'నా ఆశలు భగ్నమయ్యాయి కడపటి వీడుకోలిమ్మ'న్నది. 'ప్రాణసఖీ నీకెప్పుడూ సుఖాలు కలుగుగాక' అని కోరుకున్నాడతడు. గౌతముని మెడను గట్టిగా కౌగిలించుకుంది. కాళ్లు జారాయో, ఆవె ఈడ్చిందో తెలియదు కాని వారిద్దరినీ ఆసెలయేరు జీర్ణించుకుంది.

ఈ కావ్యంలో దువ్వూరి రామిరెడ్డి ప్రకృతి సహజమైన ప్రణయానికీ, అందం దర్శనీయమే కాని అనుభవించ కూడదన్న భావానికీ ఘర్షణను వర్ణించాడు. మొదటి భావానికి నాయిక, రెండవ భావానికి గౌతముడు ప్రతినిధులు.

"విశ్వమెల్ల తనదిగ భావించు ప్రేమ
గలుగ, నేకాశ్రితంబైన కామమేల ?" అన్నది గౌతముని వాదన

"పూచెనోయి చక్కదనాల పూవొకండు
యౌవన నికుంజమున గంధ మావహిల్ల
నదియు నిర్భుక్తమై కాన వ్యర్థమైన
సృష్టియాశయ మేమిటో చెప్పగలవె ?"

"అనుసరింతము ప్రకృతి సవ్యంపు సరణి" అన్నది శారద వాదం

ఈ కావ్యనాయకునిలో రాయప్రోలువారి అమలిన శృంగార భావం కనిపిస్తుంది. ఆమెను వివాహమాడడు, దాంపత్య శృంగారం పనికిరాదు.

కాని ఆమెను నిరంతరం ప్రేమిస్తాడట ఇది ప్రకృతి విరుద్ధమని నాయిక భావన. దువ్వూరి రామిరెడ్డి నాయిక వాదాన్నే సమర్థించినట్లు కనిపిస్తుంది.

"ఎడలు వాయని సఖులను కడుపులోన
పెట్టుకొన్న క్రొవ్వాక తుంపెసలు గొట్టు;
నెంత పుణ్యంబు చేసెనో యీ స్రవంతి
ప్రేమ వాంఛల రెంటి జీర్ణించి కొనగ" అన్నాడు కవి.

వసంతోత్సవం నాడు మునికన్యల ఆటపాటలు పూర్తయిం తర్వాత సాయం సంధ్యాసమయ మయింది. ఆ సంధ్యను కవి ఇలా వర్ణించాడు.

"చెట్ల నీడలు తొలిదిక్కు చేర బాఱి
యాత్మ హత్య నశించె సంధ్యాంతరమున
గిరుల నీలిమ మఱికొంత విరివియయ్యె
చుట్టు పట్టులు మసి నల్కినట్టు దోచె".

ఈ వర్ణన కావ్యం దుఃఖాంతం కావడాన్ని సూచిస్తున్నది

## పలిత కేశము (1942) :

భార్య గడ్డం చేసుకొమ్మన్నది. కవి ఏమో ఆలోచిస్తూ గడ్డం చేసుకోవడానికి అద్దం ముందు కూర్చున్నాడు మీసంలో ఒక తెల్ల వెంట్రుక కనిపించింది. కవికి విచారం కలిగింది. దాన్ని కత్తిరించి వేశాడు అయినా అది మీసాలలో యిరుక్కుని కవిని ఎక్కిరించింది. 'నన్ను మళ్లీ పెరగకుండా కత్తిరించి వేయగలవా ? నేను మీకు కాలగతిని తెలియజేస్తాను, శత్రువును కాదు, మిత్రుణ్ణే' నంటుంది. 'ఎంత డబ్బు సంపాదించినా ఖర్చు పెట్టక పోతే లాభం లేదు. కాలం ఎప్పటికీ ఒక్కలాగా ఉండదు వయస్సు ఉండగానే అనుభవించు, దానంచేయి. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకో' అని ప్రబోధించింది. కవి తనకు మరణ మంటే భయం లేదనీ, తాను మళ్లీ మళ్లీ వేయిసార్లైనా ఈ భారత భూమిలో పుట్టాలని కోరుకుంటానన్నాడు పలితకేశం 'స్వర్గాన్ని కోరని వారెవరు ? అక్కడ అప్సరసలతో సుఖించాలని కోరని వారెవరు ?' అంటుంది 'ముక్తి కోరుకుంటాను గాని ఇటువంటి మార్పులేని స్వర్గం ఎవరికి కావాలి? ఆ స్వర్గం కంటే ఈ భూమిలోనే అందమూ, సుఖమూ ఎక్కువగా ఉంది' అంటాడు కవి

'ఇన్ని గొప్పలు చెప్తున్నావుకాని మీ దగ్గర అమృతం ఉందా, కల్పతరు వుందా, చింతామణి ఉందా' అని ప్రశ్నించింది పలితకేశం. 'అప్పుడెప్పుడో విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేశాడట. ఇప్పుడు మా శాస్త్రవేత్తలు పునః సృష్టి చేయగలరు' అన్నాడు కవి 'స్వర్గం కంటే మీ చవిటి నేలను గొప్పచేసి చెప్తున్నావు. స్వర్గం వద్దంటే నరకమే నీకు గతి' అన్నది పలితకేశం స్వర్గంలో పనిలేని జీవితం కంటే నరకంలో సత్య మార్గ ప్రచారం మేలు నరకంలోని మనుష్యులకు యముడు వాస్తవం కాదు కల్పన, కాలం అనే భావానికి మూర్తి మత్వం కల్పించాడు కవి అని బోధిస్తే నరకంలో విప్లవం వస్తుంది' అన్నాడు కవి

'ఇటువంటి బోధలు చేస్తే పాపభీతి పోతుంది ప్రజలు దానధర్మాలు చేయరు. న్యాయానికి, సత్యానికి ఆధారం ఉండదు' అన్నది పలితకేశం. 'ఎంత కాలం భయపెట్టగలం, సత్యం తెలిపి ధర్మ పథంలో నడపడం మేలు' అన్నాడు కవి. 'ఈ మాటలు అందరికీ చెప్ప వద్ద'న్నది పలితకేశం. ఇంతలో భార్య వచ్చి 'ఇంకా మీ గడ్డంగీసుకోవడం పూర్తి కాలేదా ? పగటి కలలు కంటున్నారా' అన్నది కవి త్వరగా పని ముగించుకొని స్నానానికి లేచాడు.

దువ్వూరి రామిరెడ్డి దాదాపు పధ్నాలుగు సంవత్సరాలు కవిత్వం రాయడం మానివేసి 1942లో మళ్లీ ఈ కావ్యం చేపట్టాడు. అసలు మళ్లీ కవిత్వం రాయగలనో లేదో అన్న అనుమానం ఆయన హృదయంలో మొలకెత్తింది. ఈ కావ్యంలోని పలితకేశం ఆయనను కవిత్వ రచనకు ఉద్బోధించింది.

"పది పదునాల్గు వర్షములపాటు కలంబును ముట్టకే సుఖా
స్పదమును నిర్విచారమగు వ్యర్థపు సోమరి జీవితంబు నీ
కొదవెను, నేను గూడ మొన యొత్తితి; నిద్దుర మేలు కొమ్ము; నీ
యెద జిగిరించు భావములకిమ్ము మనోహర రూపసంపదల్"

వృద్ధాప్యం వస్తూ ఉంది నిరర్థకంగా కాలం గడప వద్దు మళ్లీ కావ్యరచనకు పూనుకొమ్మని కవి హృదయం హెచ్చరించింది

స్వర్గ నరకాలనేవి లేవు ఇవన్నీ ప్రజలను భయపెట్టడానికి, ఆశపెట్ట డానికి కల్పించినవే. ఇటువంటి ఆశలు, భయాలు అజ్ఞాన మూలకాలు ఇవి

ఎప్పటికయినా తొలగి పోవలసిందే. అందువల్ల ప్రజలకు సత్యాన్ని తెల్పాలి సత్యం తెలుసుకొని వాళ్లు ధర్మ వర్తనులు కావాలి అని కవి బోధించాడు.

## కవి - రవి (1943) ః

ఒక ఉదయం కిటికీ ఊచల మధ్యగా బయటికి చూడగా కవికి సూర్యుడు కనిపించాడు. కవి సూర్యునితో సంభాషణ కలిపాడు సూర్యుడు తన గొప్పదనాన్ని మనుష్యుడి అల్పత్వాన్ని ఎత్తి చూపించాడు. కవి సూర్యుణ్ణి ఎత్తి పొడిచాడు. కోపించకుండా సూర్యుడు మానవ పరిణామం కాలాను బద్ధ సరణి జరిగిందని చెప్పాడు. మళ్లీ కవి మానవుని గొప్పదనాన్ని వర్ణించాడు

సూర్యుడు కవి అజ్ఞానానికి నవ్వి భూమి చరిత్రను తెలియజేశాడు. 'ఈ భూమి మీద 30,000 సంవత్సరాల కిందట మనిషి ఆటవిక జీవనాన్ని విడిచిపెట్టాడు అప్పటి నుండి ఇప్పటి దాక ఎన్ని నాగరికతలు, రాజ్యాలు పుట్టాయి, నశించాయి, దీన్ని గొప్పగా చెప్పవలసిన అవసరం లేదు' అంటూ తన చరిత్రను వివరించాడు సూర్యుడు

'నేనెప్పుడు పుట్టానో నాకే తెలియదు. నాకు ఊహ తెలిసి మూడు వందల కోట్ల ఏళ్లు అయింది మరో మూడు వందల కోట్ల ఏళ్లు జీవించవచ్చు. ఈ భూమి నా కూతురే. నీకు ఈ సృష్టి రహస్యం వివరిస్తాను. అర్ధనారీశ్వరమైన ఆదిశక్తి దుర్నిరీక్ష్యకాంతితో వెలుగొందుతూ ఉంది. ఆమె అగ్నిగోళాలనే గుడ్లు పెట్టింది. అందులో ఒక్కటి పగిలి సూర్య బింబాలుగా ఆకాశంలోకి ఎగసింది ఆ సూర్య బింబాలన్నిటిలో నేనే చిన్నవాణ్ణి. నా అసమర్థతకు వికారరూపానికి అమ్మకడుపున చెడపుట్టావని ఆమెపైకి విసరి వేసింది ఆకాశంలో అట్లా కుమ్మరిసారె లాగా తిరుగుతూ ఉన్న నాలో పరిసర ధూళి పడి కాలి కరిగి కలిసి నాకు బలాన్నిచ్చింది. నాకంటే పెద్ద తార ఒకటి మీదుకు రాగా భయంతో కుంచించుకు పోయాను. భ్రమణ వేగానికి నాలోని కణితలు విడిపోయి దూరంగా వెళ్లి నాచుట్టూ తిరుగుతున్నాయి వాటిలో భూమి ఒకటి. భూమిలో నుండి కూడా ఒక పెద్ద కణిత విడిపోయి దూరంగా వెళ్లింది. అదే చంద్రుడు.

'నా కంటే ఎంతో దూరంగా ఉండడం చేత ఇతర సూర్యులు నక్షత్రాలుగా కనిపిస్తున్నారు వాటిలో కొన్ని ఏకాకులు. కొన్నిటి చుట్టు గ్రహాలున్నాయి. ఉష్ణం అనుకూలంగా ఉండడం వల్ల భూమి మీద ప్రాణికోటి

పుట్టింది. ఈ భూమి మీద ఎంత మంది జనం ఉన్నారో అన్ని నక్షత్రాలున్నాయి. మనకు దగ్గరగా ఉన్న సూర్యుని కాంతి భూమిని చేరడానికి ఐదు సంవత్సరాలు పడుతుంది. అతిదూరంగా ఉన్న సూర్యుని కాంతి మనను చేరడానికి పధ్నాలుగు కోట్ల సంవత్సరాలు పడుతుంది. నా కాంతి భూమిని చేరడానికి ఎనిమిది నిమిషాలు పడుతుంది. భూమి కంటే నేను పది లక్షల రెట్లు పెద్ద. నా కంటే పది లక్షల రెట్లు పెద్దవిగా ఉండే నక్షత్రాలెన్నో ఉన్నాయి. అంటే ఈ విశ్వం ఎంత పెద్దదో ఊహించుకోవచ్చు. ఇది అనంతం.

'నక్షత్రాలు పుడతాయి, చచ్చి భస్మమైపోతాయి, ఆ బూడిద మరో ఆకారాన్ని పొంది నూత్న జీవనం పొందుతుంది. సముద్రం ఇంకి బాష్పమై, మేఘమై వర్షిస్తుంది. ఆ విధంగా ఈ విశ్వంశాశ్వతం. స్థితి రూపం మారుతుందే తప్ప వస్తువుకు నాశనం లేదు. సౌరకుటుంబాలకు ప్రళయం కలుగ వచ్చు, విశ్వానికి మాత్రం విలయం లేదు.

''భూమి నా శరీరం నుండి 200 కోట్ల సంవత్సరాల క్రితం విడిపోయింది క్రమక్రమంగా పై భాగం చల్లబడి గట్టిపడింది రాళ్లు ఏర్పడ్డాయి. అగ్ని పర్వతాలు పగలగా శిలాద్రవాలు పైకి చిమ్మి భూమి తలంలో లోతు లేర్పడ్డాయి. మేఘాలేర్పడి భయంకర వర్షాలు కురిసి ఈ లోతు ప్రదేశాలన్నీ జలమయమై సముద్రాలయ్యాయి. సూర్యరశ్మి వల్ల జలధిలో సూక్ష్మ జీవులు పుట్టాయి. అట్లా కొన్ని లక్షల సంవత్సరాల తర్వాత పాచి ఏర్పడింది నాచు తీగలతో చెట్లు మొలిచాయి. ప్రాణులు నాచుతీగలను చేరాయి. కాలపరిణామంలో నిరస్థికాలైన జలచరాలు పుట్టాయి. తర్వాత వెన్నెముక గలిగిన చేపలు పుట్టాయి. తరువాత ఉభయ చరాలు పుట్టాయి. రెక్కలలో మార్పు వచ్చి తర్వాత కాళ్లతో భూచరాలు పుట్టాయి వింత వింత చెట్లు పుట్టాయి. దోమలు, ఈగలు, పురుగులు పుట్టాయి. తొండలు బల్లులు పుట్టాయి రాక్షస జంతువులు పుట్టాయి. ఎగరగల పాములు, ఉడతలు పుట్టాయి తరువాత ఈకలు రెక్కలు ఉన్న పక్షులు పుట్టాయి. ఏనుగులు, గుర్రాలు, సింహాలు, జింకలు పుట్టాయి వేలవేల తెగల కోతులు పుట్టాయి. వాటిలో తోకలు లేని నాలుగు రకాలు ఏర్పడ్డాయి. వాటిలో ఒక తెగ నేటి మానవ జాతి అయింది. కోతి నుండి మానవుడు పరిణామం చెందడానికి కోటి సంవత్సరాలు పట్టింది.

'ఆది చేతనాణువు పుట్టింతర్వాత మనిషి ఏర్పడడానికి నూటపదికోట్ల ఏళ్లు పట్టింది' అని భూమి చరిత్రను వివరించాడు సూర్యుడు.

ఈ కావ్యమంతా విజ్ఞాన విషయం. విశ్వం, సూర్యుడు, భూమి, ప్రాణులు ఎట్లా పరిణామం చెందాయో కావ్య రూపంలో దువ్వూరి రామిరెడ్డి వర్ణించాడు తెలుగులో ఇటువంటి వైజ్ఞానిక కావ్యాలు అరుదు దువ్వూరి రామిరెడ్డి రచించిన 'జలదాంగన' ఇటువంటి కావ్యాలకు ఆద్యం.

దువ్వూరి రామిరెడ్డి రెండు ప్రపంచ యుద్ధాల నడిమి కాలంలో కావ్య రచన చేశాడు. ఆంధ్రదేశంలో భావ కవిత్వోద్యమం ముమ్మరంగా ఉన్న రోజుల్లో కావ్యరచన ప్రారంభించి అభ్యుదయ కవిత్వోద్యమం ముమ్మరంగా ఉన్న దశ వరకు కవిత్వం రాశాడు భావకవిత్వోద్యమంలో ఆత్మాశ్రయత్వం ప్రధాన లక్షణం కాని దువ్వూరి రామిరెడ్డి రచనలు ప్రధానంగా వస్త్వాశ్రయాలు ప్రణయం ప్రధాన లక్షణంగా ఉన్న రోజుల్లో దువ్వూరి రామిరెడ్డి కావ్యాలలో వస్తువు నీతి, ధర్మం, త్యాగం. రామిరెడ్డి శాంతినీ, స్వాతంత్ర్యాన్నీ ప్రేమించాడు సర్వమానవ సమానత్వాన్ని కాంక్షించాడు. రామిరెడ్డిలో సామ్యవాద భావాలు నెలకొన్నాయి ఎటువంటి పరిస్థితులలోను కృషిని విడిచి పెట్టవద్దంటాడు.

"సంఘ పరివర్తనంబులు జరుగుచున్న
రాజకీయ సంక్షోభంబు రగులుకొన్న
విప్లవంబుల దేశమ్ము వీగుచున్న
కృషి త్యజింపకు కర్షకా, కీడు గలుగు" అన్నాడు 'కృషీవలుడు' లో

మనిషి శాస్త్రాలు చదివి, విద్యలు అభ్యసించి, కళలు సంపాదించి కూడా వినాశనం వైపే ఎందుకు పోతున్నాడు ? మనిషి తనకు కావలసిన దానికంటె ఎక్కువ సంపాదించడం వల్లనే.

అన్నమో రామచంద్రా అని అలమటించే వాడికి స్వర్గ సుఖాల గురించి చెప్తే లాభమేమిటి ? అంటాడు రామిరెడ్డి లోకనాశనం కోసం వచ్చిన రెండవ ప్రపంచ యుద్ధాన్ని విమర్శించాడు. హిట్లరును నిందించాడు.

కాల్పనికోద్యమ కాలంలోని ప్రగతిశీల కవిగా మనం దువ్వూరి రామిరెడ్డిని గుర్తించ వచ్చు.

కాల్పనికోద్యమ కాల రచనల్లో స్త్రీ వర్ణనలలో చాలా మార్పు వచ్చింది స్త్రీ పట్ల కవుల దృక్పథంలో ఎంతో ప్రగతి కనిపిస్తుంది. రామిరెడ్డి స్త్రీని ఉన్నతంగా చిత్రించాడు. వర్ణనలలో ప్రకృతి వర్ణనలు ముఖ్యమైనవి రామిరెడ్డి కావ్యాలలో సూర్యోదయ, సూర్యాస్తమయాలు, వనాలు, సెలయేళ్లు, పొలాలు, వర్షాది ఋతువులు ప్రధానమైనవి. వర్ణన వర్ణన కోసం కాదని రామిరెడ్డి అభిప్రాయం వర్ణనలు ఇతి వృత్తానికి సంబంధించి ఉండాలి. పోషకంగా ఉండాలి. అంగాంగి సంబంధంతో శోభాయమానంగా ఉండాలి దువ్వూరి రామిరెడ్డి వర్ణన లెప్పుడూ అసందర్భంగా ఉండవు. కథ ఒక రమ్యమైన ప్రకృతి దృశ్యంలో ఇమిడి ఉంటుంది రామిరెడ్డిలోని చిత్రకారుడు, కవి ఉమ్మడిగా ఆయన వర్ణనలలో దర్శనమిస్తారు ఆయన కావ్యాలలో ఎక్కువ భాగం సూర్యోదయంతోనో, సూర్యాస్తమయంతోనో ప్రారంభమవుతాయి

తెలుగులో విజ్ఞాన శాస్త్ర విషయాలకు కావ్యత్వ గౌరవం కల్పించిన వాడు దువ్వూరి రామిరెడ్డి. విజ్ఞాన విషయాల మీద రామిరెడ్డికి ఎంతో ఆసక్తి. ఆ ఆసక్తియే సృష్టి రహస్యాలను, విజ్ఞాన శాస్త్ర విషయాలను కావ్యరూపంలో వ్యక్తం చేయడానికి కారణమయింది ఇక్కడ కవీ శాస్త్రవేత్తా ఒక్కడయ్యారు.



# 4. దువ్వూరి రామిరెడ్డి ఖండ కావ్యాలు

## నక్షత్రమాల (1918-1921) ః

1918-1921 మధ్యకాలంలో ప్రచురితమయిన తన ఖండకావ్యాలను 1921లో దువ్వూరి రామిరెడ్డి 'నక్షత్రమాల' అనే పేరుతో సంకలనం చేశాడు. ఈ ఖండకావ్య సంపుటికి పీఠిక రాస్తూ కావ్యశిల్పం ఇతర శిల్పాల కంటే విశిష్టమైనదనీ, కవి సృష్టికర్త అనీ, ప్రకృతిలోని లోపాలను పూరించడమే కళాకారుడి లక్ష్యమనీ రామిరెడ్డి అభిప్రాయ పడ్డాడు ప్రకృతి కంటే కవి ముందున్నాడని చెప్తూ కవి చెప్పిన మాటల్లో కంటే చెప్పని మాటల్లోనే ఎక్కువ మాధుర్యముందన్నాడు. భాషకు పరిమితులున్నాయనీ, భావం భాషకంటే విస్తృతమైందనీ ఆయన అభిప్రాయం. కవిత్వం శాస్త్రం కాదన్నాడు శాస్త్రంలో ఆనందం లేదు, నగ్న సత్యం మాత్రమే ఉంది కవిత్వంలో ఆనందం ప్రధానం

ప్రాచీనులు తమ తరువాతి కవులను, కళాకారులను తమ అభిప్రాయ ఆచారాలతో బంధించారనీ, అందువల్ల కావ్యాలలో వైవిధ్యం కొరవైందనీ దువ్వూరి రామిరెడ్డి విమర్శించాడు. ఆధునిక కాలంలో పరిస్థితులు మారాయి. కవిత్వం సామాన్యులకు కూడా అందుబాటులోకి వచ్చింది. అందువల్ల కవిత్వంలో సామాన్య జనుల అభిరుచులు ప్రతిబింబిస్తాయి

అన్ని కాలాలలోనూ కూడా కవులకు సమకాలికులు తమ కవిత్వాన్ని ఆదరించరేమోనన్న అనుమానం ఉంటుంది. భవభూతి, చేమకూర వేంకటకవి, కీట్స్ వంటి కవులు కూడా ఇటువంటి అనుమానాలకు లోనయ్యారు.

అయినా -

"ఓరి బాలక నీ మురళీ రవంబు
వ్యర్థ మౌనని చిత్త తాపంబు వలదు
రాగ పరిచితుడెవ్వడో రమ్యగీతి
వినియె యుండు నానందంబు వెల్లి విరియ"

అన్న నమ్మకంతో కవి రాస్తూనే ఉంటాడు.

ఈ సంపుటంలో ఇరవై ఒక్క కవితలున్నాయి. వీటిలో నాలుగు కవితలు కవిత్వానికీ, కవికీ సంబంధించినవి.

"కవి మనోరథము' అన్న కవితలో ఈశ్వరుడు తనను మబ్బు పిల్లవానిగా, మంచు బిందువుగా, సెలయేరుగా, కలువగా, చుక్కగా ఎందుకు సృష్టించలేదో అని ప్రశ్నిస్తాడు కవి. ప్రకృతిలోని అందమయిన వస్తువులలో కలసిపోవాలన్న వాంఛ. 'కవి' అన్న కవితలో వేకువలో వికసించే పూలలో ప్రకృతి సామ్రాజ్య పాలనా పద్ధతులను చదువుతాననీ సముద్రపు అలలలో విశ్వసృష్టి విధానాన్ని వింటాననీ, నల్లని ఆకాశంలో తెల్లని నక్షత్రాలనే అక్షరాలతో విశ్వవైశాల్యాన్ని బోధించే విద్య నేర్చుకుంటాననీ, సెలయేటి పాటలో దాగిఉన్న రాగతత్వాన్ని కోయిల వద్ద నేర్చుకుంటాననీ అంటాడు కవి. ప్రభాతరాగ రంజితమైన తూర్పు తీరంలో ప్రకృతి తన స్వీయ చరిత్ర పుటను తన ముందు విప్పుతుందంటాడు.

'కవితాప్రణయిని'లో కవితను స్త్రీగా భావించి ఒక యువకుడు ఆమె ప్రణయాన్ని కోరుకుంటాడు. ప్రకృతి రూపంలోని తనను ఆరాధించే ఆ యువకుని కౌగిలించుకుంటుంది కవితా ప్రణయిని.

'అజ్ఞాతకవి'లో తన కవిత్వాన్ని ఎవరూ ఆదరించరేమోనని కవి విచారించనవసరం లేదనీ కవితా రసం గ్రోలే విమర్శక పాఠకులు తప్పక ఉంటారనీ విశ్వాసాన్ని ప్రకటించాడు.

'ప్రణయాంజలి', 'ప్రణయాహ్వానము', భావకవితా యుగానికి సహజమైనవి 'ప్రణయాంజలి'లో విఫలమైన ప్రేమను వర్ణించాడు.

"ఇంక నీలోకమున మన కిద్దఱకును
హృదయరక్తికి నాలంబ మొదవకున్న
ప్రణయమెల్ల ఫలించు స్వర్గమ్ము నందు
ననుభవింత మానంద రసామృతంబు" అంటాడు కవి

'ప్రణయాహ్వానము'లో కవి ప్రేయసిని ప్రణయానికి ఆహ్వానిస్తాడు 'సంధ్య', 'కుసుమాశ్రువులు', 'కోయిల' ప్రకృతి ప్రధానమయిన కవితలు. సూర్యుడు అస్తమిస్తూ ఉంటే సాయం సంధ్య కవికి రణరంగం లాగా కనిపించింది. రెండు పక్షాలవారు పోరాడగా రక్తపు సెలయేళ్లతోనూ, సైనికుల అవయవఖండాలతోనూ నిండి ఉన్న రణరంగం, కురుపాండవుల ఘోర యుద్ధంలో కూలిన సైనికుల శరీరాలు పేర్చిన రణరంగం క్షాత్ర యుగంలో భారత శౌర్యరమామణి స్నానం కోసం శత్రువుల తలలనే పద్మాలు, వారి బాహువులనే తామర తూండ్లతో నిండి ఉన్న రక్తపు కొలను లాగా ఉందని వర్ణించాడు కవి సంధ్యను పురాతన భారత వైభవంలాగా బంగారు వర్ణంలో ఉందట. కవి నాటి భారత దేశ దుస్థితిని ఈ సంధ్యా వర్ణనలో నిక్షేపించాడు.

"ఎరలకు నేగు పక్షికులమెల్ల కులాయములంటి యాతురం
బఱచుచు వచ్చుటం గనగ భారతదేశ సువర్ణ సంపదం
బరధరణీజనుల్ గని యపార ముదంబున దాని దోచుకో
పరుగిడి వచ్చిరో యనగ భావమునం బొడకట్టు వింతగన్"

భారతదేశపు సంపదలను కొల్లగొట్టడం కోసం ఆత్రంగా వచ్చే విదేశీయుల్లా సంధ్యవేళన పక్షులు గూళ్లకు వెళ్తున్నాయట ఈ దేశం మళ్లీ పూర్వవైభవాన్ని ఎప్పుడు పొందుతుందోనని విచారిస్తాడు కవి.

'కుసుమాశ్రువులు'లో పూజకోసం పూలు కోయడానికి వచ్చిన బాలకు పూలు కోయడానికి చేతులు రావు.

"ప్రకృతి రామణీయకమును బాడువెట్టి
దైవపూజకు తొడగెను దండ్రి యేమొ
ఆత్మకుసుమ సమర్పణం బాచరించి
వేదవేద్యుని పూజింప వేడికొందు' నంటుంది ఆ బాల. ఈ భావమే కరుణశ్రీ 'పుష్పవిలాపము'లో విపులంగా గోచరిస్తుంది.

'కోయిల'లో పైరుకోతలతో అలసి విశ్రమించే చెలుల మనస్సులను చల్లబరచడానికి వసంత కాల లాంఛనంగా వచ్చి పాడమని కోయిలను ఆహ్వానించాడు కవి నీ పలుకు తియ్యదనం కోసం విరహుల్లాగా కవులు బాధపడుతున్నారంటాడు.

'రెడ్డి కుల ప్రబోధము', 'కొండ వీడు' ఈ రెండు కవితల్లోనూ దువ్వూరి రామిరెడ్డి రెడ్ల పరాక్రమాన్ని వర్ణించి ప్రబోధాన్ని కలిగించాడు.

'సోదరీస్మృతి' స్మృతి గీతం. దువ్వూరి రామిరెడ్డి చెల్లెలు రుక్మిణమ్మ చిన్నతనంలోనే మరణించింది. అయినా ఆమె స్మృతి మాత్రం కవిని విడనాడలేదు అందుకే

"భౌతికంపు సంబంధము వాసియును ని
రంత రాధ్యాత్మిక ప్రణయంబు మనల
గడవరాని బంధంబుల కట్టివైచె
స్వప్నవీధికి వచ్చెదే ప్రతిదినంబు" అన్నాడు కవి

'స్వాతంత్ర్య రథము', 'జాతీయ గీతము', 'రాట్నపు పాట' దేశభక్తి గీతాలు స్వాతంత్ర్య రథంలో ఒక దేవి ఆసీన అయి ఉంటుంది. ఈ దేవి ధర్మ జీవనాకారమా ? శాంతి బింబమా ? అకల్మష సత్యనికేతనమా ? సంసార ఫల స్వరూపమా ? ప్రజా హృదయమా ? అన్నట్లుంటుంది. ఈ స్వాతంత్ర్య రథాన్ని ఎవరూ ఆపలేరు. ఈ స్వాతంత్ర్య రథ చక్రాల కింద పూర్వ సింహాసనాలు మణిమయ కిరీటాలు, భోగమందిరాలు నశించి పోయాయి. ఈ రథాన్ని లాగే వారు ప్రజలే

"తేరు జాడల నెత్తురు పాఱి పాఱి
బంగరుంబంట పండించె ఒక్కనేల
చక్రనేములు దాకిన స్థలము లెల్ల
సస్యలక్ష్మికి కళ్యాణ శాలలయ్యె" నట

స్వాతంత్ర్య రథం చక్రాల కిందపడి నిరంకుశత్వం నశించి పోయింది. దానిని అడ్డు కోవడానికీ, ఆపడానికీ ప్రయత్నించిన వారంతా నశించి పోయారు. ఆ రథం సాగినంత మేరా బంగారు పంటలు పండాయి. కవి స్వాతంత్ర్యానికి పట్టం కట్టాడు ఈ కవితలో 'జాతీయ గీతము'లో "నీ పదపీఠిని ప్రాణ సుమంబులు నిలిపి భజించెదను

గర్విత దాస్య భరంబును మాన్పి సుఖంబులు మాకిడుము" అని భరతమాతను వేడుకొన్నాడు కవి.

స్వాతంత్ర్యోద్యమంలో రాట్నం ఒక ప్రముఖ పాత్ర వహించింది. రాట్నం దేశీయ పరిశ్రమలకు ప్రతీక. దువ్వూరి రామిరెడ్డి స్వాతంత్ర్య పోరాటానికి ఉద్బోధకంగా 'రాట్నపుపాట'ను రచించాడు.

'ద్రౌపదీ సందేశము', 'దుర్యోధనుడు' భారతేతి వృత్త ప్రధానాలు. 'ద్రౌపదీ సందేశము'లో సంజయునికి ద్రౌపది తన సందేశం చెప్తుంది.

"ఉత్త మాటల నేమి ప్రయోజనంబు ?
అవని యొసగుటొ, లేకున్న నని సలుపుటొ
చెప్పిపంపుడు నా మేన జీవమున్న
దనుక సంధియత్నంబులు దలగుడయ్య"

'దుర్యోధనుడు'లో విజయమో, వీరస్వర్గమో తప్ప చావుకు భయపడి సరస్సులో దాక్కోవడం ఉచితం కాదంటాడు కవి.

'రాధ యుత్కంఠ', 'ఎంత మోసము' కృష్ణ సంబంధమైన కవితలు. కృష్ణుని కోసం ఉత్కంఠగా ఎదురు చూస్తుంది రాధ తెల్లవారుతుంది. దుఃఖంతో కోపంతో కృష్ణుణ్ణి అన్యాపదేశంగా దూషిస్తూ ఉంటుంది. కృష్ణుడు ముసిముసి నవ్వులు నవ్వుతూ వెనుక నిలిచి ఉంటాడు. "వేచి యుండిన యున్న విభుడరుదేడు. వేసవి వానల విధముగా నతడు కలవలె వచ్చును కనిపించి పోవు" అనుకుంటుంది రాధ.

'ఎంత మోసము'లో యువతి కృష్ణుడు అటుగా వస్తాడని నాలుగు దారుల కూడలిలో ఎదురుచూస్తూ ఉంటుంది. రత్నఖచిత కిరీటం ధరించి ఏనుగుమీద వస్తాడని ఎదురుచూస్తూ ఉంటుంది. 'నీ ముందే నెమలి పింఛంతో వేణువు ఊదుతూ కృష్ణుడు వెళ్లాడుకదా' అంటాడు బాటసారి. 'ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నాడు, వేణుగానం కూడ విన్నట్లే ఉంది ఎంతమోసం జరిగింది' అంటుందా యువతి. "అదియె తెలియరాని విచిత్ర మతివ మిన్న" అంటాడు బాటసారి.

'ముసలి మాలెత'లో ఉన్న ప్రాంతంలో భుక్తి గడవక మరో ప్రాంతానికి వలసవచ్చి జ్వరంతో కొడుకు కూతురు చనిపోగా ఎండుటాకు లాంటి ఒక

ముసలి మాలెత కవిని దాహం అడుగుతుంది. కవి ఆమెకు నీళ్లిస్తాడు. ఆమె విషయం కనుక్కుంటాడు. ఆమెను రోజూ వచ్చి తన ఇంట్లో మజ్జిగన్నం తినమంటాడు. ఆమె మాత్రం - "అయ్యా కూలిచూపి నాకు కూడు పెట్టు తిరిపెమెత్తి తిన్న తీఱునా ఆకలి?" అంటుంది. కాటికి కాలు చాచుకొని ఉన్న ఒక ముసలి మాలెతలోని ఆత్మాభిమానాన్ని కవి ఈ ఖండికలో ప్రస్తుతించాడు.

ఈ సంపుటంలోని చివరి కవిత 'ఏలపాట'. ఎంకి పాటల వలె జానపద బాణీలో రచించిన ప్రణయ గీతం ఇది.

## నైవేద్యము (1921-1925) :

'నైవేద్యము'లో నలభై మూడు కవితలున్నాయి. ఈ సంపుటిలోని కవితల్లో ఎక్కువ భాగం ద్విపద ఛందస్సులోను, గేయరూపంలోనూ ఉన్నాయి. కొన్ని పద్య కవితలు. ఈ సంపుటిలోని తొలి ఖండిక 'నైవేద్యము'. ఈ కవిత పేరునే కవి సంపుటికి పెట్టాడు. దేవి పాదపూజకు పుష్పాలు తెచ్చి అర్పించు కున్నాడు కవి. ఈ పేరుకు తగినట్లుగానే 'నైవేద్యము'లోని కవితలలో ఎన్నో భక్తి ప్రధానాలు, వీటిని మర్మ కవిత్వం అనవచ్చు. కవి ఆధ్యాత్మిక భావాలు, దేశభక్తి, ప్రణయం, ప్రకృతి మీది వలపు అన్నీ ఈ సంపుటంలో పెనవేసుకొని పోయాయి. 'నైవేద్యము'లోని దేవి దేశమాత. ఆ దేశమాతను సేవించుకోవడానికి కవితో సహా పేదలూ, ధనికులూ, పూజ్యులు, అధములు అనే భేదాలు లేకుండా అందరూ వస్తారు.

'మర్మకవి' అన్న ఖండికలో కవి మర్మకవిని సంభావిస్తాడు. "నీ కావ్య మాధురికి వినిమయంబుగ నీయ విశ్వంబు నందు నేమియు కన్పట్ట దీడైన యటుల" అని ప్రశంసిస్తాడు.

'కవి-సన్యాసి'లో జ్ఞానాన్ని సంపాదించడం కోసం ప్రయత్నించేవాడు ఎటువంటి అడ్డంకులను లెక్క చేయకూడదంటాడు. ఈ కవితలో కవి ఎన్నో ప్రతీకలను వాడాడు. సన్యాసి సముద్రం ముందు కూర్చుని, సముద్రంలోని సంపదలను సంపాదించాలన్న కాంక్ష ఉన్నా, సముద్రంలోని అలజడులకు భయపడి ముందు కడుగేయడు. సుఖదుఃఖాలు జీవితంలో భాగమనీ, అవి కలిసే ఉంటాయనీ, కష్టాలకు భయపడి సుఖాలను వదలుకో కూడదనీ ప్రబోధిస్తాడు. సముద్రం జీవితం. సముద్రంలోని సంక్షోభాలు జీవితంలోని

ఒడిదుడుకులు. సన్యాసి జీవుడు. కవి పరమాత్మ. సముద్రంలోని సంపదలు జ్ఞానం.

'దీపనిర్వాణము'లో మోక్షమార్గం కోసం అన్వేషించే బాటసారికి గమ్యం కనిపించక విధి ఎటు తీసుకొని వెళితే అటు పోవడం ఇతివృత్తం. మార్గం చూపేవారెవరూ లేరు. భగవంతుని గురించిన జ్ఞాన దీపాన్ని మాయ మాటిమాటికీ ఆర్పుతూ ఉంటుంది.

'పిచ్చి బికారి'లో ఒక పిచ్చి బికారి భోరున కురుస్తున్న వానలో, కారు చీకటిలో భిక్షంకోసం వస్తాడు. ఈ భయంకర రాత్రిలో ఇట్లా వచ్చావెందుకు ? అని మాయా కుమారి అడుగుతుంది. అన్నీ విడిచి కాలవీధిలో నీ పాదాల దగ్గరకు వచ్చాను భిక్ష పెట్టమంటాడు బికారి. నా దగ్గర ఏమున్నదంటుంది మాయాకుమారి. నీ జడలో వాడిపోయిన చంపకదళాల మాల ఇచ్చి ఈ యాత్రను ముగింప చేయుమంటాడు బికారి. జ్ఞానమార్గాన్నిచ్చి ముక్తి ప్రసాదించమని భక్తుడు కోరుతున్నాడు. 'అతిథి' అలౌకిక మార్గంలో, ఏ నిగూఢ విపంచీ రాగాన్నో వింటూ, ఏ చిన్మయానుభవ స్వప్నాన్నో కాంచినవాడు. అందుకే ముక్త పథంలో విహరిస్తున్నాడు

ఐహిక యాత్రా శ్రమను మరచి పోవడానికి ఆనంద సత్ర ద్వారాలను తెరచి ఉంచాను రమ్మని ఆహ్వానిస్తాడు 'ఆనంద సత్రము'లో.

'పూర్వ జన్మ స్మృతి'లో తను పూర్వ జన్మలలో శ్రీకృష్ణుని బాల్య క్రీడలను, లీలలను ప్రత్యక్షంగా అనుభవించిన స్మృతిని కవి వర్ణించాడు.

'మృత్యువు'లో జీవితం, మృత్యువు రెండూ కవలపిల్లలంటాడు కవి. మృత్యువు మనిషితో దాగుడు మూతలు ఆడుతుంది. తనంటేనే భయపడే మనిషిని చూచి మృత్యువు నవ్వుకొంటుంది. దువ్వూరి రామిరెడ్డి మృత్యువును అందాలకే అందంగా అభివర్ణించాడు. మనిషిని సంసార సాగరం అవతలి ఒడ్డుకు చేర్చడానికి ప్రకృతి నియమించిన కర్ణధారిణిగా మృత్యువును కవి ప్రస్తుతించాడు.

'బిడ్డ-బాటసారి'లో బాటసారి పండ్లు భుజం మీద వేసుకొని విశ్వ సామ్రాజ్యాన్ని కొనడానికి కాళ్లరిగి పోయేట్లు తిరుగుతున్న ముసలి తాతయ్య,

బిడ్డ తాత మార్గంలో నడచి తానూ విశ్వసామ్రాజ్యాన్ని సంపాదించాలని ఆశించే బాలుడు. వివిధ గ్రహాలలో సంపాదించే ఈ ఫలాలు భవ పిపాసను తొలగించేవి. ఈ జ్ఞాన ఫలాలను తగినంత సంపాదించి మోక్ష సామ్రాజ్యాన్ని సంపాదించడానికి మనిషి ప్రయత్నిస్తాడు. బాలుడూ చేసే పని అదే.

'హృదయాభిలాష'లో దువ్వూరి రామిరెడ్డి భగవంతునిలో లీనం కావాలనే అభిలాషను వ్యక్తీకరించాడు.

ఈ సంపుటంలో దేశభక్తి ప్రధానమైన కవితలెన్నో ఉన్నాయి. 'కర్ణధారి' అన్న ఖండికలో కవి స్వాతంత్ర్య పోరాటం గమ్యాన్ని చేరుకోవడానికి ప్రయాణిస్తూ ఉంది. ఈ ప్రయాణాన్ని ఆపవద్దు అని ప్రబోధించాడు. స్వాతంత్ర్యోద్యమాన్ని అహింసాయుత పోరాటంగా గాంధీ నిర్వహించాలని ప్రయత్నించినా, చెదురు మదురుగా హింస కూడ చోటు చేసుకొంది. హింస జరిగినప్పుడు గాంధీ ఉద్యమాన్ని తాత్కాలికంగా విరమిస్తూ వచ్చాడు ఈ విరమణ యువకులు చాలా మందికి నచ్చనిది. అందుకే దువ్వూరి రామిరెడ్డి పడవను నడి సముద్రంలో విడిచి పెట్టక ఆశతో పడవను ముందుకే నడపమని ఉద్యమనేతను ప్రబోధిస్తున్నాడు.

'మాతృ మందిరము'ను దర్శించడానికి కొందరు యాత్రికులు బయలు దేరారు. కనుచూపు దూరంలో మాతృమందిరం కనిపించింది. యాత్రికులకు అది అద్భుతంగా గోచరించింది. ఎండ ఎక్కువ కాకముందే చేరుకుందామను కున్నారు. కాని ఆకాశవాణి అడ్డగించింది. ప్రాణం పణంగా పెట్టగలిగిన త్యాగులే మందిరాన్ని చేరుకోగలరంటుంది. వెనక్కితిరిగి పొమ్మంటుంది. దారి పక్కన పడి ఉన్న ఒక పుర్రె 'మాతృదేవీ బలిమంటపంలో యజ్ఞపశువుగా నిలువ గలిగిన భాగ్యం ఎవరికి లభిస్తుందో అతని పాదధూళి ప్రజల శిరస్సులను పవిత్రం చేస్తుంది. అటువంటి వీరుడుంటే ముందుకు అడుగు పెట్టండి' అంటుంది. అందరూ వెనుకంజ వేస్తారు. ఒక యువకుడు ముందుకు వస్తాడు. మాతృ మందిర బలిమండప వేది మీద ఆత్మకర్పూరాన్ని వెలిగించమంటుంది పుర్రె. 'పూర్వ వీరులలాగా నీ కాలిగుర్తులను ఇక్కడ ముద్రించి పొమ్మ'న్నది ఆకాశవాణి. మాతృదేవత విముక్తి కోసం ప్రాణం త్యాగం చేసే వీరులు కావాలి.

'భవిష్యద్దర్శనము'లో హెచ్చు తగ్గులు లేక అందరూ రాజూ పేదా కూడా సహపంక్తి భోజనం చేస్తారు. భవిష్యత్తులో ఇటువంటి సమానత్వం వస్తుంది అన్న ఆకాంక్ష కవిలో కనిపిస్తుంది. ఈ దృశ్యం నిజమే అయితే ఆశ్చర్యకరం అనీ, కలే అయితే ఆనందమయమనీ అంటాడు కవి వసుధైక కుటుంబాన్ని కలగన్నాడు కవి.

'సమరతృష్ణ' దువ్వూరి రామిరెడ్డి సమకాలిక రాజకీయ సామాజిక పరిస్థితుల అవగాహనకు అద్దం పడుతుంది. ప్రపంచ రాజకీయాలను రామిరెడ్డి బాగా అర్థం చేసుకొన్నాడు. యుద్ధానికి కారణం ఏమిటి ? మనిషి నలుపైతే నేమిటి ? తెలుపైతే నేమిటి ? పసుపైతే నేమిటి ? అంతా ఆత్మ బంధువులు కారా ? అని ప్రశ్నిస్తాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో గెలుపొందిన గర్వంతో అక్రైస్తవులై మళ్లీ క్రీస్తును సిలువవేస్తున్నారని అగ్రరాజ్యాలను విమర్శించాడు. పెట్టుబడిదారీ విధానంతో తమ సరుకులు అమ్ముకోడానికి జనాన్ని బానిసలుగా చేయడం న్యాయమా ? అని ప్రశ్నించాడు. ఈ అన్యాయం ఇంకా ఎంతకాలం? అని గర్జించాడు. కేవలం డబ్బున్న వారి అరచేతి ఫలంగానూ, కష్టజీవుల పాలిట కంఠపాశం గానూ ఉండేటట్లయితే ఈ నాగరికత అవసరం లేదన్నాడు. నానా జాతి సమితి బూటకాన్ని గుర్తించాడు. భవిష్యత్తులో మళ్లీ యుద్ధం రాకుండా ఈ ప్రపంచాన్ని కాపాడడానికి ప్రపంచ కవులంతా ఒకటి కావాలని ప్రబోధించాడు.

'మేలుకొలుపు'లో దాస్యం పోయి జయం కలుగుతుందనీ మేలు కొమ్మనీ భారత యువకులను మేలు కొలిపాడు. 'సేవ'లో భారత మాత సేవ చేద్దామని ప్రబోధించాడు. 'ప్రబోధ శంఖము'లో సంశయం మానుకొమ్మనీ, వెనుకంజ వేయవద్దనీ, భారతీయుడననే గర్వంతో తలయెత్తి చూడమనీ, విజయ శంఖాన్ని పూరించమనీ ప్రబోధించాడు రామిరెడ్డి.

'లూరీ'లో అతిథి వేషంలో వచ్చిన దొంగ ఎవడో నా మూలధన మెల్ల దోచుకున్నాడంటాడు. ఆంగ్లేయులు భారత దేశాన్ని ఎలా దోచుకున్నారో వ్యంగ్యంగా చెప్పాడు.

'ఆత్మ విశ్వాస సూర్యోదయంబు'లో ఆంగ్లేయులను భయంకరంగా దూషించాడు రామిరెడ్డి. 'కొంప కూలుతూ ఉంది మేలుకో, నీ తమ్ముణ్ణి

కూడా నిద్రలేపమ'ని భారత యువకులను ప్రబోధించాడు. 'మేలుకొలుపు' అన్న శీర్షికతో రాసిన మరో ప్రబోధ కవితలో 'కలలు కనవద్దు, పిచ్చి వేదాంతాలు వద్దు' అంటాడు.

"అపయశః పంకిలంబైన యాత్మ కన్న
చచ్చుటే కొంత మాన రక్షణము సుమ్ము
పారతంత్ర్య భరంబున బడలి సడలి
యదవ త్రావుడు త్రావెదో యమ్మ నివు?" అంటాడు కవి.

'రాధా కృష్ణులు' అన్న ఖండికలో రామిరెడ్డి రాధాకృష్ణుల సంవాదాన్ని వర్ణించాడు మరో యువతితో సంభోగించిన చిహ్నాలతో కృష్ణుడు రాగా ఆ గుర్తు లేమిటని రాధ అడుగుతుంది. వాటికి ఏవో కారణాలు చెప్తాడు కృష్ణుడు

'వాన కాలపు వరిచేలు', 'శైశవ స్మృతి', 'గణిక', 'రజని', 'మోహినీ ప్రకృతి', 'ఆమని నిషా', 'వసంతోదయం', 'వానాకాలపు పల్లీ జీవితము' ప్రకృతి వర్ణనాత్మకాలయిన కవితలు. గరికను సంబోధిస్తూ ఇద్దరమూ ఒకరమే నేమోనంటాడు. 'మోహినీ ప్రకృతి'లో ప్రకృతి మోహనరూపం సన్యాసిని కూడా సంసారంలో పడ వేస్తుందంటాడు. 'ఆమని నిషా' కూడా ఇటు వంటి కవితే ఆమని మత్తున చైతన్యలోకము ఆనంద పరవశమై సాగియునంటాడు. 'వసంతోదయము'లో మధుమాస ఆగమనాన్ని అందంగా వర్ణించాడు. 'వానా కాలపు పల్లీ జీవితము'లో వర్షాకాలంలో పల్లె జీవితాన్ని వర్ణించాడు

'అభిసారిక' అనే శీర్షికతో రామిరెడ్డి రెండు కవితలు రచించాడు. 'హతాశ' 'బాష్పదౌత్యము' 'అనార్కాలి' ప్రణయగీతాలు 'అనార్కాలి'లో కవి ప్రణయ ప్రాధాన్యాన్నిలా చెప్తాడు.

"ఓయి యగ్బరు షాహి ఓ కఠోరాత్మ
ప్రణయంబునకు చావే ప్రతిఫలంబేని
అవని యెల్ల శ్మశానమట్లు మార్పడదె
నీతికి చిహ్నంబు నిర్దయత్వంబె
మానవతత్వంబు మఱచిపోయితివా?"

'వాల్మీకి', 'పండిత ప్రతిజ్ఞ', 'కవి సంశయావస్థ' కవిత్వ సంబంధమైన కవితలు. వాల్మీకి మహాకవికి దువ్వూరి రామిరెడ్డి గొప్ప నివాళి పలికాడు.

"నీ ప్రతిభా వాహినికి ముందు నిల్చి
నా కవిగర్వంబు నా భావశక్తి
దుమ్ము దుమారమై తూలి పోయెడిని" అంటాడు రామిరెడ్డి

ఛాందస పాండిత్యానికీ, కవిత్వానికీ పొంతన కుదురదని 'పండిత ప్రతిజ్ఞ' ద్వారా వివరించాడు రామిరెడ్డి.

'కవి సంశయావస్థ' 1924లో రాసింది ఆ సంవత్సరమే దువ్వూరి రామిరెడ్డి 'కడపటి వీడుకోలు' రచించాడు. ఈ కడపటి వీడుకోలే తన కవిత్వానికి కడపటి వీడుకోలవుతుందేమోనన్న సందేహం కవి కెందుకో కలిగినట్లుంది. చిత్రలేఖనంమీద దృష్టిపోయింది ఈ రెండింటి తోనూ సుఖంగా భవిష్యజ్జీవితం కలలాగా గడిచిపోతుందన్న ఆశతో ఈ కవిత ముగుస్తుంది

## భగ్నహృదయము (1925-30) ః

'భగ్న హృదయము'లో తొమ్మిది ఖండికలున్నాయి కవి జీవితంలోని దుఃఖం ఈ సంపుటంలో నిక్షిప్తమయింది 1925 జులై 9న భార్య శేషమ్మ కుమార్తెను ప్రసవించిన నాలుగో రోజున జ్వరంతో మరణించింది. ఆమె స్మృతిలో రచించిన కవిత 'ప్రియా వియోగము' 12-7-1925న రాశాడు

"ఇరువురకు తప్ప నితరుల కెఱుగ రాని
మన రహస్యంబు లెవరితో ననుదునింక ?
హృదయ మంజూష నాచేత నిడి యదేల
తాళపుంజెవి నీయెుడి దాచినావు?" అని వాపోయాడు.

"వేగు మాంసంబు రీతి నావిళ్లు వాఱు
నుల్లమున తత్త్వబోధ కాలూన కలదె ?
యూరడింపులు పుండుపై నుప్పుగల్లు
ఇంక నేకాంతమే నాకు నేడుగడయ !"

అని ఏకాంతాన్ని కోరుకున్నాడు. మే 1926లో 'స్మృతి కణము' రాశాడు రామిరెడ్డి. అప్పటికీ భార్య స్మృతి వదలకుండానే ఉంది.

"కనులు మూసిన తెరచిన కానుపింతు
వింట నడయాడి నట్టులె యిందువదన

సంతత ధ్యాన లీనమౌ స్వాంతమునకు
వెలుగు చీకట్ల భేదంబు తొలగునేమొ''

1926 ఆగస్టులో కుమార్తె కుముదమ్మ కూడా విషజ్వరంతో పోయింది భార్య పోయిన బాధ ఇంకా పచ్చిగా ఉండగానే కుమార్తె మరణం రామిరెడ్డిని మరింత కుదిపి వేసింది. 'శిశువియోగము'లో

''చెట్టు వోయిన విత్తైన చిక్కెనన్న
యాసయుంగూడ నేటితో నంతరించె
నకట ! నా పూవుదోట కాడాయె నోయి
తోటమాలి వసంతుడా తొలగి పొమ్ము! '' అని దుఃఖించాడు

ఈ దుఃఖం 'కవితాచితి'ని పేర్చింది. రమ్యమైన ప్రకృతి ఛీ అనిపించింది.

''ఇట్టి మంటల నింకెట్టు లించుకైన
నవురు వెన్నెల కవిత మనంగ నేర్చు ?
నదియు కాలావధిం గాంచి యరిగెనేని
దాని చితిపైన నిర్మింతు తాజమహాలు''.

దుఃఖం కవిత్వం రాయనీయలేదు. దేవుడున్నాడా లేడా అని అనుమానం వచ్చింది. కర్మఫలమయిన, దైవాధికారమయిన ఏమైన కానీ, సంకటములు పోకమానవు, సుఖములు రాకపోవు వాటి పట్ల తటస్థంగా ఉంటాను అనుకున్నాడు 'మనోవిప్లవము'లో. కవిత్వంలో అలౌకికంగా ఉన్నా నిజజీవితంలో గట్టినేల మీద నిలబడాలనుకున్నాడు. కామ్య వస్తువులను కవిదృష్టి చూడకు అన్నాడు 'కవి యలౌకికత'లో. దుఃఖాన్ని మరచిపోలేని తన 'నిస్సహాయత'కు విచారించాడు.

ఒక యువతిని చూశాడు, పెళ్లి చేసుకుందామనుకున్నాడు. కాని సంబంధం కుదరలేదు. ప్రేమ మొదట్లోనే భగ్నమైపోయింది. 'ప్రణయబలి' గా రచించుకున్నాడు. తన ప్రణయాన్ని కాదన్నా బ్రహ్మను దూషించాడే కాని ఆమెను మాత్రం ఆశీర్వదించాడు. 1929లోనే రామిరెడ్డి రెండో పెళ్లి చేసుకున్నాడు. ఈ భగ్న హృదయానికి 'అధ్యాయాంతము' పలికాడు.

దువ్వూరి రామిరెడ్డికి గాంధీ మీద ఎంతో గౌరవం. అవతారంగా భావించాడు. 'గాంధి' అన్న ఖండికలో

"ధర్మ సంస్థాపనార్థంబు దైవ శక్తి
యుగయుగంబున జన్మించుచుండునన్న
యార్యసూక్తికి తార్కాణమైన యట్టు
లవతరించితె గాంధి మహాత్మ నీవు?" అంటాడు

'కళాప్రపూర్ణుడు' అన్న కవితలో దువ్వూరి రామిరెడ్డి వేదం వేంకట రాయశాస్త్రిగారికి నివాళి సమర్పించాడు 1945లో 'రెడ్డికుల ప్రబోధము' అన్న శీర్షికతో రెడ్డి సంఘ రజతోత్సవ సందర్భంగా విద్యాపోషణ చేయాలని రెడ్లను ప్రబోధించాడు

## మాతృశతకం (1917) :

దేశభక్తి శతకం ఇది. దేశమాత స్తవం. ఈ శతకంలో అనేక పౌరాణిక చారిత్రకాంశాలను తడిమాడు రామిరెడ్డి మునిపల్లెలు, శిష్యులకు పాఠాలు చెప్పే గురువులు, విశ్వవిద్యాలయాలు, భార్గవరాముడు, రాముడు, పాండవులు, గీత, కృష్ణుడు, చంద్రగుప్తుడు, ప్రతాప సింహుడు, కృష్ణరాయలు, బొబ్బిలి పాపారాయుడు, ఖడ్గ తిక్కన తల్లి, భార్య, తాజ్‌మహల్ నిర్మించిన శిల్పులు, అజంతా చిత్రకారులు, ఎల్లోరా శిల్పాలు, నెమలి సింహాసనం, అన్నీ ఈ శతకంలో దర్శనమిస్తాయి. మన విద్యలు, మన పౌరుషం, మన వైభవం, మన సంస్కృతి, మన కళలు అన్నీ ఎంతో ఉన్నతమైనవి ఆ స్థితి అంతా పోయి నేడు ఇంగ్లీషువారికి బానిసలుగా ఉండవలసి వచ్చింది. ప్రపంచం అనాగరికంగా ఉన్నప్పుడే మనది గొప్ప నాగరికత. ఇప్పుడు ఈ పారతతంత్ర్యం. ఈ పారతంత్ర్యం ఎట్లా పోతుంది ? విద్యా విహీనులైన పుత్రులు తల్లి దాస్యాన్ని తొలగించగలరా?

"ఏలే ముప్పది మూడు కోట్ల బలగం బింపారు నంచీవు శౌ
ర్యాలాపంబులు పల్కు చుండెదవు; విద్యాహీనులౌ పుత్రులుం
డీ లేకేమి ? స్వకీయమాతృముఖమే యెట్లుండు నంచెన్ను మూ.
ర్ఖాళుల్ పుత్రులు శత్రులైన నొకటే యర్థంబెకా మాతరో"

కవులు మాతృదాస్య విముక్తికోసం తమ కవితాస్త్రాలు సంధిస్తారా ? లేక ఇంకా ప్రణయకవిత్వం రాస్తూ కూర్చుంటారా ? అని ప్రశ్నించాడు.

"కవి రాట్తల్లజులైన నీ తనయులింకన్ స్త్రీ పాలిండ్లపై
చివురుం జెక్కులపై దృగంచలముపై చెన్నారు నూగారుపై
తవులం జిత్తము లుంతురో విజయ సంధా రౌద్ర వీరవ్రతో
త్సవ సంధాయక భావబంధరసముల్ సంధింతురో మాతరో"

ఈ శతకం నెల్లూరులో మొదటి సారి అచ్చయినపుడు ప్రభుత్వం నిషేధిస్తుందేమోననీ కవిని శిక్షిస్తారేమోనని భయ పడ్డారు. ప్రతులన్నీ నాశనం చేయవలసి వచ్చింది. తొలిముద్రణ ప్రతి విజయనగరం సంస్కృత కళాశాల గ్రంధాలయంలో ఒక్కటి మాత్రమే ఉందని రామిరెడ్డి ఒక లేఖలో చెప్పాడు. సి.వి. కృష్ణ మద్రాసులో రెండో ప్రచురణ చేయించి, ప్రభుత్వభయంవల్ల కాల్చివేశాడు. కాంగ్రెస్ ఉద్యమాలలో సభలలో ఈ పద్యాలు పాడి ప్రజలను ఉద్రూతలూగించారట.



# 5. దువ్వూరి రామిరెడ్డి అనువాద రచనలు

దువ్వూరి రామిరెడ్డి కళాశాలల్లో పెద్ద చదువులు చదువుకోలేదు. కాని స్వీయప్రయత్నంతో అధ్యయనాభ్యాసాలతో తెలుగు· మీద అధికారాన్ని సంపాదించాడు. ఇంతటితో తృప్తి పడలేదు. ఏ భాషనయినా ఇట్లాగే సాధించవచ్చు. పర్షియన్ భాషను నేర్చుకోవడం 1-11-1919న మొదలు పెట్టి 6-11-1919 నాటికి చక్కగా చదవడం నేర్చేసుకున్నాడు. అంటే కేవలం ఆరు రోజుల్లో నేర్చుకున్నాడన్న మాట. పర్షియను పఠనాన్ని అంతటితో విడిచి పెట్టలేదు. మహాకావ్యాలు చదివే స్థాయి వరకు వచ్చాడు. 1925 లోనే 'గులిస్తాన్' నుండి కొన్ని పద్యాలు అనువాదం చేశాడు.

1859లో ఎడ్వర్డ్ ఫిట్‌జెరాల్డు ఇంగ్లీషులోకి అనువదించిన తర్వాత ఉమర్ ఖయ్యాము 'రుబాయతు'కు చాలా ప్రచారం వచ్చింది. 1867లో జె.బి. నికోల ఫ్రెంచిలోకి అనువదించాడు. తరువాత ప్రపంచంలో ఎందరో కవులను రుబాయతు ఆకర్షించింది. అనేక భాషలలోకి అనువదితమయింది. తెలుగులోకి ఎందరో కవులు అనువదించారు. దువ్వూరి రామిరెడ్డి కంటె ముందే రాయప్రోలు సుబ్బారావు 'మధుకలశము' అన్న శీర్షికతో ఫిట్‌జెరాల్డు ఇంగ్లీషు అనువాదం ఆధారంగా 'రుబాయతు'ను తెలుగు చేశాడు. అయితే ఈ అనువాదం సరిగా అర్థం కావటం లేదనీ, 'తెలుగు జాతీయములలోనికి మార్చిన బాగుగ నుండు' నని సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి రామిరెడ్డిని ప్రేరేపించాడు. పిశుపాటి వేణుగోపాల్ 'రుబాయతు' పర్షియన్ ప్రతిని రామిరెడ్డికి పంపించాడు.

1925 జులై నెలలో దువ్వూరి రామిరెడ్డికి భార్యా వియోగం సంభవించింది హృదయం భగ్న మయింది దుఃఖ సముద్రంలో కొట్టుకొని పోయాడు 1926 ఆగస్టులో ఏడాది వయసున్న కుమార్తె కూడా మరణించింది భార్య, కుమార్తెల మరణంతో వికల మనస్కుడై ఉన్న రామిరెడ్డికి ఉమర్ ఖయ్యాము 'రుబాయతు', కాళిదాసు 'మేఘసందేశము' కొంత ఉపశమనం కలిగించాయి కుమార్తె చనిపోయిన కొద్ది రోజులకే ఆయన 'రుబాయతు' అనువాదం ప్రారంభించాడు. 1927 నవంబరు నాటికి నూటపది పద్యాలు రాశాడు. 1928 జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో 'పానశాల' పద్యాలు 'భారతి'లో అచ్చయ్యాయి. 1934లో 'పానశాల'కు రామిరెడ్డి విపులమైన పీఠికను రచించాడు. 1935లో 125 పద్యాలతో 'పానశాల' గ్రంథ రూపం ధరించింది

## పానశాల (1935) :

దువ్వూరి రామిరెడ్డి రచనల్లో ఆయనకు అశేషమైన కీర్తిని తెచ్చిపెట్టిన రచన 'పానశాల'. ఈ రచనకు ఆయన ఒక విశిష్టమయిన ఉపోద్ఘాతాన్ని రచించాడు. ఈ ఉపోద్ఘాతంలో మూడు భాగాలున్నాయి మొదటి భాగంలో పారసీక సాహిత్య చరిత్రనూ, పారసీక కావ్యభేదాలనూ, ప్రబంధ కవుల పోకడలనూ వివరించాడు. రెండవ భాగంలో ఉమర్‌ఖయ్యాము జీవితాన్ని, నాటి కాలపరిస్థితుల్ని వివరించాడు. మూడవ భాగంలో ఖయ్యాము కవిత్వాన్ని గురించి వివరించాడు. 'రుబాయతు' ఎట్లా ప్రచారంలోకి వచ్చిందీ, ఖయ్యాము యూరపులో వ్యాప్తి పొందడానికి కారణాల్నీ, ఖయ్యాము మత విశ్వాసాలనూ వివరించాడు. తన ఆంధ్రీకరణ నేపథ్యాన్ని గురించీ, అనువాద విధానాన్ని గురించీ తెలిపాడు.

ఉమర్‌ఖయ్యాము శాస్త్రవేత్త. కవిత్వం అప్పుడప్పుడు చెప్పినది తెలుగు కవులలో వేమనతో ఖయ్యామును పోల్చాడు రామిరెడ్డి. "ఖయ్యాము భోగి, వేమన యోగి; ఖయ్యాము శాస్త్రోపాసకుడు, వేమన ఆత్మ సాధకుడు. ఆయనది రక్తిమార్గము, ఈయనది విరక్తి మార్గము భేదమింత మాత్రము" అని విశ్లేషించాడు రామిరెడ్డి. ఖయ్యాము ఈశ్వరవాది. ఈ విషయంలో తప్ప

భారతీయ చార్వాకమతానికీ ఖయ్యాము అభిప్రాయాలకూ ఏమీ భేదం లేదంటాడు రామిరెడ్డి. ఖయ్యాము ఈశ్వరుడున్నాడన్నాడు. కాని, ఆత్మ లేదన్నాడు ఖయ్యాము భౌతిక పునరావృత్తిని చెప్పాడు. శరీరం మట్టితో ఏర్పడింది. మనిషి చనిపోయి మట్టిలో కలుస్తాడు ఆ మట్టి మళ్లీ మరో శరీర నిర్మాణానికి ఉపయోగ పడుతుంది. సృష్టి కాలబద్ధం. విధి అనివార్యం. గతం కన్నుల కట్టదు. భవిష్యదర్థం సంశయాంధ సంవృతం. వర్తమాన మొక్కటే అవశ్యభోగ్యం. స్వర్గ నరకాలు లేవు. విచారించడం వల్ల లాభం లేదు. జీవితం సుఖదుఃఖ మిశ్రిత. వీలైనంత వరకు సంతోషాన్ని అనుభవించాలి. అనివార్యమయిన మరణానికి చింతించవద్దు. దుఃఖాలు కూడా విధి బద్ధాలే కాబట్టి వాటిని ధైర్యంగా అనుభవించాలి అన్నది ఖయ్యాము మతం. ఖయ్యాము తన రుబాయీలలో ఈ అభిప్రాయాలే వ్యక్తం చేశాడు.

రుబాయి నాలుగు పాదాల పద్యం. 1, 2, 4 పాదాలకు అంత్యప్రాస ఉంటుంది. తత్వాలు, నీతులు చెప్పడానికి అనుకూలంగా ఉంటుంది. ఖయ్యాము ఎన్ని రుబాయీలు రచించాడో చెప్పడానికి ఆధారాలు లేవు. క్రీ శ. 1460 నాటి ప్రతిలో 158 రుబాయీలు, క్రీ.శ. 1528 నాటి ప్రతిలో 349 రుబాయీలున్నాయి. మరో ప్రతిలో 540 రుబాయీలున్నాయి. మనదేశంలో లభించే ప్రతుల్లో 700-900 వరకు రుబాయీ లున్నాయి. రామిరెడ్డి గారికి లభించిన రెండు ప్రతులలో ఒక దానిలో 692 రుబాయీలు, మరోదానిలో 800 రుబాయీలున్నాయి.

రుబాయి ముక్తకం. కథ ఉండదు. దేనికదే పరిపూర్ణం. వివిధ సమయాలలో రచించినవి కాబట్టి ఉమర్ ఖయ్యాము రుబాయీలలో పునరుక్తు లెక్కువగా ఉంటాయి. దువ్వూరి రామిరెడ్డి వీటిలో ఒకే విధమయిన రుబాయీలను ఏరి వాటిలో మనోహరమయిన ఒకటి రెండింటిని మాత్రమే స్వీకరించాడు. కొన్ని రుబాయీలలో ఒక్కపాదంలో మాత్రమే కొత్త భావం ఉన్నప్పుడు అటువంటి రెండు మూడు రుబాయీలను ఒక్క పద్యంగా అనువదించాడు పానశాల రచనలో దువ్వూరి రామిరెడ్డిది కేవలం అనువాదం కాదు, అనుసృజన. 'పానశాల' ప్రారంభంలో రామిరెడ్డి ఉమర్ ఖయ్యామును ప్రశంసించాడు

"ఓయీ, ఉమ్ర ఖయామ, నీవు చని యెన్నో యేండ్లు పూండ్లాయె; లే
ప్రాయంపుం జెలి సాఖియున్ ధరణి గర్భంబందు నిద్రించె; గు
ర్తే యౌవట్టక నీ నిషాపురము జీర్ణించెం గదా ! నీదు గో
రీ యైనన్ నడలున్; రుబాయతొకటే నృత్యంకమై నిల్చెడున్"

ఉమర్ ఖయ్యాం రుబాయతుకు రామిరెడ్డి నివాళి ఇది. రామిరెడ్డి 'పానశాల'లో వృత్తాలు ఎక్కువ. అక్కడక్కడా కొన్ని తేటగీతులు రాశాడు రామిరెడ్డి పద్యాలు ఏభావాన్నైనా అలవోకగా వ్యక్తం చేస్తాయి.

"నీవూ నేనను తారతమ్య మహమందేగాని భూగర్భ ర
త్నావాసంబున లేదు; దుర్జనుడు పుణ్యాత్ముండు భిక్షార్థియున్
శ్రీవాల్లభ్య ధురంధరుండు నొకటే శ్రేణిన్ సుఖాసీనులై
యా విందున్ భుజియింతు రంత గనలేమా మృత్తికాభేదముల్"

మనుష్యులలో భేదాలు ఇహంలోనే కాని మరణానంతరం భూమిలో ఏ భేదాలూ ఉండవు. రేపటి కోసం నేటి సంతోషాన్ని విడనాడ వద్దంటాడు.

"ఆసవపూర్ణమౌ కలశ మామిష ఖండము వెన్నరొట్టె ది
వ్యాసమరూప యౌవన గుణాలయ వీణియ మీటుచున్ దినా
యాసము దీర్ప నిర్ఝర వనాంతర సీమల నబ్బెనేని వ
హ్వా ! సులతాను భోగ విభవంబుల గోరెడి మూఢుడుండునే"

ఇంతకంటే కోరదగిన సుఖమేమీ లేదంటాడు. ఈ సృష్టి రహస్యాన్ని ఎవరూ తెలుసుకోలేరు. ఎంతో పాండిత్యం సంపాదించినవారు, అన్నీ తెలుసుననుకొన్న వారికి కూడా ఇది తెలియదు.

"అఖిల శాస్త్ర పురాణ తత్త్వాబ్ధులీది
పరమ విజ్ఞాన దీపమౌ పండితుండు
కాళరాత్రిని మార్గంబు గానక
యల్ల మామూలు కథ జెప్పియంతరించు"

"ఆది మధ్యాంత రహితమై యలరు చుండు
కాల యవనిక భేదింపగలమె మనము ?
ఇటకు నెందుండి వచ్చె నింకెటకు బోవు
బ్రాణియను ప్రశ్న కెవ్వాడు బదులు సెప్పు?" అంటాడు.

జీవితమంతా ఎన్నో శాస్త్రాలు చదివి రహస్యాలు తెలుసుకున్నాక తెలిసిందేమిటంటే నాకేమీ తెలియదనే. "మన జీవితంబునకు లాభము కేవల జీవితంబెకా" అని జీవితం జీవితం కోసమే తప్ప మరొకటి కాదని నిశ్చయంగా చెప్తాడు. కాలం మించి పోకముందే వెన్నెలలో పానగోష్ఠి జరపాలి. యముడు ద్వారం దగ్గర వచ్చి నిలుచున్న తర్వాత గుక్కెడు నీళ్లు కూడా తాగనియ్యడు కదా అంటాడు. మొత్తం విధి ఆడే చదరంగపు ఆటగా ఈ సృష్టిని భావిస్తాడు.

"ఇల చదరంగ; మందు జనులెల్లరు పావు;లహస్సులున్ నిశల్
దెలుపును నల్పుగళ్లు; కదలించును రాజును బంటు దక్కుపా
వుల విధి యాటకాడు పలు పోకల ద్రిప్పను గళ్ల మార్చు, న
వ్వల నొకటొక్కటిం జిదిపి వైచునగాధ సమాధి పేటికన్"

ఖయ్యాము ప్రశంసలో

"పారసి కన్న శ్రావ్యమయి పల్లవ కోమలమై సుధా రసం
బూరెడు మా తెనుంగు నుడి నొప్పిద మౌనటు నీదుభావముల్
ఏరిచి చేర్చి కూరిచితి నింపగు కావ్యము నో ఖయాయ, నీ
పేరిక యావదాంధ్ర పృథివీ స్థలి శాశ్వతమై తనర్చుతన్" అని రామిరెడ్డి ఆంధ్రదేశంలో ఖయ్యాము పేరు శాశ్వతంగా ఉండి పోతుందన్నాడు. 'పానశాల' రచనతో దువ్వూరి రామిరెడ్డి పేరు కూడ ఆంధ్రదేశంలో శాశ్వతంగా నిలుస్తుంది.

## గులాబి తోట (1944) :

ముష్రరీఫ్ ఉద్దీన్ బిన్ ముస్లిహ్‌ఉద్దీన్ పెట్టుకున్న పేరు సాదీ. 12వ శతాబ్దంలో జీవించిన సాదీ ఇస్లాం సంబంధమైన శాస్త్ర విద్యలు చదివి, లౌకికతత్వంవైపు దృష్టి మళ్లి సూఫీ సిద్ధాంతాలను మనస్సుకు పట్టించుకున్నాడు. మంగోలు దండయాత్ర వల్ల దేశం విడిచి అఫ్ఘనిస్తాన్ మీదుగా భారత దేశం వచ్చాడు. ఢిల్లీలో చాలా కాలం ఉన్నాడు. తర్వాత ఎమెన్ చేరుకుని అక్కడి నుండి అబిసీనియాకి వెళ్లాడు. అక్కడి నుండి మక్కాను దర్శించి సిరియా వెళ్లాడు. అక్కడ కొన్నేళ్లున్న తర్వాత పాలస్తీనాలో ఫ్రాంకిష్ సిపాయిలకు బందీగా దొరికిపోయి ట్రిపోలీనగరంలో బానిసగా కష్టాలు పడి ఒక మిత్రుని

దయవల్ల విముక్తుడై అతని కుమార్తెను వివాహం చేసుకున్నాడు భార్య బాధలు పడలేక మళ్లీ దేశ సంచారం చేసి డెబ్బయ్యేళ్ల వయసులో స్వదేశం చేరుకున్నాడు ఎనభయ్యేళ్ల వయసులో మరణించాడు. అనేక రచనలు చేశాడు. వాటిలో 'గులిస్తాన్' (1258), 'బోస్తాన్' (1257) అనే కావ్యాలు సుప్రసిద్ధాలు.

దువ్వూరి రామిరెడ్డి పర్షియన్ భాష నేర్చుకొన్న తర్వాత పర్షియన్ భాషలో ఆయనను ఆకర్షించిన కవి సాదీ. 'గులిస్తాన్' చదవడం మొదలు పెట్టగానే ఆయనకు దాన్ని అనువదించాలనిపించింది. 1925లోనే కొన్ని పద్యాలు రాశాడు. కాని ఇది పూర్తి కాకముందే ఖయ్యాము రుబాయతు అనువాదంలో మునిగిపోయాడు. అప్పుడప్పుడూ మళ్లీ 'గులిస్తాను' అనువాదం సాగిస్తూ వచ్చాడు. ఇది 1944 వరకూ జరిగింది.

సాదీ దేశదేశాలు తిరిగి విశేషమైన జీవితానుభవం సంపాదించాడు. విప్లవాలు చూశాడు, సంక్షోభాలు చూశాడు, బానిసలు పనిచేసే గనులు చూశాడు. రాజాస్థానాలు చూశాడు. ఈ అనుభవాన్నంతా తన రచనల్లో నిక్షేపించాడు. సాదీ రచనల్లో ప్రబోధం ప్రధానం. ఒకొక్కసారి ఈ ప్రబోధం సూటిగా నిరలంకారంగా కూడా ఉంటుంది. నిజం నిర్భయంగా చెప్తాడు.

'గులిస్తాన్' అంటే గులాబితోట. గులాబి పూలు వాడి పోతాయి. కాలానుగుణంగా ఉద్యాన శోభకూడా తరిగిపోతుంది. అయితే ఎన్నటికీ వాడని గులాబి తోటను రచిస్తానని సాదీ ఈ గ్రంథాన్ని రచించాడు. గులాబితోట చూచేవారికి, దగ్గరున్న వారికి ఆనందాన్ని కలిగిస్తుంది. 'గులాబితోట'లో ఎనిమిది అధ్యాయాలున్నాయి. స్వర్గానికి ఎనిమిది ద్వారా లుంటాయట. ఆ ఎనిమిది ద్వారాల్లాగానే ఈ ఎనిమిది అధ్యాయాలు. సాదీ ఈ కావ్యాన్ని చంపూ పద్ధతిలో అంటే గద్య పద్య మిశ్రంగా రచించాడు. ముందుగా మధురమయిన వచనంలో ఒక చిన్న కథను చెప్పి తరువాత ఒక పద్యంలో ఆ కథలోని అంతరార్థాన్ని ప్రకాశింప జేస్తాడు సాదీ.

ఈ గ్రంథంలోని మొదటి ఏడు అధ్యాయాలలో 180 కథలున్నాయి. ఎనిమిదవ అధ్యాయంలో 111 సూత్రోపదేశాలున్నాయి. సాదీ రచన లాగానే దువ్వూరి రామిరెడ్డి రచన కూడా సరళంగా సూటిగా సాగింది.

"రాజు ప్రాభవముచే ప్రజ సుఖించియును
పేదల కావరి పృథ్వీశ్వరుండు,
గొల్లండు గొర్రెల కొరకు నేర్పడియె
గొల్లని సేవలకై గొర్రెలు గాదు"

"ప్రతినిమేషంబు చిత్తంబు బయలు చనగ
దపసి నిర్మల స్వాంతుడై తనియ గలడె ?
భోగభాగ్య వాణిజ్యముల్ పాదలు కొనియు
దైవ సంసక్త హృదయుండు తపసి యగును"

పై పద్యాలు దువ్వూరి రామిరెడ్డి సరళ రచనకు ఉదాహరణలు.

## పండ్ల తోట :

దువ్వూరి రామిరెడ్డి తుది రచన ఇది పర్షియన్‌లో సాదీ మహాకవి రచించిన 'బోస్తాన్' కావ్యానికి ఇది తెలుగు సేత ఈ కావ్యానువాదాన్ని రామిరెడ్డి పూర్తి చేయలేక పోయాడు. మూల గ్రంథంలో పది అధ్యాయాలున్నాయి. రామిరెడ్డి నాలుగధ్యాయాల వరకు మాత్రమే అనువదించాడు. సాదీ ఈ కావ్యరచనా హేతువును చెప్తూ ఈ కావ్యాన్ని కండచక్కెర కంటె తీయనైనదని చెప్పాడు రాజసౌధంగా దీన్ని నిర్మించేటప్పుడు దశ శిక్షా ద్వారాలను ఏర్పరచానన్నాడు. ఈ ద్వారాలు దశ అధ్యాయాలు. రామిరెడ్డి అనువదించిన నాలుగధ్యాయాలలో మొదటిది న్యాయం, అభిప్రాయం, ప్రభుత్వ నిర్వహణం, రెండవది అనుగ్రహం; మూడవది ప్రేమ; నాల్గవది వినయం.

దువ్వూరి రామిరెడ్డి మధురమైన ద్విపదలలో 'పండ్లతోట' కావ్యరచన చేశాడు ఉపాఖ్యానాలు, నీతికథలు, సూత్రాలు, హితవులతో నిండి ఉంది ఈ కావ్యం.

"మల్లెలు గొనలేవు ముళ్లను విత్తి"

"ప్రతి దినంబును పస్తుపడు లోభి కంటె
తిని మంచి యొనరించు మనుజుండె మేలు"

"- చేతలు లేని మాటలు చూడ
పుచ్చిన గుంజను పోటి యిడ్డట్లు"

వంటి సూక్తులు ఈ గ్రంథంలో కోకొల్లలు. నాలుగవ అధ్యాయం చివర "అప్రియ సత్యంబునైన ఆతండు ఎంత తీపొదవగ నెత్తి చూపించె" అన్న వాక్యం పాదీ కవి హితోక్తులలోని సత్యాన్ని వెల్లడిస్తుంది.

## Voice of the Reed (1924) :

దువ్వూరి రామిరెడ్డి తన కవితలలో కొన్నింటిని ఇంగ్లీషులోకి అనువదించి Voice of the Reed అన్న శీర్షికతో ప్రచురించాడు. సంస్కృతీ పరమైన అంశాలు, వాతావరణం అనువాదానికి అంత తేలికగా లొంగవు. అయినా దువ్వూరి రామిరెడ్డి రవీంద్రనాథ టాగూరు పద్ధతిలో తన కవితలను ఇంగ్లీషులోనికి స్వేచ్ఛానువాదం చేశాడు. దీని ప్రచురణకు ముందు సవరణ, అభిప్రాయం కోసం ప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత జేమ్స్ జి కజిన్సుకు పంపించాడు భారతీయులు రాసిన ఇంగ్లీషు రచనలకు ఉపోద్ఘాతం రాయకూడదని నియమం పెట్టుకున్న కజిన్సు ఈ అనువాదాలలో అవసరమయిన చిన్న చిన్న సవరణలను చేయడమే గాక, ఉపోద్ఘాతాన్ని కూడా రచించాడు. "మహోత్తమమయిన దేశభాషా కవిత్వానికి ఇది ఆహ్లాద కరమైన అనువాదం" కావడమే ఆయన మనసు మార్చుకోవడానికి కారణం. అంతేకాక తన ఉపన్యాస యాత్రలలో చదివి వినిపించడం కోసం రామిరెడ్డి కవితలను పంపించవలసిందని కజిన్సు కోరాడు. తన తొలిపలుకు మీద కాక రామిరెడ్డి కవిత్వం తన శక్తి మీద తాను నిలిచి తీరు తుందని కూడా ఆయన అన్నాడు.

దువ్వూరి రామిరెడ్డి తన 'కడపటి వీడుకోలు' ను 'The last farewell' అన్న పేర ఇంగ్లీషులోకి అనువాదం చేశాడు, కాని ఇది ప్రచురణ కాలేదు.



# ౬. దువ్వూరి రామిరెడ్డి నాటక రచనలు

దువ్వూరి రామిరెడ్డి అయిదు రూపకాలు రచించాడు. వీటిలో నాలుగు నాటకాలు. ఒకటి ఏకాంకిక. ఆయన మొదటి నాటకం 'కర్షక విలాసము' సాంఘిక నాటకం. రెండవ నాటకం 'సీతావనవాసము' పౌరాణికం. మూడవ నాటకం 'కుంభరాణా' (మీరాబాయి) చారిత్రకం. నాలుగవ నాటకం 'మాధవ విజయం' పౌరాణిక, చారిత్రక, సాంఘిక లక్షణాల సమ్మిశ్రం; నాటిక 'కాంగ్రెస్ వాలా' సాంఘికం.

## కర్షక విలాసము (1917) :

సంస్కృత నాటకాల పద్ధతిలో నాంది ప్రస్తావనలతో ప్రారంభమయింది. ఇంగ్లీషు నాటకాల పద్ధతిలో అంకాలు రంగాలుగా విభక్తమయ్యాయి. సంస్కృత నాటక పద్ధతిలో విష్కంభాదులున్నాయి. కర్షక విలాసము అయిదంకాల నాటకం. 1917లో రెడ్డి జన మహాసంఘం తొలి సమావేశంలో ఈ నాటకాన్ని ప్రదర్శించారు. రామిరెడ్డి ఈ నాటకాన్ని పదిరోజుల్లో రాశాడు.

ఈ నాటక నాయకుడు రామచంద్రారెడ్డి. ఉత్తముడు, సంఘ సంస్కరణ పరుడు. చదువు ప్రాధాన్యాన్ని గుర్తించినవాడు. రైతులు బాగుపడడానికి తక్కువ వడ్డీకి డబ్బు అప్పు ఇవ్వడానికి పరపతి సంఘాన్ని పెట్టాడు. గ్రంథాలయం ప్రారంభించాడు. పాఠశాల స్థాపించాడు. వెంకారెడ్డి ఎక్కువ వడ్డీలకు డబ్బిచ్చి, దొంగ లెక్కలు రాయించి, దొంగ దస్తావేజులు సృష్టించి డబ్బు సంపాదిస్తాడు. దొంగ సొమ్ములు కొంటాడు. గుమాస్తా నరసయ్య

రకరకాలుగా వెంకారెడ్డి వద్ద డబ్బు కొట్టేస్తూ ఉంటాడు. వెంకారెడ్డి తమ్ముడు వెంకటరెడ్డి పట్నంలో చదువుకుంటూ ఒక వేశ్య మోసంలో పడి జబ్బులు తెచ్చుకుంటాడు. వెంకారెడ్డి తన దుర్మార్గాలకు అడ్డు అని రామచంద్రారెడ్డి మీద చేతబడి చేయించడానికి ప్రయత్నించి విఫలుడవుతాడు.

రామచంద్రారెడ్డి అవ్వ జబ్బుపడి ఆచార్యులను పిలిపిస్తుంది. 'మెళ్లోతీగ, తాళిక పూసలు ఇస్తాను. పరంపదం ఇప్పించ'మంటుంది. పొలం రంగనాయకస్వామికి ఇస్తానంటుంది. రామచంద్రారెడ్డి అడ్డుపడి ఆమెను ఒప్పించి పొలం గ్రంథాలయానికి, పాఠశాలకు ఇప్పిస్తాడు.

నాటకాంతంలో రామచంద్రారెడ్డి సన్యాసి అవుతాడు. రెడ్డి సంఘ సంస్కారమే తన జీవిత లక్ష్యమని చెప్తాడు.

దువ్వూరి రామిరెడ్డి తొలినాటకం కాబట్టే 'కర్షక విలాసము'లో నాటక శిల్పం అంతగొప్పది కాదు. నాటకంలో కథకు ఒక క్రమ నిర్మాణం లేదు. వివిధ సన్నివేశాలకు సంబంధంలేదు. దేనికదేగా ఉంటుంది. దువ్వూరి రామిరెడ్డికి ఆనాడున్న అభిప్రాయాలను చెప్పడానికి మాత్రమే ఈనాటకం ఉపయోగ పడింది. ఈ అభిప్రాయాలను చెప్పడం కోసం కొన్ని సన్నివేశాలను, పాత్రలను కల్పించాడు.

లంబోదర శాస్త్రి పాత్రను ప్రవేశ పెట్టి నాటి బ్రాహ్మణ పండితులకు ఇతర కులాలవారి రచనలపై గౌరవం లేదన్న విషయాన్ని వ్యక్తం చేశాడు. లంబోదరశాస్త్రి తన కవిత్వం ముందు పూర్వకవుల కవిత్వం ఎందుకూ పనికిరాదని కోతలు కోస్తాడు. సొంతంగా తగిలించుకున్న బిరుదులను అప్ప జెప్పుకుంటాడు. ఇతర కులాలవారు చదువుకోవడాన్ని, కవిత్వం రాయడాన్ని వ్యతిరేకిస్తాడు. రామకృష్ణారెడ్డి అనే యువకవి రచించిన కావ్యాన్ని ముట్టుకోవడానికి కూడా నిరాకరిస్తాడు. కవిత్వం అంటే నాలుగు పాదాలూ ఏక సమాసంగా ఉండాలని చెప్తాడు. రామచంద్రారెడ్డి ఈ వాదాన్ని ఖండిస్తాడు. 'కావ్యము సర్వజన సామాన్యమై యుండ వలయును; పద్యములు లలిత పదగుంభన గల్గి రసవంతములై యుండవలయును; ఆంధ్రభారత శైలి స్పృహ ణీయము' అని తన అభిప్రాయం చెప్తాడు. దువ్వూరి రామిరెడ్డి అభిప్రాయం ఇదే.

వైష్ణవాచార్యుల పాత్ర ద్వారా భక్తుల అమాయకత్వం ఆసరాగా డబ్బు సంపాదించే ఆచార్యుల కుహనా తత్వాన్ని విమర్శించాడు.

వేశ్యల మోసాలలో పడి చదువు, వళ్ళూ చెడగొట్టుకొనే యువకులను విమర్శించాడు.

## సీతావనవాసము (1921) ః

'కర్షక విలాసము' లాగానే 'సీతా వనవాసము' కూడా సంస్కృత నాటకాల పద్ధతిని అనుసరించి రచించిన నాటకం. ఈ నాటకంలో నాంది, విష్కంభాలు, భరత వాక్యం ఉన్నాయి. ప్రస్తావన మాత్రం లేదు. 'సీతా వనవాసము' ఎనిమిది అంకాల నాటకం. రామిరెడ్డి అంకాలను స్థలాలుగా విభజించాడు.

కధ ః

లంకా నగర దుస్థితికి శూర్పణఖ విచారిస్తుంది. తన వల్లనే రాక్షసకుల వినాశనం జరిగిందన్న రాక్షసస్త్రీల దూషణలను ఆమె అంగీకరించదు. విభీషణుడే ఈ దుస్థితికి కారణమంటుంది రాముణ్ణి మోసగించి అతని చేతనే సీతను అడవులకు పంపించి రాముడు గోడుగోడున దుఃఖించినప్పుడు చూచి ఆనందిస్తాననుకుంటుంది. ఆ ప్రయత్నానికి పూనుకుంటుంది. నిండుగర్భిణి అయిన సీత ఊర్మిళతో వనవిహారం చేస్తూ దండకారణ్యంలో శూర్పణఖ తనను మింగడానికి రావడం, బంగారు జింకమోసం, రావణుని బారి నుండి తనను రక్షించడానికి జటాయువు ప్రాణం వదలడం గుర్తుకు వచ్చి మూర్ఛపోతుంది రాముడు వచ్చి ఓదారుస్తాడు సీత వనప్రదేశాలు చూడాలన్న తన కోరికను తెలుపుతుంది. రాముడు అంగీకరిస్తాడు.

ఋష్యశృంగుడు తను చేసే యజ్ఞానికి ఆహ్వానం పంపుతాడు సీత నిండుగర్భిణి కాబట్టి ఆమె రాలేదనీ, ఆమెకోసం రాముడు కూడా అయోధ్యలోనే ఉండాలనీ ఆయన సందేశం పంపుతాడు లవణాసురుని వల్ల బాధలు పడ్డ మునులు రామునితో మొరపెట్టుకుంటారు. లవణాసురుని చంపడానికి రాముడు శత్రుఘ్నుని పంపిస్తాడు

భద్రుడు రామునికి లోకాపవాదం వినిపిస్తాడు. శోక సంతప్తుడయిన రాముడు లక్ష్మణుని పిలిచి సీతను ఋష్యాశ్రమంలో విడిచి రమ్మంటాడు

లక్ష్మణుడు సీతను అడవిలో విడిచి రాముని మాటలు చెప్తాడు. సీతను రక్షింపమని వన దేవతలను ప్రార్థించి లక్ష్మణుడు తిరిగి వెళ్తాడు. వాల్మీకి అడవిలో సీతను చూసి యోగదృష్టి ప్రభావంతో విషయం తెలుసుకొని ఓదార్చి ఆశ్రమానికి తీసుకొని వెళతాడు.

రాముడు దుఃఖసముద్రంలో మునిగి పోతాడు, వసిష్ఠుడు ఓదారుస్తాడు. లక్ష్మణుడు తిరిగివచ్చి రామాజ్ఞను నిర్వహించినట్లు చెప్తాడు.

కుశలవులు సింహపు కొదమలతో ఆటలాడుతుంటారు. వాల్మీకి నుండి బాణ విద్య నేర్చుకుంటారు. రాముడు అశ్వమేధ యజ్ఞానికి మునులను ఆహ్వానించడానికి యజ్ఞదత్తుని పంపుతాడు. వాల్మీకి రామాయణ రచన విషయం లవుని ద్వారా యజ్ఞదత్తుడు తెలుసుకుంటాడు.

కుశలవులు యజ్ఞాశ్వాన్ని పట్టుకుంటారు. లవుడు సమిధలు తీసికొని ఆశ్రమానికి వెళతాడు. లక్ష్మణుడు సైన్యంతో వస్తాడు. కుశుని యాగాశ్వం విడవమంటాడు. వాగ్వాదం జరుగుతుంది. ఏకాంత ప్రదేశానికి వెళ్లి, యుద్ధం చేస్తారు. కుశుడు మూర్ఛపోతాడు. కుశుని భుజం మీద వేసుకొని లక్ష్మణుడు అయోధ్యకు పంపబోతాడు. విషయం తెలుసుకొని లవుడు వచ్చి లక్ష్మణుని నిలువరిస్తాడు. కుశుడు మేలు కొంటాడు. లవుడు అస్త్రం సంధిస్తాడు. వాల్మీకి వచ్చి ఆపుతాడు.

వాల్మీకి సీతను, కుశలవులను తీసికొని అయోధ్యకు వెళతాడు. యజ్ఞశాలలో కుశలవులు, రాముడు పరస్పర సందర్శన, సంస్పర్శనాలకు ఆనందపడతారు. ఇంతలో విభీషణుడు శూర్పణఖను జుట్టు పట్టుకొని ఈడ్చుకొని వస్తాడు. శూర్పణఖ తానే సీతమీద అపవాదాలను ప్రచారం చేశానని తప్పు ఒప్పుకొని క్షమించమని రాముని వేడుకుంటుంది. రాముడు క్షమించి విడిచి పెడతాడు.

ప్రజలు సీతను పునర్గ్రహణ యోగ్య అని అంగీకరిస్తారు. రాముడు కుశలవులు తన కుమారులే అని తెలుసుకుంటాడు. సీత వస్తుంది. సీతాసహితుడుగా అశ్వమేధయాగం చేయమని ఋషులు రాముని ఆశీర్వదిస్తారు. సీతారాముల పునఃసంయోగం జరుగుతుంది.

దువ్వూరి రామిరెడ్డిపై భవభూతి ప్రభావం ఈనాటక రచనలో బాగా కనిపిస్తుంది. సీత అడవులకు పోవలసి రావడానికి శూర్పణఖ కారణమని రామిరెడ్డి కల్పన చేశాడు. ఆ విధంగా నిజం తెలిసి మళ్లీ సీతా రాముల కలయిక జరగడానికి ప్రణాళిక వేశాడు. కథను సుఖాంతం చేశాడు. ఉత్తర కాండలోని శంబూక వృత్తాంతాన్ని రామిరెడ్డి విడిచి పెట్టాడు.

ఈ నాటకంలో దాదాపు వంద పద్యాలున్నాయి. కొన్ని సుదీర్ఘ స్వగతాలున్నాయి. రామిరెడ్డి ఈ నాటకంలో అందమయిన సన్నివేశాలను కల్పించాడు.

## కుంభరాణా (మీరాబాయి) (1924) :

దువ్వూరి రామిరెడ్డి 'కుంభరాణా' నాటకాన్ని తొమ్మిది రోజుల్లో రచించాడు. ఈ తొమ్మిది రోజులూ "తీవ్రమైన కుంభరాణా జీవితమును నేను స్వయముగ ననుభవించితిని. కలలో కూడా నన్ను కుంభరాణా వదలిన వాడు కాడు... ఈ నాటకము వ్రాయుచుండినపుడు నాకు కలిగిన భావోద్రేకము, ఆందోళన మరియే కావ్యము వ్రాసినపుడును కలుగలేదు. అప్పుడు నా స్నేహితులెవరైనను నన్ను చూచియుండిన యెడల నాకు పిచ్చిపట్టినదని తప్పక యూహింతురు", అని ఆయనే డైరీలో రాసుకున్నాడు. అంత భావోద్వేగంతో రామిరెడ్డి ఈనాటకం రాశాడు. నాందితో మొదలయిన ఈ నాటకాన్ని రామిరెడ్డి అంకాలుగా విభజించలేదు. స్థలాలుగా విభజించాడు వీటిని దృశ్యాలనవచ్చు. ఈ నాటకంలో పదకొండు స్థలాలున్నాయి. సీతావనవాసములో లాగాకాక ఈ నాటకంలో పద్యాలు చాలా తక్కువ.

### కథ :

మహాభక్తురాలు మీరా దర్శనానికి దేశం నలుమూలల నుండీ యాత్రికులు ఉదయపూరు వస్తూఉన్నారు. ఆ యాత్రికులలో తాన్‌సేన్ ఒకడు. కృష్ణమందిరానికి వచ్చి గానం చేస్తుంది మీరా. ఆ గానం విని 'నేనిక గాయక సార్వభౌముడను కాను నా గర్వము నేల గరచినది. నా గాన నైపుణ్యము తృణ ప్రాయమైనది మీరాబాయి బ్రతికి యున్నంత వరకు లోకమున మరియెవ్వరును గాయక సార్వభౌములు లేరు' అనుకుంటాడు తాన్‌సేన్

ఢిల్లీ వెళ్లి అక్బరుకు ఈ విషయం చెప్తాడు. ఒక మీరా పాటవినిపిస్తాడు అక్బరు మీరాను దర్శించాలని నిర్ణయించుకుంటాడు. రాణాకు అక్బరు అంటే విపరీతమైన ద్వేషం. ఉదయపూరు పోవడం ఎలా ? మీరా దర్శన వాంఛ అక్బరు, తాన్‌సేన్‌లు హిందూ యాత్రికుల వేషంలో ఉదయపూరు వెళ్లేట్లు చేస్తుంది.

మీరా భక్తిని రాణా ఉన్మాదంగా తీసుకుంటాడు. సామాన్యురాలిగా ఉదయపూరు వీధుల్లో తిరగడాన్ని నిషేధించాడు. అంతఃపురంలోనే ఉంచి వైద్యం చేయించడానికి పూనుకున్నాడు. ఉదయపూరు చేరుకున్న అక్బర్, తాన్‌సేన్‌లకు ఈ విషయం పాంథశాలలోనే తెలుస్తుంది. వైద్యులుగా నయితే మీరాను చూడవచ్చునని తెలుసుకుంటారు. వైద్యుల వేషంలో అంతఃపురం చేరుకుంటారు. మీరా గానం వింటారు. మీరాకు ప్రపంచమంతా కృష్ణమయంగా గోచరిస్తుంది. కృష్ణునికి సమర్పించమని మీరా దోసిట్లో అక్బర్ ఒక హారాన్ని, తాన్‌సేన్ పూలమాలనూ వేస్తారు హారం కింద పడుతుంది దాన్ని దాసి దొంగిలిస్తుంది. సుశీల అనే ఈ దాసి రాణిగారి అలంకారమందిరంలో మెడలో హారం వేసుకొని కలలుకంటూ పైకే మాట్లాడుతూ ఉంటుంది ఇది మరోదాసి వాసంతిక గమనిస్తుంది.

మీరా విషయంలో మనస్సంక్షోభం పొందుతూవున్న రాణా వద్దకు అంతఃపురాధికారి బలవంతరావు వచ్చి ఏదో భూతవైద్యాలు చేయించమని సలహా యిస్తాడు. రాజు మత ప్రచారం చేయకూడదని విధించిన నిషేధం ప్రజలలో వ్యతిరేకతను కలిగిస్తూన్నదని చెప్తాడు. గత దినం ఎవరో ఇద్దరు విదేశీ వైద్యులు రాణిని దర్శించారనీ, తరువాత రాణి గారి దాసి ఒక అమూల్యమైన హారాన్ని ధరించి కనిపించిందనీ చెప్తాడు. రాజు దాసీని పిలిపిస్తాడు. హారం తీసుకొని ప్రశ్నిస్తాడు మంత్రులను పిలిచి విచారణ ప్రారంభిస్తాడు ఈ విచారణలో వచ్చిన వైద్యులలో అక్బరున్నాడని తేలుతుంది న్యాయమూర్తిగా తానే విచారణ జరుపుతానని రాణా అంతఃపురానికి వెళతాడు మీరాకు మరణ శిక్షవిధిస్తాడు. మంత్రులు అంగీకరించరు వారికీ మరణశిక్ష విధిస్తాడు. సైన్యాధిపతి అంగీకరించడు. రాజును అతని విశ్వాసపాత్రుడయిన కుమారసింహుడు తప్ప అందరూ విడిచి వెళతారు. మీరాకు మరణ దండన పత్రాన్ని రాసి తెమ్మంటాడు రాణా కుమార సింహుణ్ణి అతడూ సందేహిస్తాడు.

ఆమే ఆత్మ హత్య చేసుకోవాలని రాసి తెమ్మంటాడు. కుమారసింహుడు తెస్తాడు. అతికష్టం మీద సంతకం చేసి మీరాకు పంపిస్తాడు. మీరా ప్రాణత్యాగం చేసేవరకు కుమార సింహుణ్ణి అంగరక్షకుడుగా నియమిస్తాడు రాణా.

తాన్‌సేన్ అక్బరులు ఉదయపూరులోనే ఉండి ఈ మరణశిక్ష విషయం తెలుసుకుంటారు. దీనికంతా తానే కారణమని అక్బర్ విచారిస్తాడు. మీరా బృందావనానికి పోతూ ఉంటుంది. ఆమెను మీరాబాయిగా తెలుసుకొని ఆమె మరణదండనకు కారకుడయిన తనను క్షమించమని వేడుకుంటాడు అక్బరు. అనుసరిస్తూ ఉన్న కుమారసింహుడు అక్బరు విషయాన్ని రాణాకు తెల్పడానికి వెళతాడు. మీరా పాడుకుంటూ వెళుతుంది. కుమారసింహుడు అక్బరు ఉదయపురములోనే ఉన్న విషయాన్ని రాణాకు తెలియజేస్తాడు. అక్బరును చంపి అతని రక్తంతో తడిసిన రుమాలును తెమ్మని తనరుమాలు నిచ్చి కుమార సింహుణ్ణి పంపుతాడు రాణా. తానే చంపాలన్న కోరికతో కత్తి తీసుకొని వెనుకనే బయల్దేరతాడు.

కుమార సింహుడు అక్బరు కనబడక వెదుకుతూ చీకటిలో రాణానే అక్బరు అనుకొని పొడుస్తాడు. తప్పు తెలిసి ఆత్మహత్య చేసుకుంటాడు. అక్బర్ తాన్‌సేన్‌లు అక్కడకు వస్తారు. మీరా, అక్బరులు నిరపరాధులని రాణా తెలుసుకుంటాడు. మీరా యమునలో మునిగిపోయిందని తెలుసు కుంటాడు. మీరాను క్షమించమని వేడుకుంటూ మరణిస్తాడు

'కుంభరాణా' విషాదాంత నాటకం. ఈ నాటకం చారిత్రకం కాదని రామిరెడ్డే చెప్పాడు. లోకంలో ప్రచారంలో ఉన్న కథలు కొన్ని ఈ నాటకానికి ఆధారాలు. చారిత్రకాంశాన్ని నాటకకర్త తనకు అనుకూలంగా మార్చుకోవచ్చు నన్నాడు రామిరెడ్డి. ఈ నాటకం విషాదాంతం కావడానికి రాణా, మీరా లిద్దరూ కారణమే. రాణా బలహీనత అతని అనుమాన స్వభావంలో ఉంది. రాణా ఉత్తముడే కాని తన వంశ మర్యాదల పట్ల అతనికి మూర్ఖమైన పట్టుదల ఉంది. మీరా అకళంక భక్తురాలు. అక్బరు అనాలోచితంగా వదలిన హారం రాణా అనుమానాన్ని నిశ్చయం చేసింది. రాణా ఘోరమయిన మరణం పొందాడు. మరణించే ముందు సత్యం తెలుసుకొన్నాడు.

కుంభరాణా నాటకాన్ని చూసినవారు దీన్ని ఉత్తమ తరగతి విషాదాంత నాటకంగా గుర్తించారు. ఈ నాటకాన్ని విమర్శిస్తూ 'రసలుబ్ధుడు' అనే పేరుతో

ఎవరో రాసిన వ్యాసానికి 'కళాప్రియుడు' అనే పేరుతో రామిరెడ్డి సమాధానం రాశాడు.

## మాధవ విజయము (1925) ః

'మాధవ విజయము' కు రామిరెడ్డి నాందిని కూడా రాయలేదు కుంభరాణాలాగానే ఇందులో కూడా స్థల విభాగాలే 14 స్థలాలుగా విభజించాడు.

## కథ ః

హోమనగరానికి రాజు రఘుపతి వర్మ. అతని తమ్ముడు విజయ వర్మ. విజయవర్మ అన్నను చంపి రాజ్యం హస్తగతం చేసుకుంటాడు. రఘుపతి వర్మ కొడుకు మూడేళ్ల వాడు మాధవవర్మ అనే పేరుతో వసంతపుర రాజు శాంత వర్మ దగ్గర పెరుగుతాడు రాజశేఖరుడు శాంతవర్మకొడుకు మాధవ వర్మ అంటే పడదు. మనోరమ శాంతవర్మ కూతురు. మాధవ వర్మను ప్రేమిస్తుంది.

సమరసేనుడు విజయ వర్మ సేనాని. దురాశాపరుడు. విజయవర్మ రహస్యాలు తెలుసుకాబట్టి వాటిని ఉపయోగించి ఉన్నత పదవులు పొందే ప్రయత్నం చేస్తాడు. విజయవర్మ మనోరమను పెళ్లి చేసుకొని, రాజశేఖరుని చంపి వసంతపుర రాజ్యాన్ని కూడా హస్తగతం చేసుకోవాలని ఎత్తు వేస్తాడు. పెళ్లి స్థిరపరచుకొంటాడు. మాధవ వర్మను చూచి తన అన్న కొడుకేనేమోనన్న అనుమానం కలిగి అతణ్ణి చంపాలనుకుంటాడు.

వేటలో గాయపడిన రాజశేఖరుని పాతాళ గృహంలో బంధించి, రాజశేఖరుని హత్యానేరాన్ని మాధవవర్మపై పెట్టి మరణశిక్షపడేట్లు చేస్తాడు విజయవర్మ మాధవ వర్మ చెల్లెలు మాలతి పాతాళ గృహంలో రాజశేఖరుని చూచి ప్రేమిస్తుంది. అతన్ని చెరవిడిపిస్తుంది. వెంటనే వాళ్లు వసంతపురం చేరుకొని మాధవ వర్మ శిక్ష తప్పిస్తారు. మాధవ వర్మ గండ్రగొడ్డలి తీసుకొని విజయవర్మను చంపడానికి పరుగెత్తుతాడు.

మాధవ వర్మ - మనోరమ, రాజశేఖరుడు - మాలతి వివాహాలతో కథ ముగుస్తుంది.

రామిరెడ్డి రచించిన సుఖాంత నాటకం ఇది. ఒక జానపద చిత్రం లాగా ఉంటుంది పౌరాణిక, చారిత్రక, సాంఘిక వాతావరణ సమ్మిశ్రంగా రాసిన నాటకంగా దీన్ని పి.ఎస్ ఆర్ అప్పారావు అభివర్ణించాడు.

## కాంగ్రెస్ వాలా (1935) :

ఇది రెండు స్థలముల (దృశ్యాల) ఏకాంక నాటకం. నాటకమంతా వచనంలోనే ఉంది. నాందీ ప్రస్తావనలు కాని, భరత వాక్యం కాని లేదు. ఆధునిక సాంఘిక నాటకం అనవచ్చు. భాషకూడా వాడుక భాష.

## కథ :

నెల్లూరులో లాల్‌గుడి వెంకటేశయ్యరు కాఫీహోటలులో రంగారావు, కల్యాణరెడ్డి, వెంకటరెడ్డి అనేవాళ్లు కలసి కొంటారు. రంగారావు శాంతి నికేతనంలో చదువుకొనే విద్యార్థి. కళ్యాణరెడ్డి అరవిందా శ్రమవాసి. వెంకటరెడ్డి కాంగ్రెస్ వాలా.

రంగారావు రవీంద్రుని గురించీ, కల్యాణరెడ్డి అరవిందుని గురించీ గొప్పగా మాట్లాడతారు. గాంధీని విమర్శిస్తారు. వెంకటరెడ్డి గాంధీని సమర్థిస్తాడు. కళ ` గురించీ, అర విందుని గురించీ వెంకట రెడ్డి అభిప్రాయాలు వారికి నచ్చవు. కాంగ్రెసువారిని విమర్శిస్తారు. అంతలో పొరుగూరు నుండి వచ్చిన ఒక స్త్రీ, చంటి బిడ్డతో కలరా వచ్చి సత్రంలో పడిపోయిందని ఒక కాంగ్రెసు వాలంటీరు వచ్చి వెంకటరెడ్డికి చెప్తాడు. వెంకటరెడ్డి ఆ వాలంటీరును డాక్టరు దగ్గర మందు తెమ్మని పంపి, పాలు తీసుకొని సత్రం వైపు వెళతాడు. ఆ స్త్రీకి సేవచేస్తాడు. పసిబిడ్డ ఏడుస్తుంటే ఒక పల్లెటూరి స్త్రీ భర్త వద్దంటున్నా వినకుండా బిడ్డకు పాలిస్తుంది. నాగరికులు దూరంగా తొలగిపోతున్నా నిర్భయంగా మానవత్వం చూపిన ఆ స్త్రీకి వెంకట రెడ్డి చేయెత్తి నమస్కరిస్తాడు.

అప్పటి వరకూ ఇదంతా ఒక తమాషాగా చూస్తూ ఉన్న రంగారావు, కల్యాణ రెడ్లు కదలి పోతారు. కాంగ్రెసుకు జయం పలుకుతారు.

ఈ ఏకాంకికలో కాంగ్రెసు వాదుల చిత్తశుద్ధినీ, త్యాగదీక్షనూ, సేవానిరతినీ రామిరెడ్డి నిరూపించాడు. రామిరెడ్డి జాతీయాభినివేశం వ్యక్తమయింది ఇందులో.

★ ★ ★

# 7. విమర్శకుడుగా దువ్వూరి రామిరెడ్డి

కవి సృష్టికి ప్రతిసృష్టిచేసే సృష్టికర్త. విమర్శకుడు సహృదయుడై కవి రచనలను విశ్లేషించే వాడు. లాక్షణికుడు కవుల రచనలను పరిశీలించి వాటిలోని సమానధర్మాలను కావ్యలక్షణాలుగా క్రోడీకరించేవాడు. కవి, విమర్శకుడు, లాక్షణికుడు ఈ ముగ్గురూ ఒకరిలో మూర్తీభవించడం అరుదుగా జరుగుతుంది.

కవి భావుకుడు. ఒకానొక భావావేశం ఆవహించినపుడు కావ్యసృష్టికి పూనుకుంటాడు. కవి భావుకతతో సహానుభూతి పొందగలిగిన సామర్థ్యంతోపాటు వివేచనాత్మకమైన ఆలోచన విమర్శకునికి ఉండాలి. లాక్షణికునికి పాండిత్యంతోపాటు కావ్య ధర్మాలను గుర్తించ గలిగిన సూక్ష్మ దృష్టి ఉండాలి. సృజనాత్మకత కవికి సహజ లక్షణం. విమర్శకునిలోనూ, లాక్షణికునిలోనూ కూడా ఈ సృజనాత్మకతా లక్షణం ఉన్నప్పుడు మరింత రాణిస్తారు.

దువ్వూరి రామిరెడ్డి ప్రతిభావంతుడయిన కవి. ఆలోచన కలిగిన విమర్శకుడు. కావ్య విశిష్ట ధర్మాలను గుర్తించగలిగిన లాక్షణికుడు.

విమర్శకుడు ఎట్లా ఉండాలో రామిరెడ్డి "విమర్శకుడు' అనే పద్య వ్యాసంలో తానే వివరించాడు. ఈ పద్యవ్యాసం డెబ్భైపాదాల చంపక మాలిక.

విమర్శకుడు తాను కవి కంటే పై స్థానంలో ఉన్నానని అనుకోకూడదు. కావ్యాన్ని ముక్క ముక్కలుగ కోసి చూడకూడదు. "కవి అగాధ హృదంబుధి

గర్భ గుప్త రత్న నిచయమున్ బదింబదిగ తత్తట మందు చరించి" పరిశీలించాలి. ఈర్ష్య ఉండ కూడదు.

> "... ఒక కావ్యము నందున నొప్పుదప్పులం
> గనిరసముల్ గణించి, యెనకమ్మగు భావములం దలంచి శో
> భను గమనించి, శిల్పకళా పద్ధతి గాంచియు, నౌచితిం గనుం
> గొని, కవిచిత్త మారసియు, క్రోధముబాసి విశేష శాంత భా
> వనియతితో విమర్శనము వ్రాసిన నయ్యది మార్గ సూచియై
> తనరును..."

విమర్శ కవి మారకాస్త్ర లీల కాకూడదు, కళాపరిపూర్తికి దారి చూపాలి.

తన యీ అభిప్రాయాలకు అనుగుణంగానే దువ్వూరి రామిరెడ్డి విమర్శక పాత్రను నిర్వహించాడు. విమర్శకుడుగా దువ్వూరి రామిరెడ్డి పాతకొత్తల మేలు కలయికగా కనిపిస్తాడు. ప్రాచీన ఆలంకారికుల కావ్యలక్షణాలను గౌరవించాడు. అదే సమయంలో కొన్ని సందర్భాలలో వారి సిద్ధాంతాలను నిరాకరించాడు. ఆధునికులను అభిమానించాడు, అయినా కొన్ని సందర్భాలలో వారి సంయమన రాహిత్యాన్ని విమర్శించాడు. శాస్త్రాన్నీ కళనూ సమన్వయించాడు. సంప్రదాయాన్నీ నవ్యతనూ అనుసంధించాడు. ప్రాచ్య పాశ్చాత్య కళా సిద్ధాంతాలను సమన్వయించాడు.

దువ్వూరి రామిరెడ్డి 1922-23 మధ్యకాలంలో కవిత్వ తత్వాన్ని నిరూపిస్తూ వ్యాసాలు రాశాడు. రామిరెడ్డి కవిని లోకోత్తర సృష్టి కర్తగా భావించాడు. ఆ సృష్టి అనన్యపర తంత్రం, ఆనంద దాయకం. కవికల్పన ఆదర్శప్రాయం. కవిసృష్టించిన స్త్రీలంతా హృదయ సమ్మోహన మంత్రాధి దేవతలు. కవి సృష్టించిన పురుషులు వీరులు, లోకోత్తర కార్యధురంధరులు. కవి సృష్టించిన ప్రకృతి అంతా సచేతనం. అతని సృష్టి కాలబద్ధం కాదు. "ఓ యైంద్రజాలికుడా, నీవు కుంచె నొక్కసారి విసరి నంతనె మా యాత్మలు తేలికయై పూలరేకులు రెక్కలు కట్టుకొని నిర్వృత్తి పదంబునకు చల్లగ నెగిరిపోవును. మొగము మొత్తినట్లు, కన్నులు మిటారించుకొని మమ్ములను గనుగొనుచున్న ప్రాపంచిక యాథార్థ్యము, మెల్లమెల్లగ సమసిపోయి యనిర్వచనీయమగు నానంద స్వప్నము అవతరించును ! ఓయీ, నీ కలము సోకిన ప్రతి విషయము, ప్రతిపదము,

ప్రతిభావము, ప్రతిరూపము, శాశ్వతమై యమృతమై యొప్పారును ! ఒక్క నిమిషమనంత కాల స్వరూపముగ గన్పట్టును, భూమి స్వర్గముగ పరిణమించును ఓ కవీ, మానవ జీవితమును ఆనంద మఖముగ నొనరింపుము'' (కవి).

కవిత్వం ఆయా భాషలలో ఒక వాల్మీకితోనూ, ఒక నన్నయ్యతోనో ఆరంభం కాలేదనీ, అంతకు ముందే కవిత్వం ఉందనీ రామిరెడ్డి అభిప్రాయ పడ్డాడు. ''కవిత్వము ప్రత్యేకముగ నొకదేశమునకును, ఒక జాతికిని, ఒక నాగరికతకును సంబంధించి యుండునది గాదు. అది విశ్వజనీనమైనది. మొట్ట మొదట మానవ హృదయమెప్పుడు రసార్ద్రమాయెనో, అప్పుడే కవితా బీజమంకురించెను; అప్పుడే మానవుని కల్పనా శక్తియు, ప్రతిభయు బయలయ్యెను. అప్పటి నుండియు కవితా మహాలత శాఖోప శాఖలుగ చీలి, మానవ సంఘము నందల్లు కొనుచున్నది'' (కవిత్వావతరణము). ఆదిమదశలో మానవుల ఆటపాటలకు నియమాలులేవనీ, నాగరికత పెరిగే కొద్దీ ఇవి నియమబద్ధాలయ్యాయనీ, కవిత్వం మొదట్లో గేయరూపంలో ఉంటుందనీ రామిరెడ్డి అభిప్రాయపడ్డాడు. ప్రకృతి తత్త్వ జిజ్ఞాస, శాస్త్రజ్ఞానం, విమర్శశక్తి పెరిగే కొద్ది కవిత్వశక్తి తగ్గిపోతుందంటాడు. చంద్రుని స్వరూపజ్ఞానం కలగడం వల్ల చంద్రునిలోని మచ్చలను గురించి మనోహర ఊహాలు నాశనమైపోయి చంద్రుణ్ణి ఆవరించుకొని ఉన్న కవిత్వం నశిస్తుందంటాడు. అయితే ఇక లోకంలో కవులు పుట్టరా ? కొత్త కావ్యాలు రావా ? అంటే వస్తాయనీ కాని వాటి గుణంలోనూ కల్పనలోనూ వ్యత్యాసముంటుందని అన్నాడు. అమెరికాలో వస్తున్న కవిత్వాన్ని గమనిస్తే ఈ విషయం అర్థమవుతుందని చెప్తూ ''ఆ కవిత్వమునందు మోటారు కారుల శబ్దము, ట్రాంబండ్ల గడగడలు ప్రతిధ్వనించుచుండును. యంత్రాగారములోని పొగ, రస్తాలలోని దుమ్ము ఆ దేశపు కవిత్వమును క్రమ్ముకొనినట్లుండును. ఆ కవితలందు కోకిలాలాపములు వినబడుటకు మారు శ్రవణ దారుణములైన రైలు బండికూతలు వినబడుచున్నవి'' అన్నాడు.

కవిత్వమంటే ఏమిటని ఎప్పటి నుండో అడుగుతూ ఉన్నారనీ కవులూ, లాక్షణికులూ, విమర్శకులూ ఎన్నో రకాల నిర్వచనాల నిచ్చారనీ అయినా ఈ ప్రశ్న ఇప్పటికీ అంతరించ లేదనీ అన్నాడు రామిరెడ్డి. ఛందో బద్ధమయిన

కావ్యం వచనం కంటే ఎక్కువ సుఖదాయకం అని చెప్పాడు. కవి ప్రతిభాశక్తి వల్ల కావ్యానికి సాధుత్వం, ప్రతిభా దౌర్బల్యం వల్ల అసాధుత్వం సిద్ధిస్తుందన్నాడు. ప్రాచ్య పాశ్చాత్య లక్షణ కర్తల సిద్ధాంతాలలోని అసమగ్రతలను ఎత్తి చూపాడు సహజమైన ప్రతిభయే కవిత్వానికి కారణమని, తక్కినవి సంస్కారాలు మాత్రమేననీ అవి కవిత్వానికి వన్నె తెస్తాయనీ చెప్పాడు. కవి అందరిలాగా ఊరకుండక రమ్యమైన భావప్రపంచాన్ని ఎందుకు సృష్టించాలి ? అని ప్రశ్నించుకొని" ఇది కవి యొక్క యాంతరంగిక ప్రేరణము; శమనాతీతమైన సౌందర్యపిపాస; అనివార్యమైన రసావేశము, భావోన్మాదము; కవి హృదయైక వేద్యము" (కవిత్వతత్త్వము) అని వివరించాడు ముత్యపు చిప్పలో వానచినుకు పడినప్పుడు అది మంచి ముత్యంగా మారుతుంది కాని కాకి చిప్పలో పడ్డప్పుడు మారదు కదా అంటాడు రామిరెడ్డి

'కావ్య జీవితము' అన్న వ్యాసంలో దువ్వూరి రామిరెడ్డి కావ్యాలను ప్రాణ వంతాలుగా చేసే శక్తి ఏమిటో చర్చించాడు వామన, కుంతక, క్షేమేంద్రాదుల కావ్య జీవిత సిద్ధాంతాలను పరిశీలించి వాటి అసమగ్రతను వివరించాడు. ఆత్మ అంతస్సారభూత మయింది కాబట్టి ఇదమిత్థమని వర్ణించడానికి వీలు కానిది అంటూ కావ్యానికి కవి ప్రతిభయే జీవితం అన్నాడు. అంగాంగ సంయోగిత, అనురూపత, వస్తువునందలి సర్వజనీన స్వభావము, కవి వ్యక్తిత్వము అనే నాలుగు లక్షణాలు ప్రతిభావంతులయిన కవుల కావ్యాలు చిరంజీవులు కావడానికి ప్రధాన కారణాలని రామిరెడ్డి సిద్ధాంతీకరించాడు.

కవిత్వం అనుకరణమనే అరిస్టాటిల్ సిద్ధాంతంలో అనుకరణ అంటే ఉన్నది ఉన్నట్లు అనుకరించడం కాదనీ, ఇందులో నిర్మాణం, ప్రతిసృష్టి అనే అర్థాలుకూడా ఉన్నాయని గుర్తించాలన్నాడు రామిరెడ్డి. కేవలం అనుకరణంలో నూతన సృష్టి ఉండదు కాబట్టి అది ఉత్తమ శిల్పం కాదన్నాడు. శిల్పం స్వతంత్ర సృష్టి అన్న విషయం సంస్కృత లాక్షణికులు అంగీకరించిందే. పింగళిసూరన "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను..." అన్న పద్యంలో చలువగల వెన్నెలల సౌందర్యానికి సౌరభం, కర్పూరానికి కోమలత, ఈ గుణాలన్నీ ఉన్న మలయపవనునకు మాధుర్యం ఉంటే అప్పుడు సుకవి పలుకులకు సమానం కావచ్చు అన్నాడు. అంటే సృష్టిలో ఈ వస్తువుల గుణాలు అసంపూర్ణాలు. ఈ అసంపూర్ణమయిన సృష్టి కవి సృష్టికి ఎట్లా

సమానమవుతుంది. "తాను సృజించిన వస్తువు స్వాభావికమా, లేక యస్వాభావికమా యను విచారము కవికనవసరము. ఇట్టి వస్తువు భావ ప్రపంచమున నుండిన నెంత రమ్యముగ నుండును అను తలంపె కవికి ముఖ్యము; రసనిష్పత్తికి సాధక మగునేని నెట్టి యలౌకికేంద్రజాలమునైన వస్ను వచ్చును. ఏల యనగా కవి సృష్టి యానంద మాత్ర ప్రయోజనముగలది" (కవిత్వ శిల్పము - అనుకరణము)

దువ్వూరి రామిరెడ్డి 'రస రామణీయకములు' అన్న వ్యాసంలో రసము, రామణీయకము అనే రెండు మాటలను గురించి చర్చించాడు. భావాలు అనంతాలనీ, భావాలలాగానే రసాలుకూడా అనంతాలనీ, అయినా వాటిలో ప్రధానమయినవి తొమ్మిది అనీ రససంఖ్య అనంతమని ఒప్పుకుంటూనే ప్రధాన రసాలుగా తొమ్మిదింటిని రామిరెడ్డి అంగీకరించాడు. రామణీయకం ఏక వస్తువు కాదనీ అది సమష్టిభావం అనీ ఆయన అభిప్రాయపడ్డాడు. "సౌందర్యమునకేదో యొక లక్షణమును గల్పించి దానిని బందిఖానాలో వేయుటకంటె స్వేచ్ఛగ వదలుట మేలు. ప్రతి మానవుని బుద్ధి నిర్ణయమె సౌందర్యమునకు ప్రమాణము. అది ప్రత్యేకము. సామాన్య వస్తువులలో గూడ ననంత సౌందర్యమును దర్శించిన మహానుభావులెందరో గలరు" అని సౌందర్యాన్ని పరిమితం చేసి నిర్వచించడం వృథా అన్నాడు.

లలిత కళలన్నీ ఒకే మూలసూత్రానికి బద్ధమై యున్నా, వాటి ప్రయోజనం ఒకటే అయినా వాటి మాధ్యమాన్ని బట్టి వాటి సీమలు భిన్నంగా ఉంటాయని రామిరెడ్డి అభిప్రాయం. కవి సమష్టి వర్ణన చేయడం ఉత్తమ మన్నాడు. చిత్రకారుడు ఒక సౌందర్యవతి అయిన స్త్రీ చిత్రాన్ని చిత్రిస్తాడు. అదే కవి అయితే ఆ స్త్రీ అవయవాల నొక్కొక్కటిగా ఇరవై ముప్పయి పద్యాలలో వర్ణిస్తాడు. వాటిలో ఉన్న వర్ణనంతా ఒక్క చోటికి చేర్చి ఆకారంగా నిర్మించి సమష్టి సౌందర్యాన్ని గ్రహించడం పాఠకునికి కష్టమయిన పని. కవి చర్యను వర్ణించడం వల్ల సౌందర్యాన్ని వ్యక్తం చేస్తాడు.

కవిత్వానికి ప్రయోజనం ఏమిటి ? సద్యః పరనిర్వృతియే అని రామిరెడ్డి సమాధానం. కవి ఏ అవస్థలో తన కావ్యాన్ని రచిస్తాడో సహృదయుడు ఆ కావ్యాన్ని చదివినప్పుడు అదే అవస్థను పొందుతాడు. సంకుచితాలైన ప్రపంచ సీమలను భేదించుకొని మనస్సులో విశాలమైన భావ ప్రపంచంలో

అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. కావ్య జగత్తులో చిత్తం లగ్నమైనప్పుడు అది బాహ్య ప్రపంచంలాగానే యథార్థమని పిస్తుంది. అది సత్యమనిపించకపోతే పాఠకుడికి సహానుభూతి ఎలా కలుగుతుంది. సంఘంలో యథార్థమయిన నాగరికత పెరిగే కొద్దీ ప్రజలలో సౌందర్య పిపాస పెరుగుతుంది. సాహిత్యం సంఘం ఉచ్చ నీచస్థితులను తెలిపే భారమితి కావ్యాలు సంఘ సంయోగితను పోషిస్తాయి. వాటిలో సార్వజనీన భావాలు ప్రజలనందరినీ ఏక సంప్రదాయ బద్ధుల్ని చేసి ఏకత్వాన్ని కలిగిస్తాయి. రామాయణ మహాభారతాలు ఇటు వంటి కావ్యాలని రామిరెడ్డి అభిప్రాయం. "కావ్యము మానవ ప్రకృతి నుద్ధరింపగల యొక మనోహర సాధనము" (కవిత్వ ప్రయోజనము)

కవిత్వతత్త్వ నిరూపణ సంబంధమయిన వ్యాసాలలో చివరిది 'కావ్యము: నీతి' ఆ వ్యాసంలో 'శిల్పంకోసమే శిల్పం' అనే వాదాన్ని రామిరెడ్డి ఖండించాడు. "కవి భావోద్రేకము వలన తన కిష్టమైన రీతిని గానము చేయును. అట్లు చేయుట యితరుల కొరకు కాదు; తన సంతోషమునకు, కోకిల కూయుట యెవరిని ఆనంద పెట్టుకొరకు ? ఈ వాదము మొట్ట మొదట వినుటకు ఇంపుగానే యుండును. కాని విమర్శించు కొలది యందలి లోపములు బయలు వడును. కోయిల కూతను విని మన మానందించు చున్నాము; నిజమే, దాని కూత మధురముగ నుండుట వలనను ఆ కూత మనకు సమ్మతమగుట వలనను మనము సంతోషించుచున్నాము. అది తన కిష్టము వచ్చినట్లు కూయుట వలన గాదు, కాకి గూడ తన కిష్టము వచ్చినట్లే కూయును దానిని మనవేమాత్ర మాదరించుచున్నాము?" అని ప్రశ్నించాడు రామిరెడ్డి. "సమాజమెట్లు తన యందలి వ్యక్తికి బాధ్యమో, వ్యక్తి కూడ అట్లే సమాజమునకు బాధ్యుడు" అన్నాడు. "కావ్యము విశ్వశ్రేయము చేకూర్చున దిగ నుండ వలయును. అనీతి దాయకమైన దేదియు లోక కల్యాణము నాపాదింప లేదు" అన్నాడు. నీతులు దేశకాల పరిస్థితులననుసరించి ఉంటాయనీ అయినా వాటిలో అంతర్వ్యాపి అయిన ఉద్దేశం ఒకటే అనీ అభిప్రాయపడుతూ "నీతిస్పర్శ లేనిదే సౌందర్యము పరిపూర్ణము గాదని నా యుద్దేశము" అని నిష్కర్షగా చెప్పాడు

మర్మకవిత్వం పాశ్చాత్యదేశాలలో బయలుదేరిన కవిత్వోద్యమం ఈ ఉద్యమ ప్రభావం భారతీయ కవులపైకూడా పడింది. మర్మకవిత్వం గురించి

రామిరెడ్డి ఒక వ్యాసం రచించాడు.. మర్మ కవిత్వం సామాన్యంగా గీతి రూపంలో ఉంటుందనీ, మర్మ కవులు తక్కువమాటల్లో ఎక్కువ గానాన్ని, సూచనలను గర్భీకరిస్తారని రామిరెడ్డి వివరించాడు. సామాన్య ప్రజలకు అగమ్య గోచరం కాబట్టి దీన్ని మర్మ కవిత్వం అంటారు. ఈ మర్మ కవిత్వం కేవలం ఆత్మానుభవ జనితం, ఆత్మోపభోగం. ఈ మర్మ కవిత్వం పాశ్చాత్యులకు కొత్తగాని మనకు కొత్తగాదని రామిరెడ్డి చెప్పాడు. మన ఆధ్యాత్మిక కవిత్వమే మర్మకవిత్వం అన్నాడు. పాశ్చాత్యులలో సామాన్యులకు ఆధ్యాత్మిక గంధం శూన్యం కాబట్టి వాళ్లకు ఈ కవిత్వం మర్మంగా తోచిందని రామిరెడ్డి వివరించాడు. మర్మకవిత్వానికి కొంత అస్పష్టత తప్పదు. 'శిల్పం అనుభవింప వలసినదేగాని, వివరింపవలసినది కాదషన్న అవనీంద్ర నాథ టాగూరు వాక్యాన్ని ఉటంకించాడు రామిరెడ్డి. మర్మకవిత్వాన్ని టాల్‌స్టాయ్ తీవ్రంగా ఖండించాడు. రామిరెడ్డి టాల్‌స్టాయ్ అభిప్రాయాలను అంగీకరించలేదు.

"నేటికవులు అప్రయాసలభ్య జనరంజకత్వమునకయి తమ శక్తిని వ్యర్థ పుచ్చుచున్నారు" అని ఆధునిక కవులను విమర్శించాడు

మన దేశంలో ఆధ్యాత్మిక కవిత్వానికి ఏమీ కొరత లేదని చెప్పి రామిరెడ్డి సంస్కృత, తమిళ, మరాఠీ, హిందీ, తెలుగు కవులలో ఆధ్యాత్మిక లక్షణాలను చూపించాడు. టాగూర్‌కు నోబెల్ బహుమతి లభించి అతని కవిత్వం దేశమంతటా వ్యాపించిం తర్వాత తెలుగులో కూడా భావకవిత్వం ఆధ్యాత్మిక కవిత్వంగా పరిణమించడం మొదలు పెట్టిందన్నాడు రామిరెడ్డి.

'నాటక కళా సంస్కరణము', 'నాటకము చరిత్రము', 'మీరాబాయి - ఒక విషాదాంతము' ఈ మూడు వ్యాసాలు నాటక కళకు సంబంధించి దువ్వూరి రామిరెడ్డి రాసిన వ్యాసాలు 'నాటక కళా సంస్కరణము'లో తెలుగు నాటకాలలో కనిపించే అనేక దోషాలను విమర్శించి వాటిని సరిదిద్దే ఉపాయాలను సూచించాడు. ఆ కాలంలో తెలుగులో వస్తున్న నాటకాలలో నూటికి తొంభైశాతం నాటక మనిపించుకోవడానికి తగనివని రచయిత అభిప్రాయం

ధర్మవరం రామకృష్ణాచార్యులకు నాటకాలలో భావాన్ని సంక్షిప్తంగా చెప్పడం తెలియదనీ 'ప్రహ్లాద' నాటకంలో పాటల్లో తన పేరును నిక్షిప్తంచేయడం ఉచితం కాదనీ అన్నాడు. అవసరం లేకుండా దేశభక్తి భావాలని బోధించే

ఉపన్యాసాలను నాటకాలలో చేరుస్తున్నారని విమర్శించాడు. చాలా మంది నాటక కవుల రచనాలోపాలను పాటలూ, పద్యాలూ కప్పిపుచ్చుతున్నాయన్నాడు. 'గయోపాఖ్యానము', 'శ్రీ రామాంజనేయము', 'ప్రమీలార్జునీయము' వంటి నాటకాలలో ప్రధాన పాత్రల సంవాదాలలోని పరస్పర దూషణలు జుగుప్సాకరంగా ఉన్నాయని ఆయన విమర్శించాడు.

నటులు తమ పాత్రను బాగా అర్థం చేసుకోవాలి. అభినయాన్ని అడ్డగించే పాటలు, పద్యాలను అంగీకరించకూడదు. అసందర్భంగా పాటలు ఉండకూడదు. పద్యాన్ని రెండు మూడుసార్లు చదవ కూడదు. పాత్రాను గుణంగా నటన ఉండాలి. పాత్రోచితమయిన వేషాన్ని ధరించాలి కవి రచనను నటులు తమ ఇష్టం వచ్చినట్లు మార్చకూడదు. కవి ఉద్దేశించిన దానికంటే భిన్నంగా అభినయించకూడదు. నాటక వృత్తానికి అనుగుణంగా రంగస్థలం ఉండాలి ప్రేక్షకులు కూడా నటుని అభినయంలోని ఔచిత్యాన్ని, సౌకుమార్యాన్ని, సూక్ష్మతను గుర్తించి మెచ్చు కోవాలి. "ఇక మీద నెన్నటి కైనను కవి నటక ప్రేక్షకుల సహకార సాహాయ్యముల చేతనే నాటక శిల్పము సంస్కరింపబడ వలయును; అభ్యున్నతి నొందవలయును. ఈ ముఫ్వురును వారి వారి బాధ్యతను చక్కగ గుర్తెరిగి ప్రవర్తింతురేని నాటక కళకు మంచి దినములు రానున్నవని నాతలంపు," అని రామిరెడ్డి భావించాడు.

వేదం వేంకటరాయ శాస్త్రి రచించిన 'ప్రతాపరుద్రీయ' నాటకం సుప్రసిద్ధం. ఈ నాటకంలోని కథ చారిత్రకం కాదని త్రిపురనేనిరామస్వామి చౌదరి విమర్శించాడు. దీనికి రామిరెడ్డి స్పందించి రాసిన వ్యాసం 'నాటకముః చరిత్రము'. రామస్వామి చౌదరి విమర్శను రామిరెడ్డి అంగీకరించలేదు. నాటకం చరిత్రానుసారంగా ఉండవలసిన అవసరం లేదన్నాడు.

దువ్వూరి రామిరెడ్డి 'మీరాబాయి' నాటకాన్ని విమర్శిస్తూ 'రసలుబ్ధుడు' అనే మారు పేరుతో ఒకరు పత్రికలో వ్యాసం రాశారు. దువ్వూరి రామిరెడ్డి 'కళాప్రియుడు' అనే పేరుతో ఈ విమర్శకు సమాధానం ఇచ్చాడు. రసలుబ్ధుని విమర్శలోని సమంజసమయిన ఒకటి రెండు అంశాలను అంగీకరిస్తూ తక్కిన వాటిని తిరస్కరించాడు. లక్షణ గ్రంథాలలో చెప్పిన లక్షణాలను యథాతథంగా పాటించ వలసిన అవసరం లేదన్నాడు. మీరాబాయి ఎట్లా విషాదాంత నాటకమో సమర్థించాడు.

'అల్లసాని పెద్దన సమకాలీన భావ ప్రతినిధి' అన్న వ్యాసం మధ్య కాలీన ప్రబంధ సాహిత్యంపై మంచి సమీక్ష. "ఆంధ్రదేశ రాజకీయ చరిత్రమునందు కృష్ణదేవరాయలం రాజ్యకాలమొక సువర్ణఘట్టము. హరిహర రాయలచే ప్రారంభింపబడిన విజయనగర సామ్రాజ్యము కృష్ణదేవరాయలనాటికి పరిపూర్ణత నొంది, భోగభాగ్యముల తులతూగుచు నడిమింటి సూర్యుని వలె ప్రకాశింప జొచ్చెను. తెలుగు శౌర్యము, తెలుగు కీర్తి నల్గడల బ్రసరించెను. ఆ కాలము నందు ఆంధ్రసారస్వతమును కళలును విశేషముగ వృద్ధి చెందినవి' సాహిత్యాభివృద్ధికి సమాజాభివృద్ధి కారణం. సంఘం భోగభాగ్యాలతో వర్ధిల్లి నప్పుడు స్వాతంత్ర్య ప్రీతి పెరుగుతుంది. సాహిత్యంలో మార్పులు వస్తాయి. పెద్దన ప్రబంధం స్వతంత్ర కథా వస్తువును గ్రహించి నూతన సంప్రదాయాన్ని ఏర్పరచింది. పెద్దన చిత్రించిన పాత్రలు వరూధినీ ప్రవరులు. పెద్దన వరూధిని పట్లనే సానుభూతి చూపించాడంటాడు రామిరెడ్డి. నీతి సూత్రాలు కొంత ఈ వైభవ కాలంలో సడలుతాయనీ అయినా సంప్రదాయ వాదుల తృప్తి కోసం ప్రవరుడి పాత్రను పెద్దన అట్లా చిత్రించాడనీ రామిరెడ్డి అంటాడు.

పెద్దన కవిత్వాన్ని మెచ్చుకుంటూ 'నిలకడవలయు కృతికి' అన్న అప్పకవి వాక్యాన్ని రామిరెడ్డి సమర్థిస్తాడు. నేటి కవులలో త్వరగా ప్రచురించు కోవాలన్న కోరిక, పత్రికాధిపతులకు కాగితాలు నింపాలన్న అవసరం నిలకడగా కవిత్వం రాయడానికి వీలు కలిగించడం లేదన్నాడు రామిరెడ్డి.

'అలంకార తత్త్వము' అనే వ్యాసంలో రామిరెడ్డి రచనలో అలంకారాల అవసరాన్ని, అవి నిర్వర్తించే పాత్రను చర్చించాడు. "అలంకారములు పరిమిత పదజాలముతో అపరిమిత భావచ్ఛాయలను ప్రకటించుట కేర్పడిన భావ ప్రకటన సాధనములు, వాని రమణీయతకు కారణము భావగాఢత్వము, శబలత్వము, తన్మూలమున రసత్వమును... కవి చెప్ప దలచుకొన్న భావము స్ఫుటముగ సూటిగ పఠిత హృదయమున ప్రవేశ పెట్టుటకు ఉపమాద్యలంకారములు తోడ్పడును. కొంత సేపు తర్కించి విమర్శించి వివరించిన గాని మనసునకు పట్టని విషయములు సైతము అలంకార ద్వారమున సునాయాసముగ మనమున హత్తుకొనును" అని రామిరెడ్డి అలంకార ప్రయోజనాన్ని వివరించాడు. "భాష స్థూలము, భావములు సున్నితములు. ఏభాషయందైనను పదజాలము పరిమితము. భావచ్ఛాయలపరిమితములు. కావున పరిమిత పదజాలముతో

అపరిమిత భావములను ప్రకటింప వలసి యున్న యెడల ఏవో కొన్ని సంకేతములు, సమయములు, శబ్దశక్తులు అక్కరను బట్టి సహజముగ ఉద్భవించును'' అలంకారాలు తెచ్చి పెట్టుకోవలసిన అవసరం లేదనీ, అవి సహజంగానే అవసరమౌతాయనీ రామిరెడ్డి భావన, "భాష పొదుపునకు అలంకార మొక సాధనము'' అన్న వాక్యంలో ఈ విషయాన్ని ఆయన సుస్పష్టం చేశాడు కాబట్టి అలంకారాలు అవసరమా, అనవసరమా అన్న చర్చ అవసరమే లేదనీ ప్రతిభావంతులయిన కవుల రచనలలో అలంకారాలు అవసరమైనచోట అప్రయత్నంగానే దొర్లుతాయనీ రామిరెడ్డి భావించాడు. అయితే అలంకార శాస్త్రాలు వ్యాప్తిలోకి వచ్చిం తర్వాత కొంత మంది కవులు కేవలం అలంకారాలు వాడారనీ అందువల్ల నీరసమైన అలంకారాలు పుట్టాయనీ అన్నాడు. "ఉపమ యొక్క ప్రయోజనం విస్మృతమైనది. పిరుదులు ఇసుక తిప్పలయినవి. వక్షోజములు కొండలెనవి కేవలము ఆకృతిని సూచించు ఉపమానము లధమములు, రాను రాను ఇట్టి వర్ణనములు కవితా సంప్రదాయములైనవి'' అని రామిరెడ్డి అలంకారాలు నిరసనకులోను కావడానికి కారణాన్ని సూచించాడు

గురజాడ 'ముత్యాలసరాల'తో తెలుగులో అభినవ కవిత్వోద్యమం ప్రారంభమయింది కట్టమంచి రామలింగారెడ్డి తన విమర్శతో దీనికి మార్గదర్శకుడయ్యాడు. రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు వంటి కవులు అనుసరించారు. ఈ మార్గంలో పింగళి, కాటూరి, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శివశంకరశాస్త్రి, నాయని సుబ్బారావు, వేదుల, నండూరి, బసవరాజు అప్పారావు, జాషువా మొదలయిన కవులు కవిత్వం రాశారు. అయితే ఈ అభినవ కవిత్వాన్ని చాలమంది ఆక్షేపించారు పోలవరపు రామబ్రహ్మము అనే ఆయన ఆధునిక కవిత్వాన్ని విమర్శిస్తూ 'ప్రజామిత్ర'లో ఒక వ్యాసం రాశాడు. దువ్వూరి రామిరెడ్డి 'అభినవాంధ్ర కవిత్వము' అనే వ్యాసంలో రామ బ్రహ్మము అభిప్రాయాలను ఖండించాడు. ఆధునిక కవిత్వాన్నంతా చెత్త అనడం ఆయనకు రుచించలేదు. ప్రపంచ వాఙ్మయాలను జీర్ణం చేసుకోవడం భాషకు అభివృద్ధే అని ఆయన భావన చెత్త ఆధునిక సాహిత్యంలోనే కాదు ప్రాచీన సాహిత్యంలో కూడా ఉంది చెత్త నిలబడదు. కాలప్రవాహంలో మంచి రచనలే నిలుస్తాయి ఆధునిక రచనలకు కూడా ఇది వర్తిస్తుంది. ఆధునిక కవిత్వంలో దూరాన్వయం. క్లిష్టాన్వయం, అర్థం బోధపడని పదాలకూర్పు, నిరర్థక పదాడంబరత్వం, భావ

ప్రకటన సరిగా చేయలేని గజిబిజి తనం మొదలయిన కావ్యదోషాలున్నాయన్న విమర్శకు "(ఈ) కావ్య దోషములు ప్రత్యేముగ ఆయాకవికి సంబంధించిన రచనాలోపములే కాని అవి యెల్ల అభినవ కవితలకు లక్షణములు కావు" అని రామిరెడ్డి జవాబిచ్చాడు.

'సాహిత్యములో రమ్యత', 'నేటి కవిత - ప్రకృతి పూజ', 'సాహిత్యంలో వైచిత్రి', 'నా కవితానుభవములు', 'తిక్కన' అన్న ఈ అయిదు వ్యాసాలు దువ్వూరి రామిరెడ్డి రేడియో ప్రసంగాలు.

కవిత్వంలో రామణీయకం ఏక వస్తువు కాదు, ఏక గుణం కాదు వస్తు గుణాలు ఉచితమయిన రీతిలో సమ్మిళితమై కవి ప్రతిభ చేత సచేతనమై ఆకృతి బద్ధమైన భావం యొక్క సమష్టిమోహనత్వమే రమ్యత అంటాడు రామిరెడ్డి అమరకవిత ఏదో రామిరెడ్డి ఇలా నిర్వచించాడు, "ప్రతిభావంతుడైన కవికి అపూర్వ వస్తు నిర్మాణ క్షమమైన ప్రజ్ఞ ఉండును అద్దములో బింబము ప్రతిఫలింపజేయు వర్ణనా శక్తి కవికి స్వభావ సిద్ధముగ ఉండును. ఈ శక్తి యేకవికి పరిపూర్ణముగ నుండునో అతడు అమర కవి. వానిది సార్వకాలీనమైన అమర కవిత" (సాహిత్యములో రమ్యత)

కవిత్వంలో కాలానుగుణమైన మార్పులు వస్తాయి. పూర్వుల రచనా విధానంతో తృప్తి పడని తర్వాతి కవులు కొత్త మార్గాలను అన్వేషిస్తారు. అంతమాత్రం చేత పూర్వ కవిత్వాన్ని అసహ్యించుకోవలసిన అవసరం లేదు. "1910వ సంవత్సరము మొదలు ప్రారంభించిన నవ్యకవుల రచనలు 1935వ సంవత్సరము నాటికే పూర్వ కవిత్వముగా మారిపోయిన దన్న విషయము నవ్య కవులు జ్ఞప్తి పెట్టుకొన్న యెడల పూర్వకవిత్వమును అంతగా ద్వేషింప వలసిన అవసరముండదు" అన్నాడు రామిరెడ్డి. బాహ్య ప్రకృతి అంతా మానవ చర్యల సంబంధం లేకున్నా ప్రత్యేక వర్ణనీయమేననీ ఇంగ్లీషువారి లేక్‌పొయెట్రీ, నేచర్ పొయెట్రీ ఈ తెగకు చేరినవేననీ ఆయన అన్నాడు. "కవులు పూర్వులైనను, ఆధునికులైనను ప్రకృతిని వర్ణించుట యందు రెండు పద్ధతులను అవలంబించిరి. కవుల దృష్టికి ప్రకృతిలోని ప్రతి అణువును ప్రాణవంతముగ నగపడుచుండును. అందువలన ప్రకృతిని మానవీకరించుట, మానవుల కష్ట సుఖములలో ప్రకృతి సహానుభూతి చూపు చున్నట్లు వర్ణించుట మొదలైనవి

ప్రథమ విధానము. ప్రకృతి సౌందర్యమును స్వాభావికముగ వర్ణించుట రెండవ విధానము'' అని వివరిస్తూ ''రమణీయ వస్తువులు తమంత తామే వర్ణనా యోగ్యములయ్యును అవి మానవ చర్యలకు భిత్తికయయి కావ్య వర్ణనములో మిళితమైనప్పుడు మరింత సుందరముగ నుండును'' అని తన అభిప్రాయాన్ని వివరించాడు (నేటి కవిత - ప్రకృతి పూజ).

''యథార్థమైన కవిత్వమునకు వైచిత్ర్యము జీవము. నవ్యతయే వైచిత్ర్యమునకు మూలము. రోమాంటిక్ పొయెట్రీ అంటే భావనాపటిష్ఠమైన స్వేచ్ఛా ప్రియ కవిత్వమని మనము నిర్ణయించుకొను పక్షములో మహాకవుల కావ్యములన్నియు ఈ వర్గమునకే చెందును'' (సాహిత్యంలో వైచిత్రి)

'నా కవితానుభవములు' చక్కని కవితాత్మకమయిన వ్యాసం. కవి గ్రామవాసి, కైతవం తెలియదు, ప్రకృతి బడిలో పెరిగాడు. పొలాల విహరిస్తూ పొద్దు పుచ్చుతూ ఉంటాడు.

''గూళులకు వచ్చు పక్షులకూజితములు
సంజకెంజాయ గారడి చక్కదనము
వరుల వినవచ్చు కీటకావ్యక్త గీతి
కాపు వానిని సైతము కవి నొనర్చు''

కాబట్టి కాపువాడైన దువ్వూరి రామిరెడ్డి కవి అయ్యాడు. కవితా వధువును వరించాడు. ఈ కవితా వధువు చెప్పుచేతల్లో ఉండేది కాదు. ఇష్టం వచ్చినప్పుడు వస్తుంది, సగంలో వెళ్లిపోతుంది. రమ్మన్నప్పుడు రాదు. ఇద్దరికీ బోలెడంత తారతమ్యం. అహంభావంతో కవి చిత్రలేఖను చేరదీశాడు. కవితా సతికి ఈర్ష్య పుట్టింది. చిత్రలేఖతో సాంగత్యం ఫలప్రదం కాలేదు. కవిత మీది ప్రేమ మాసిపోలేదు. ఆమెను ఓదార్చాడు. అక్కున చేర్చుకున్నాడు.

దువ్వూరి రామిరెడ్డి కొంత కాలం కవితా రచన ఆపి చిత్రలేఖనం మీద ఆసక్తి చూపించాడు. అది అంతగా సఫలం కాలేదు. మళ్లీ కవితా రచన ప్రారంభించాడు. ఆ విషయాన్నే ఈ వ్యాసంలో ఆయన చెప్పాడు.

దువ్వూరి రామిరెడ్డికి తిక్కనపైన అభిమానం. 1926లో హైదరాబాదులోని శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంలో తిక్కన జయంతి సభలో తిక్కనను

గురించి సుదీర్ఘమయిన ఉపన్యాసం చేశాడు నన్నయది వైదిక దృష్టి, జగద్ధితబుద్ధి, తిక్కనది శిల్ప దృష్టి, ఆంధ్రావళి మోదముంబొరయించు బుద్ధి అని రామిరెడ్డి అభిప్రాయం. అను వాదాన్ని గురించి చెప్తూ "మూలము అస్థిపంజరము, తిక్కన ఆంధ్రీకరణము రక్త మాంస యుతమైన జీవన్మూర్తి" అన్నాడు (తిక్కన). తిక్కన అవలంబించిన రచనా పద్ధతులను రామిరెడ్డి ఈ విధంగా క్రోడీకరించాడు. "1. సంభాషణ మూలకమైన నాటక పద్ధతిలో కథ నడుపుట. 2 రస పోషణకుగా యధేచ్ఛముగ మూలమునతిక్రమించుట, అమూలకమును చేర్చుట, మూలమును మట్టగించుట. 3. వస్తువు యొక్క ఐక్యమునకూ కథాగమనమునకూ అభ్యంతరములైన భగవద్గీతల వంటి వానిని వదలుట 4. పాత్రలు ప్రాణవంతములుగ స్ఫురించుటకు అంగవికారాద్యభి నయములను కన్నులు గట్టినట్లు వర్ణించుట. 5 పాత్రల వ్యక్తిత్వము భిన్నత్వము పరిస్ఫుటమగునట్లు శీలమును పోషించుట 6. ఔచిత్యమును పోషించుట 7. ఉదయాస్తమయాది వర్ణనములు కథలో మేళవించునట్లు చేయుట 8. భావ రసానుగుణమైన శైలి." (తిక్కన).

'ద్విపద రచన - గణభేదము' అన్న వ్యాసంలో మార్గ ఛందస్సుల వల్ల దేశీయమైన మాతా ఛందస్సులు వెనుకబడ్డాయనీ వాటిని పునరుద్ధరించవలసిన అవసరం ఉందనీ రామిరెడ్డి ప్రతిపాదించాడు. ద్విపద ఛందస్సులో గతి భంగం కలుగ కుండ గణాలలో మార్పు చేయవచ్చునని ఈ వ్యాసంలో రామిరెడ్డి ప్రతిపాదించాడు. "భాషకును భావములకును తగిన ఛందస్సు మనకు సిద్ధము కావలయును. ఛందస్సుకొరకే మనము కవిత్వమల్లుట లేదు. తెలుగు కవిత్వమునకు గల వైశాల్యమును సులభ వశ్యతయు నితర భాషా ఛందస్సుల నంగీకరించుట వలన కొంత వరకు నశించినది. తెలుగు కవిత స్వచ్ఛంద విహారిణియు గాక, శిల్పమునకు వలయు కొన్ని నియమములకు లోబడి, స్వతంత్ర యగుటకు తెలుగు కవులందరు ప్రయత్నించుట పరమకర్తవ్యము" అని ప్రబోధించాడు.

'తెలుగు కవితలో క్రొత్త తెన్నులు' అన్న వ్యాసం అసంపూర్ణం. ఈ అసంపూర్ణ వ్యాసంలో పఠాభి 'ఫిడేలు రాగాలడజన్'కు శ్రీశ్రీ రాసిన 'ఇంట్రో' పై విమర్శ ప్రధానం. దువ్వూరి రామిరెడ్డికి ఛందస్సుపై గౌరవం. ఛందస్సులేని పద్యం విన్నప్పుడు ఉప్పులేని చప్పిడి కూరతో అన్నం తిన్నట్లుంటుందట. ఆంధ్ర

భారత భాగవత రామాయణాలు జీవించి ఉండునంతవరకు తెలుగు కవిత్వానికి ఛందస్సుకు ఎడబాటుండదని ఆయన గాఢ నమ్మకం. ఫిడేలు రాగాల డజన్‌లోని వచన కవిత్వాన్ని జామెట్రి కవిత్వం అన్నాడు రామిరెడ్డి. పఠాభి కవిత్వాన్ని "వలవు వస్తులతో నవసి మతి చెడిన యువకుని ఉన్మత్త ప్రలాపములుగా" రామిరెడ్డి భావించాడు.

దువ్వూరి రామిరెడ్డి 'Andhra Folk-Lore : A word to student', 'The Origin of the Non-Brahmin Movement' అని ఇంగ్లీషులో రెండు వ్యాసాలు కూడా రాశాడు.



# 8. ఇతర వచన రచనలు

## నా దేశాటనం డైరి :

దువ్వూరి రామిరెడ్డి 'నా దేశాటనం డైరి' అనే ఒక వచన రచన చేశాడు ఒక ధారావాహికంగా దీన్ని రాయాలని తల పెట్టాడేమో. వ్యంగ్య హాస్య సమ్మిళతంగానూ దీన్ని ప్రారంభించాడు బియ్యే పాసయిన రాఘవశాస్త్రి బి ఎల్ చదివి ప్లీడరు కావాలని తండ్రి సోమయ్య శాస్త్రి అనుకుంటాడు. కామయ్య శాస్త్రి అనే కొంచెం డబ్బున్న బంధువు కుమార్తెను కొడుక్కు చేసుకోవడానికి తద్వారా కొడుకును మామ గారి ఖర్చుతో బి ఎల్. చదివించడానికీ పధకం వేస్తాడు సోమయ్యశాస్త్రి. పత్రికలలో యుద్ధ వార్తలను సేకరించి ఒక బృహద్గ్రంథం రాసే ప్రయత్నంలో ఉన్న కామయ్యశాస్త్రికి తన పుస్తకాన్ని తనను మెచ్చు కొని, తను అడగ్గానే పేపరు ఇచ్చే రాఘవశాస్త్రి బాగానే నచ్చాడు రాఘవశాస్త్రి పత్రికలకు అప్పుడప్పుడు వ్యాసాలు కూడా రాస్తూ ఉంటాడు వాటిని మెచ్చుకొనేలా కామయ్యశాస్త్రే. కామయ్యశాస్త్రి కూతుర్ని రాఘవ శాస్త్రి పెళ్లాడాడు. రాఘవశాస్త్రిని ప్లీడరు చేయాలని తండ్రి, ఎడిటరు చెయ్యాలని మామగారు, మేజిస్ట్రేటు కావాలని తల్లీ కోరుకున్నారు. కాని రాఘవశాస్త్రికి దేశాటనం చేయాలనే కోరిక కలిగింది. భార్యను ఒప్పించి అటు మామగారికీ, ఇటు తండ్రిగారికీ తెలియకుండా దేశాటనానికి వెళ్లాడు. దేశాటనం డైరీ రాసి దాన్ని మిత్రుడికి పంపాడు. మరి ఆడైరీలో ఏం రాశాడో అది ప్రచురితమైతే కాని తెలియదు కదా !

## గుడివాడ రత్తం :

దువ్వూరి రామిరెడ్డి 'గుడివాడ రత్తం' అని ఒక కథానికను రచించాడు. నెల్లూరు జిల్లాలో పొలం పనులకు ముఖ్యంగా నాట్లసమయంలో గుడివాడ ప్రాంతం నుండి కూలీలు వస్తారు. కవి గారి పొలంలో ఒకనాడు ఆ కూలీలు నాట్లు వేస్తున్న సన్ని వేశం ఈ కథానికలో ఇతివృత్తం. ఒళ్లు దాచుకోకుండా పోటీపడి పనిచేసే ఆ కూలీల నిష్కపట హృదయాలను ఆవిష్కరించాడు కథకుడు. వీళ్లలో రత్తం అనే యువతి వర్షం పడతున్నా లెక్క చేయక, అందరూ చెట్టు కిందకు పోయినా తాను మాత్రం పని సాగించి అందరికంటే ముందు తన వంతు పనిని పూర్తి చేస్తుంది. ఆ యువతి అకృత్రిమ సౌందర్యానికి ముగ్ధుడై రచయిత ఆమెను బురదలో పుట్టిన తామర పూవుగా అభివర్ణించాడు. "అధమ స్థానము వహించిన పంకమునకు ఇటువంటి మనోహరమైన సంతానము సృష్టికర్తచే ప్రసాదింపబడ్డ నష్టపరిహారమేమో !" అంటాడు. రామిరెడ్డి ఈ కథను ఉత్తమ పురుషలో చెప్పాడు.

## డైరీ :

దువ్వూరి రామిరెడ్డికి డైరీ రాసుకొనే అలవాటు ఉంది. 1924-1935 మధ్యకాలంలో ఆయన జీవితమూ, రచనల గురించిన వివిధాంశాలు ఆయన డైరీలలో లభిస్తాయి. తాను వానాకాలంలో కలుపుతీసే కాలంలో తన ప్రధానమైన గ్రంథాలన్నీ రాసినట్లు ఆయన చెప్పుకున్నాడు. కవిత్వం రాయాలని తాను ప్రయత్నం చేయడు. రాయవలసినంత భావప్రేరణం కలిగినప్పుడే రాస్తాడు. అయితే ఇది కలుపుకాలంలోనే సాధారణంగా జరుగుతున్నట్లు రామిరెడ్డి గుర్తించాడు

రామిరెడ్డి తన రచనా విధానాన్ని కూడా డైరీలో రాసుకున్నాడు. నాటకాలను చూచినప్పుడు అవి తనలో కలిగించిన అభిప్రాయాలను రాసుకున్నాడు. తనకు కలిగిన బాధలను, భావావేశాలను చెప్పుకున్నాడు.

4-3-1929 నాటి డైరీలో "I have written a tragedy 'Meerabai' and have suffered a tragedy in the loss of my wife. I have written a 'Farewell', a poem of disappointed love, and I had to be disappointed in love ! It appears as if my own poetic creations foreshadow my misfortunes ! Am I to write a comedy to regain my happiness ?" అని రాసుకున్నాడు.

★ ★ ★

# ౨. కవి కోకిల

1895లో దువ్వూరి రామిరెడ్డి జన్మించాడు. 1915లో తెలుగు సాహితీ నందనోద్యానంలో 'కవికోకిల'గా ఆవిర్భవించాడు. పాఠశాలలో చదువుకున్నది తక్కువ. జీవిత పాఠశాలలో చదువుకున్నది కొండంత. స్వయంకృషితో అపార పాండిత్యం సంపాదించాడు ఇంగ్లీషు, ఫ్రెంచి, లాటిన్, జర్మన్, బెంగాలీ, పర్షియన్, ఉర్దూ, తమిళం, సంస్కృతం సొంతంగా నేర్చుకున్నాడు.

చిత్రలేఖనం, శిల్పం, ఫొటోగ్రఫీ, రేడియో ఇంజనీరింగు, అటు కళలూ ఇటు విజ్ఞాన శాస్త్రం. రామిరెడ్డికి ఆసక్తి కలిగించని విషయమే లేదు. అన్నిటిలో ఎంతో కొంత పరిశ్రమ చేశాడు.

రామిరెడ్డి నిరాడంబరుడు. ప్రచారం అంటే ఇష్టం లేదు పేరుకోసం పాకులాడలేదు.

రామిరెడ్డి పద్యం ఎంత సరళంగా రాస్తాడో, వచనమూ అంతే సరళంగా రాస్తాడు. కవిత్వంలో వర్ణనలూ చేస్తాడు, శాస్త్ర విషయాలూ బోధిస్తాడు. పాతదంతా పనికి రానిది, కొత్త మాత్రమే స్వీకరించ వలసింది అని కాని, పాతలోనే అంతా ఉంది కొత్త అంతా నిస్సారమే అని కాని అనడు రామిరెడ్డి. ఆయనకు పాతలోని మంచీ కావాలి కొత్తలోని చెడూ పోవాలి. 'పాత కొత్తల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా' అన్న వాక్యానికి ఉదాహరణ దువ్వూరి రామిరెడ్డి

భావ కవిత్వ యుగంలో అభ్యుదయ గీతాలు ఆలపించిన కవి రామిరెడ్డి. దాస్యానికి వ్యతిరేకంగా గొంతెత్తి పిలుపు నిచ్చిన కవి రామిరెడ్డి మాతృ దాస్య

విముక్తికి భరత పుత్రుల మేలు కొలిపిన వైతాళికుడు రామిరెడ్డి. కృషీ వలుని కవితా సింహాసనం మీద కూర్చుండ బెట్టిన కవి రామిరెడ్డి.

రామిరెడ్డి రచనల్లో హృదయ ధర్మమైన భావావేశమూ, బుద్ధి ధర్మమయిన ఆలోచనా సమ్మిళిత మయ్యాయి. రామిరెడ్డి కవిత్వం ఛందో బద్ధం. కోకిల గానం వచనంలో ఎలా ఉంటుంది ? కవిత్వం వచన రూపంలో ఉన్నా అందులో లయబద్ధత ఉంటుందనే రామిరెడ్డి తలచాడు.

కళ కోసమే కళ వాదాన్ని రామిరెడ్డి తిరస్కరించాడు. కవి లోకాన్ని ప్రభావితం చేస్తాడు అందువల్ల ఇతరులకంటే కవికే బాధ్యత ఎక్కువ. "ఉత్తమ కవి సృష్టియందా కాలపు మానవ సంఘమునందలి సముచిత బావములు మూర్తీభవించి యుండును. అతని రచనలందు భవిష్యద్వాణి రహస్య మర్మరవములతో సంభాషించుచుండును" అని నమ్మాడు. నీతి బాహ్యమైన కవిత్వం సుందరం కాదన్నాడు. సత్యం, శివం, సుందరంగా కవిత్వం ఉండాలని ఆశించాడు. తన ఆశయానికి తగినట్లే సత్యసుభగమైన కవిత్వాన్నే సృష్టించాడు

కవిగా, విమర్శకుడుగా కవిత్వ తత్వాన్ని ఆవిష్కరించాడు రామిరెడ్డి

చిత్తరంజక రాగ నిశ్రేణి వైచి
దివ్యగానంబు భూమికి దింపరావె
తంత్రులెడలిన వల్లకీ దండ మటుల
కూజిత విహీనమై తోచు గున్నమావి

ఆ గున్నమావిని కూజితవంతం చేయడానికి భువికి దిగి వచ్చిన 'కవి కోకిల' 1947లో మూగబోయినా దాని పాటలు మన హృదయాలలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. పాకాల వేంకట రాజమన్నారు అన్నట్లు "ఆంధ్రభాష ప్రపంచంలో ఉన్నంత వరకు రామిరెడ్డి గారికి మృతి లేదు".



# కవికోకిల జీవితంలో ముఖ్య ఘట్టాలు

| | |
|---|---|
| 9-11-1895 | : ఉదయం 6.30 గంటలకు గూడూరులో పుట్టుక |
| 1915 | : సంవత్సరాంతాన కవిగా ఆవిర్భావం, వివాహం (భార్య : శేషమ్మ) |
| 1916-1917 | : కవితాభ్యాసకాలం |
| 1916-1918 | : రసిక జనానందము<br>స్వప్నాశ్లేషము } ప్రబంధాలు<br>అహల్యానురాగము<br>కృష్ణ రాయబారము } ప్రబంధాలు<br>ఋతు సంహారము<br>పుష్పబాణవిలాసము } అనువాదాలు<br>నలజారమ్మ - కావ్యం<br>కర్షకవిలాసము - నాటకం<br>మాతృశతకము |
| 1917 | : నెల్లూరులో చేరిన రెడ్డి జనసంఘం సి.ఆర్. రెడ్డిగారి అధ్యక్షతన స్వర్ణపతక బహూకరణ |
| 1918 | : వనకుమారి - కావ్యం<br>విజయనగర మహారాజాస్థానం 'వనకుమారి'కి కావ్యస్పర్థలో ప్రథమ స్థానం నాలుగువందల రూపాయల బహూకరణ |
| 1919 | : కృషీవలుడు - కావ్యం |
| 1920 | : జలదాంగన - కావ్యం |
| 1921 | : సీతావనవాసము - నాటకము |
| 1922-1923<br>20-10-1924 | : యువక స్వప్నము, కడపటివీడుకోలు - కావ్యాలు |
| 29-10-1924<br>12-2-1925 | : కుంభరాణా - నాటకం |
| 20-2-1925 | : మాధవ విజయము - నాటకం |
| 5-7-1925 | : పుత్రిక (కుముదమ్మ) జననం |

| | | |
|---|---|---|
| 9-7-1925 | : | భార్య మృతి |
| 20-8-1926 | : | పుత్రిక మృతి |
| 5-10-1926 | : | "పానశాల" అనువాద ప్రారంభం |
| 24-11-1927 | : | "పానశాల" అనువాద సమాప్తి |
| 1928 | : | "భారతి"లో పానశాల ముద్రణ |
| 21-2-1929 | : | ప్రణయబలి |
| 16-6-1929 | : | రెండవపెళ్ళి (భార్య : అన్నపూర్ణమ్మ) |
| 16-11-1929 | : | ఆంధ్ర మహాసభ బెజవాడ సమావేశంలో "కవికోకిల" బిరుదు ప్రదానం |
| 15-12-1930 | : | 'వైర్లెసు రిసీవరు' నిర్మాణం |
| 17-12-1931 | : | సీమంత పుత్ర జననం (వేణుగోపాల రెడ్డి) |
| 1934 | : | 'గులిస్తాను' అనువాదం |
| 20-9-1934 | : | ద్వితీయ పుత్ర జననం (జనార్దన రెడ్డి) |
| 4-1-1935 | : | 'కాంగ్రెస్ వాలా' - నాటకం |
| 1935 | : | పానశాల, యువక స్వప్నము - తొలి ముద్రణ, కావ్యములు, ఖండ కావ్యములు, వ్యాసములు - ద్వితీయ ముద్రణ |
| 1936 | : | సతీ తులసి : చలన చిత్రంలో సాహిత్య రచన |
| 1937-1938 | : | చిత్రనళీయము : చలన చిత్రంలో సాహిత్య రచన, దర్శకత్వం - మిత్రార్థ శతకము |
| 1939 | : | వేంకటేశ్వర మాహాత్మ్యం : చలన చిత్రంలో సాహిత్య కల్పన (పద్యాలు) |
| 1939-1942 | : | పార్వతీ కల్యాణం : సీతారామ జననం: చలన చిత్రంలో సాహిత్య కల్పన (పద్యాలు) |
| 1940 - 1944 | : | పళ్ళతోట - అనువాదం పలితకేశము, కవి - రవి కావ్యాలు |
| 1945 | : | పక్షవాతం |
| 1947 | : | డ్రై బేటరీలతో రేడియో నిర్మాణం |
| 11-9-1947 | : | రాత్రి 12 గంటలకు మరణం |

# ఉపయుక్త గ్రంథాలు


కవికోకిల - కె.వి. రమణారెడ్డి

తెలుగు పీఠిక - డి. చంద్రశేఖర రెడ్డి

తెలుగు సాహిత్యం-చారిత్రక నేపథ్యం - సం॥ డి. చంద్రశేఖర రెడ్డి

దువ్వూరి రామిరెడ్డి రచనలు
- ఒక పరిశీలన - డా. ముప్పాళ్ల వేంకట శివప్రసాదరావు

కవికోకిల డైరి - ఉత్తరాలు - సం॥ కె.వి. రమణారెడ్డి

కవికోకిల గ్రంథావళి శతజయంతి సంపుటి - 1

కవికోకిల గ్రంథావళి శతజయంతి సంపుటి - 2

పండ్లతోట

గులాబితోట

Voice of the Reed